# ముకుందవిలాసము

కాణాదం పెద్దన సోమయాజి



సంపాదకుడు :

**డా. ఆర్. శ్రీహరి,** ఎమ్.ఏ; పిహెచ్.డి.

రీడర్; తెలుగుశాఖ

హైదరాబాదు విశ్వవిద్యాలయం

ప్రచురణ :

**తెలుగు విజ్ఞానపీఠం**

"కళాభవనం", సైఫాబాదు, హైదరాబాదు-500 004.

MUKUNDA VILASAMU - Telugu classic by Kanadam Peddana Somayaji of 18th Century A. D.

Edited by Dr. R. SRI HARI, M.A;Ph.D. Reader, Dept of Telugu, University of Hyderabad, Hyderabad, Andhra Pradesh.

---

తెలుగు విజ్ఞాన పీఠం
హైదరాబాదు - 500004.

ప్రచురణ : 368

ప్రథమముద్రణ 1985

ప్రతులు 2000

వెల రూ. **10-00**

ప్రతులకు :
తెలుగు విజ్ఞాన పీఠం
కళాభవనం, సైఫాబాదు,
హైదరాబాదు - 500 004.

ముద్రణ :
చార్మినార్ ఆర్ట్ ప్రింటర్స్,
సికిందరాబాదు - 500 003.

# భూమిక

జాతి సాంస్కృతిక జీవనానికి లలితకళలు దర్పణం వంటివి. అటువంటి లలితకళలలో సాహిత్యం ప్రధానమైనది. సాహిత్యం రసప్రదాయిని, సౌందర్యదర్శిని కావడంతోపాటు సామాజిక ప్రయోజనకారి కావడమే ఇందుకు కారణం. వర్తమానం భూతభవిష్యత్తులకు వారధి. కనుక గతకాలం సాధించిన సత్ఫలితాలను పదిలపరిచి, వాటిని మరింత సుసంపన్నం చేసి భావితరాలకు అందజేసే బాధ్యత నెరవేర్చాలి.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఈ బాధ్యతను నిర్వర్తించడంలో ప్రాచీన కావ్యాలను పదిమందికి అందుబాటుచేసే నిమిత్తం వాటిని ముద్రించే, పునర్ముద్రించే పథకం చేపట్టింది. విద్వాంసులచేత చక్కగా అధ్యయనం చేయించి, కవి, కావ్యాలగూర్చి విపులమైన పీఠికలు రాయించి, అట్టి ముద్రణలో పొందుపరుస్తూ వచ్చింది. అదే విధంగా సంకలనాలు, ఆసక్తికరమైన అధ్యయనాలు కూడా ప్రకటిస్తూ వచ్చింది.

ఒక సాహిత్య రంగంలోనేగాక, తెలుగువారి సాంస్కృతిక వైభవాన్ని చాటిచెప్పే ఇతర రంగాలలోకూడా జరుగుతూఉన్న కృషిని మరింత ముమ్మరం చేసి, ఏకీకృతంచేసి ఉదాత్త స్థాయికి కొనితెచ్చే సదుద్దేశంతో మాన్యశ్రీ నందమూరి తారక రామారావుగారి నేతృత్వంలోని రాష్ట్రప్రభుత్వం ఇటీవల తెలుగు విజ్ఞానపీఠం నెలకొల్పింది. తెలుగు సంస్కృతికి సంబంధించిన వివిధ రంగాలలో కృషిచేస్తూఉన్న భిన్న ప్రభుత్వ పోషిత సంస్థలను ప్రస్తుత రూపాలలో ఉపసంహరించి, అవి చేస్తూ వచ్చిన కృషినీ, లక్ష్యించిన ధ్యేయాలనూ విస్తృతంగా, పటిష్ఠంగా కొనసాగించవలసిన బాధ్యత తెలుగు విజ్ఞాన పీఠానికి అప్పగించారు. ఈ పరిణామ కాలంలో, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ఇదివరకే ప్రారంభించిన ప్రచురణలను తెలుగు విజ్ఞానపీఠం స్వీకరించి ప్రకటిస్తున్నది. ప్రస్తుత గ్రంథం ఆ కోవలోనిదే.

"ముకుంద విలాసము" అనే ఈ ప్రబంధం పద్దెనిమిదో శతాబ్ది ఉత్తరార్ధానికి చెందిన పండితకవి కాణాదం పెద్దన సోమయాజి విరచితం. అష్ట

మహిషులలో ఒకరైన భద్రాదేవితో శ్రీకృష్ణునికి వివాహం జరగడం దీనిలోని ప్రధానేతివృత్తం. తన ప్రతిభా వ్యుత్పత్తులను జోడించి ఈ ప్రబంధాన్ని రసమందరంగా బంధకవితా బంధురంగా తీర్చిదిద్దాడు పెద్దన.

హైదరాబాదు విశ్వవిద్యాలయం తెలుగు శాఖలో రీడరుగా పనిచేస్తున్న డాక్టర్ రవ్వా శ్రీహరిగారు ఈ గ్రంథాన్ని సంపాదించి, సమగ్రమైన పీఠికను రూపొందించారు.

ఈ ప్రచురణ పాఠకుల ఆదరణకు నోచుకోగలదని మా విశ్వాసం.

తేది. 4-11-1985,
హైదరాబాదు.

**తూమాటి దొణప్ప**
ప్రత్యేకాధికారి

# విషయ సూచిక


| | పుట |
|---|---|
| **ఆముఖం** | 1 |
| ప్రథమాశ్వాసము | |
| అవతారిక | 1 |
| ద్వారకా వర్ణన | 26 |
| శ్రీకృష్ణుని వర్ణన | 34 |
| శ్రీకృష్ణుడు ఇంద్రప్రస్థ పురమునకు వెళ్ళి తిరిగి ద్వారకకు వచ్చుట | 40 |
| మయుడు శ్రీకృష్ణునికి రైవతక పర్వతముపై క్రీడారామమును నిర్మించి యిచ్చుట | 45 |
| క్రీడారామ వర్ణన | 48 |
| మయుడు నిర్మించిన క్రీడారామమున ఇంద్రుడు హరిచందనాది వస్తు సమితిని ఏర్పఱచుట | 49 |
| గదుడు కేకయ పురమునకు వెళ్ళి తిరిగి వచ్చుట | 51 |
| గదుడు భద్రా సౌందర్యమును శ్రీకృష్ణునికి తెలుపుట | 52 |
| వసంత వర్ణన | 56 |
| వనపాలకులు శ్రీకృష్ణునికి రైవతక పర్వతమందలి క్రీడారామ శోభను వివరించుట | 62 |
| శ్రీకృష్ణుడు రైవతక పర్వతమునకు వెళ్ళుట | 64 |
| వనపాలకులు శ్రీకృష్ణునికి రైవతక శోభను వివరించుట | 64 |
| కృష్ణుడు రైవతక పర్వతమందలి క్రీడావనమున విహరించుట | 67 |

## ద్వితీయాశ్వాసము


| | |
|---|---|
| శ్రీకృష్ణుడు క్రీడావనమున విహరించుచు ఒక సురసాలముపై రాచిలుకను చూచి దానిని పట్టుకొనుట | 73 |
| చిలుక మనుజ భాషణములతో శ్రీకృష్ణునితో | 77 |
| పలుకుట | 77 |
| చిలుక శ్రీకృష్ణుని స్తుతించుట | 79 |
| చిలుక భద్రా వృత్తాంతమును శ్రీకృష్ణునికి తెలుపుట | 82 |
| చిలుక భద్రాదేవి సౌందర్యమును శ్రీకృష్ణునికి వివరించుట | 92 |
| చిలుక తెచ్చిన భద్ర చిత్రపటమును చూచి శ్రీకృష్ణు డామె సౌందర్యమును వర్ణించుట | 116 |
| చిలుక కృష్ణుని అంతఃపురమునకు వెళ్ళి హరి పట్టపు రాండ్రకు తన విద్యా మహత్త్వమును తెలిపి కేకయనగరమునకు తిరిగి పోవుట | 124 |
| కృష్ణుడు భద్రకై పరితపించుట | 128 |


## తృతీయాశ్వాసము


| | |
|---|---|
| చిలుక కేకయ పురమునకు తిరిగివచ్చి భద్రకు శ్రీకృష్ణు డిచ్చిన పుష్పహారము నిచ్చుట | 136 |
| చిలుక భద్రకు శ్రీకృష్ణుని సౌందర్యమును వివరించుట | 137 |
| సాయంకాల వర్ణన | 142 |
| చంద్రోదయ వర్ణన | 144 |
| మన్మథాద్యుపాలంభము | 147 |
| భద్రాదేవి విరహతాపము | 153 |
| ప్రాతఃకాల వర్ణన | 156 |
| చెలికత్తెలు భద్రను ఉపవనమునకు తీసికొనిపోవుట | 158 |
| ఉపవన వర్ణన | 158 |

| | |
|---|---|
| జలక్రీడా వర్ణనము | 160 |
| కేకయరాజు భద్రకు స్వయంవరమును చాటుట | 165 |
| స్వయంవరమునకు వచ్చిన వివిధ రాజులను చిలుక భద్రకు పరిచయము చేయుట | 172 |
| భద్ర శ్రీకృష్ణుని వరించుట | 178 |
| తనపై కవిసిన రాజులను శ్రీకృష్ణుడెదుర్కొనుట | 179 |
| భద్రా శ్రీకృష్ణుల వివాహము | 188 |
| శ్రుతకీర్తి భద్రకు బుద్ధులు చెప్పుట | 192 |
| భద్రా శ్రీకృష్ణులు ద్వారకకు తిరిగివచ్చి సుఖసంతోషాలలో ఓలలాడుట | 198 |



# ఆముఖం

## గద్వాలసంస్థానం

విద్వత్కవిపోషణకూ, సాహిత్యవ్యాప్తికీ విశేషఖ్యాతిగాంచిన గద్వాల సంస్థానం తెలంగాణంలోని సంస్థానాలలోకెల్లా అగ్రగణ్యమై'విద్వద్గద్వాల'గా ప్రసిద్ధి పొందింది. "మా గద్వాలకు రాకయున్నఁ గలదే మాన్యత్వ మీనాటికిన్' అని ఒక కవి గర్వంగా చెప్పుకోదగ్గ గొప్పకీర్తికి పాత్రమైనది. గద్వాల ప్రభువులు పాకనాటిరెడ్లు. ఇంటిపేరు ముష్టిపల్లివారు[1]. మి(డి)నిమిళ్ళగోత్రీయులు.[2] వీరి వంశానికి పెద్దారెడ్డి మూల పురుషుడు.[3] ఇతడు మొదట ఐజ, కందనూలు (కర్నూలు) సీమలపై నాడగౌడరికాన్ని సంపాదించినాడు. పూడూరుసీమకు నాడగౌడుగానుండిన వీరారెడ్డి కూతురైన బక్కమాంబికను వివాహమాడి ఆసీమకుకూడా అధిపతి ఐనాడు, ఇతనికి బక్కమాంబిక యందు పెదసోమ భూపాలుడు, సిరిగాధిపుడు అనే ఇద్దరు కుమారులు జన్మించినారు. పెద్దారెడ్డి తరువాత ఆతని పెద్దకుమారుడైన పెదసోమభూపాలుడు నాడగౌడరికాన్ని సంపాదించినాడు.[4] ఇతనికి శోభనాద్రి, సోమనాద్రి, సలసోమనాద్రి అని నామాంతరాలు. ఇతడు గొప్ప పరాక్రమవంతుడై యవనుల నోడించి ఎన్నోపరగణాలను ఆక్రమించి తన సామ్రాజ్యాన్ని విస్తృతిగావించినట్లుగా యథాశ్లోకతాత్పర్యరామాయణంలోని కిందిపద్యం వల్ల తెలుస్తుంది.

> ఐజ దరూరుల కధిపుఁడై విలసిల్లి
> బన్గానిపల్లె దోర్బలతఁజెంది
> సిరువెళ్ళ నంద్యాల సిద్ధాపురంబులు
> ఖండాత్మకూరహోబలపు సీమ
> సాధించి తురుకల సంహార మొనరించి
> కందనూల్కోట్టడిగా నమర్చి

1. ము. వి 1-36,37 2. య, తా, రా; అవతారిక
3. ము. వి. 1-36. 4. అందే. 1-38, 42, 48

2

దుర్గంబు సాధించి తొలఁగగ.........
స్వరమాత్మవశత పెంపొందఁజేసి

విక్రమంబున సకలభూచక్రమెల్ల
నాక్రమించి దిగంతంబులందుఁగీర్తి
నించి గద్వాలపురమధిష్ఠించి వెలసె
నృపతిమాత్రుండె సోమావనీవిభుండు. (పుట. 8)

క్రీ. శ. 1698-1705 మధ్య ప్రాంతంలో పూడూరుకు ఐదుమైళ్ళ దూరంలో ఉన్న విశాలమైన మైదానంలో 'గద్వాల' నగరాన్ని నిర్మించి అక్కడికి తన రాజధానిని మార్చుకున్నాడు. గొప్ప భగవద్భక్తుడు. గద్వాలలో చెన్నకేశవస్వామి ఆలయాన్ని నిర్మించి పూడూరు కేశవస్వామిని అందు ప్రతిష్ఠించినాడు. తన సర్వస్వాన్ని ఆ కేశవస్వామికే అర్పించి స్వామి ప్రతినిధిగ తాను రాజకార్యాలను నిర్వహించినాడు.[1] ప్రతిసంవత్సరం శరత్పూర్ణిమోత్సవాలను, శిశిరపూర్ణిమోత్సవాలను నిర్వహించి విద్వత్కవిగాయకులను సంభావించినాడు.[2] ఇతడు కవిపండిత పోషకుడే కాక స్వయంగా కవికూడా. జయదేవుడు రచించిన సంస్కృత గీతగోవింద కావ్యాన్ని తెలుగులో అనువదించినాడు.[3] సోదరుడైన సిరిగాధిపుడు యవనరాజుల నందరినీ సరిగావులుగా చేసి అన్నకు ఎంతో అండగా నిలిచినాడు.[4] పెదసోమభూపాలునికి అమ్మమాంబ, లింగాంబ, రామాంబ అని ముగ్గురు భార్యలు. వీరిలో లింగాంబవల్ల తిరుమలరాయలు, రామరాయలు అనే ఇద్దరు కుమారులు జన్మించినారు.[5] పెదసోమ భూపాలుని అధీనంలో ఉన్న కర్నూలు దుర్గాన్ని స్వాధీనం చేసుకోవటానికి నైజాముల్ముల్క్ పంపిన దిలీల్‌ఖాన్ అనే సర్దారుతో నిడుదూరు మిట్టల దగ్గర యుద్ధంచేసి పెదసోమ భూపాలుడు క్రీ. శ. 1712 (నందన సంవత్సర జ్యేష్ఠ శుద్ధ అష్టమినాడు)లో మరణించినాడు. క్రీ. శ. 1663-1712 మధ్యకాలం ఈతని పరిపాలనాకాలం.[6] పెదసోమభూపాలుని మరణానంతరం, ఆతని కుమారులైన తిరుమలరాయలు, రామరాయలు బాలురు కావటంవల్ల వెంకయ్య, రమణయ్య అనే ఉద్యోగులు, ఆ తరువాత సోమ భూపాలుని

---

1. ము. వి. 1-48, 49, 52. 2. అందే. 1-48. 3. కా. నం. 263 పు.
4. ము. వి. 1-54. 5. అందే 1-56, 57. 6. కా. నం. 263 పు.

భార్యలైన అమ్మాంబ, లింగాంబ రాజ్యకార్యాలను నిర్వహించినట్లుగ చారిత్ర కుల కథనం[1]. ఆ తరువాత తిరుమలరాయలు, రామరాయలు క్రమంగా రాజ్యాధి కారాన్ని పొందినారు. క్రీ.శ. 1761లో రామరాయలు మరణించగా అతని సోద రుడైన తిరుమలరాయలకు మంగాంబయందు జన్మించిన చినసోమభూపాలుడు అధి కారానికి వచ్చినాడు.[2] ఆంధ్రవాఙ్మయాభివృద్ధికి చినసోమభూపాలుని రాజ్యకాలం స్వర్ణయుగమని చెప్పవచ్చు. సమకాలికులచే ఇతడు అభినవ భోజుడుగా ప్రశంసింప బడినాడు. కవిపండిత పోషకుడే కాక స్వయంగా కవి. హరిభట్టు సంస్కృతంలో రచించిన రతిరహస్యాన్ని ఆంధ్రీకరించినాడు.[3] సోమభూపాలుని తెనుగు కృతికే హరిభట్టు రచన సంస్కృతీకరణమని గోలకొండ కవుల సంచిక తెలుపుతుంది కాని ఇది ప్రామాదికమని డా. దేవళ్ళ చిన్ని కృష్ణయ్యగారి అభిప్రాయం.[4] సుప్రసిద్ధులైన కాణాదం పెద్దన సోమయాజి, కిరీటి వేంకటా చార్యులు, కొత్తపల్లి రామాచార్యులు, గార్గ్యపురం సుబ్బశాస్త్రి, కామ సముద్రం అప్పలాచార్యులు, తిరుమల కృష్ణమాచార్యులు, బోరవెల్లి శేషా చార్యులు, సోమనాథశాస్త్రి- అనే ఎనమండుగురు విద్వత్కవులు ఈతని ఆస్థానాన్ని అలంకరించిన వాళ్లలో మూర్ధన్యులు.

ముకుందవిలాసంలోని కింది పద్యాలవల్ల ఈతని కవిపండితపోషణ, దాతృత్వగుణం ఎట్టివో తెలుసుకోవచ్చు.

సుకవులకొకరొక్కరికి కొసంగె నే ఘనుం
డలరి వేనూటపదార్లు గాఁగ
బహుభక్ష్య సత్రముల్ వరగించె నే దాత
ద్విజులకర్థము పదివేలు గాఁగ
మాఘకార్తిక పూర్ణిమల నిచ్చె నే రాజు
విప్రకోటికి బహువేలు గాఁగ (1-74)
దయ సర్వ లీలచేఁదనరి విద్వాంసుండ
లమునకుఁ జంద్రహారము లొసంగె
శ్రుతిహితస్థితి సుధృత్ర్తతికి రసికతా ప్తి
మణికుండలాదిభూషణములిడియె

1. కా. సం. 268 పు. 2. అందే. 264 పు.
3. అందే. 265 పు. 4. వ. పు. పీఠిక. 11 పు.

మతి మెచ్చి వరదుఁడై హితపండితాళికి
భూరికాంచీయుక్తి బొసఁగఁజేసె
సవరించెఁదగు నభిజ్ఞత సత్కృతి స్ఫూర్తి
కవిగాయకుల కలంకారపుష్టి (1-75)

1, కాణాదం పెద్దన :- ఇతడు వేదశాస్త్ర పురాణమర్మధురీణుడు. ఆశు, చిత్ర, బంధ, గర్భకవితా నిర్మాణదక్షుడు. సురపుర సంస్థాన ప్రభువైన రాజాబహిరి పామనాయకుని (ఇతని పేరు రాఘవభూపాలుడు) పోషణలో చంపూ రామాయణానికి వ్యాఖ్యను, ఆంధ్రమత్స్య పురాణాన్ని, శేషశైలేశ లీల ప్రబంధాన్ని రచించినాడు. తరువాత గద్వాల ప్రభువైన చినసోమ భూపాలుని పోషణలో ముకుందవిలాసం (భద్రాపరిణయం) అధ్యాత్మ రామాయణం, యథాశ్లోక తాత్పర్య రామాయణంలో బాలకాండ అనే కృతులను రచించి గద్వాల కేశవస్వామికి అంకితం చేసినాడు.

కిరీటి వెంకటాచార్యులు :- ఈతడు సర్వతంత్ర స్వతంత్ర, రాజాధి రాజగురు సార్వభౌమ, తర్కాలంకార వాచస్పతి, శ్లేషయమక చక్రవర్తి, ప్రతిదినప్రబంధ పరమేశ్వరేత్యాది బిరుద విరాజితుడు. తిరుమల బుక్కపట్టణ వంశీయుడు. కాశి మొదలైనచోట్ల శాస్త్రవాదాల్లో పాల్గొని విద్వాంసులను గెలిచి ద్వైతాద్వైతమతాలనే పాదుకలను, స్వమతస్థాపన-పరమత ఖండనలనే చామరాలను, విశిష్టాద్వైతమనే కిరీటాన్ని ధరించటంవల్ల ఈ కవికి 'కిరీటి' అన్న బిరుదం వచ్చింది. వీరి అలంకారకౌస్తుభం, ఝంఝూ మారుతం (గదాధరీయఖండనం), శృంగార తరంగిణి, రసికమానసోల్లాసం. శుకాభిపతనం, ఉషాపరిణయ నాటకం, యతిరాజ దండకం, హయగ్రీవదండకం, దశావతార స్తోత్రం, భావశతకం, అచలాత్మజా పరిణయం (ద్వ్యర్థి కావ్యం) గజసూత్ర వాదం, శృంగారలహరి - ఇత్యాది సంస్కృతాంధ్ర గ్రంథాలు వీరి ఉభయ భాషా పాండిత్యాన్ని వ్యక్తం చేస్తాయి.[1] తొలుత సురపుర సంస్థానంలో ఉండి తరువాత గద్వాల సంస్థానానికి వచ్చి ఉంటాడు.

కొత్తపల్లి రామాచార్యులు :- యథాశ్లోకతాత్పర్య రామాయణం లోని అయోధ్యాకాండను రచించిన కవీంద్రుడు.

---

1. గో. క. సం. 411 పుట.

గార్గ్యపురం సుబ్బశాస్త్రి :- ఉభయ కవితా నిస్సహాయ సాహితీ ధురీణుడు. ఇతడు యథాశ్లోక తాత్పర్య రామాయణంలోని అరణ్యకాండను పూర్తిచేసినాడు.

కామసముద్రం అప్పలాచార్యులు :- విద్వత్కవికుంజర బిరుదాంచితుడు. యథాశ్లోక తాత్పర్య రామాయణ రచనకు ఆధ్వర్యవం వహించి అందులోని కిష్కింధాకాండను రచించినాడు. కృష్ణలీలా తరంగిణి (ఆంధ్రాష్టపది)ని సంతరించినాడు. ఇతని తండ్రి అష్టభాషాకవి కృష్ణార్యుడు.[1] యథా శ్లోక తాత్పర్య రామాయణావతారికలోని ఈ కింది పద్యంవల్ల అప్పలాచార్యులు సంస్కృత ప్రాకృతాలలోను, తెనుగులోను చిత్రకవితాప్రబంధాల నెన్నింటినో రచించిన ప్రౌఢకవీశ్వరుడని తెలియవస్తుంది.

> "నను శ్రీవేంకటశైలరాట్పద శరణ్యస్వాంతు నశ్రాంతసం
> జనితస్వర్గ సరిత్తరంగలహరీ సందోహ సందేహ కృ
> ద్ఘనవాగ్ధోరణి నాంధ్రసంస్కృత విచిత్ర ప్రౌఢ చాతుర్యక
> ల్పను సద్విప్రుని వైష్ణవప్రవరుఁ బిల్వంబంచి పల్కెంగృపన్"
>
> (పుట 5)

సకలవిద్వత్కవీశ్వరులెన్న సంస్కృత
కృతుల సరసచమత్కృతులఁగొన్ని
మాగధి శౌండీరమాళవీ ప్రముఖ స
త్ప్రాకృతమ్ములఁ బ్రబంధములు కొన్ని
చక్రకకంకణ పద్మశంఖశా......గజాశ్వ
రథముఖాకృతులఁ జిత్రములు కొన్ని
మఱియు తద్భవతత్సమ ప్రభృతుల విశ్రు
తముగ నాంధ్రప్రబంధములు కొన్ని
రచనసేసి సమస్తరాజసభల
నెలమిఁ గీర్తి వహించితి విప్పుడాది
కావ్యమిది దివ్యమాంధ్రంబుగా నొనర్చి
శౌరి కర్పింపు మప్పలాచార్య సుకవి! (పుట 5)

---

1. గో. ౪. సం. 395 పుట.

తిరుమల కృష్ణమాచార్యులు :- అష్టభాషాకవితా ధురంధరుడు. యథాశ్లోకతాత్పర్యరామాయణంలోని సుందరకాండను రచించినాడు.

బోరవెల్లి శేషాచార్యులు :- ఇతడు యథాశ్లోకతాత్పర్యరామాయణంలోని యుద్ధకాండను రెండు భాగాలుగా రచించినాడు.

## కాణాదం పెద్దనసోమయాజి

ఇక ప్రస్తుత ప్రబంధకర్తా, చినసోమ భూపాలుని ఆస్థానకవీ ఐన కాణాదం పెద్దన సోమయాజికి సంబంధించిన విశేషాలను తెలుసుకుందాం.

ఇతడు నందవర శాఖీయుడు, ఆశ్వలాయన సూత్రుడు. ఆత్రేయముని గోత్రుడు వేదశాస్త్ర పురాణాల మర్మాలను పుక్కిట బట్టినవాడు. చతుర్విధ కవితారచనలో ప్రవీణుడు. 'బాహట గ్రంథానుభావధుర్య' (ము. వి. 1-23) అని చెప్పుకొనుటచే ఆయుర్వేదంలో మంచి పండితుడై ఉండవచ్చు. ఇతని తండ్రి తిమ్మన. తాత వేదశాస్త్ర పురాణవేదీ, సుకవీ ఐన కృష్ణసోమయాజి. సోదరుడు లక్ష్మీపతి. ప్రౌఢ పండితుడు. బావ దూర్వాసి నాగార్యుడు. సరసకవితాలహరీ ధూర్వహుడు. ఈతని వంశీయులంతా ప్రబంధరచనా పారీణులే. కాని వారి రచనలమాట అటుంచి కనీసం వాటి పేర్లైనా తెలియరావటంలేదు. ఈ విధంగా నామ, రూపాలు లేకుండా కాల గర్భంలో కలిసిపోయిన ఉత్తమకృతులు ఎన్నో ? పెద్దన గురువు పిల్లే వంశీయుడైన మల్లేశ్వర దీక్షితులు. వేదశాస్త్ర యోగాన్వితులు.[1] ముకుందవిలాసాన్ని రచించిన తరువాత పెద్దన సోమయాగం చేసి సోమయాజి ఐనాడు.

పెద్దన తొలుత సురపుర సంస్థానాధీశుడైన పామ నృపాలుని ఆస్థానంలోనూ తరువాత గద్వాల చినసోమ భూపాలుని ఆస్థానంలోనూ వెలుగొందినాడు. పామనృపాలుడు 1752-1773 మధ్య కాలంలోనూ, చినసోమ భూపాలుడు క్రీ. శ. 1764-1794 మధ్య కాలంలోనూ రాజ్యాన్ని పరిపాలించినారు. అందువల్ల పెద్దన సోమయాజి 18వ శతాబ్దికి చెందిన కవిగా భావించవచ్చు.

---

1. ము. వి; పీఠిక.

## పెద్దనసోమయాజి కృతులు

### 1. భోజవ్యాఖ్య :

ఇది సంస్కృతంలో భోజుడు వ్రాసిన రామాయణానికి పెద్దన వెలయించిన సంస్కృతవ్యాఖ్య. చంపూరీతిలో రచింపబడ్డ ఈ రామాయణాన్ని భోజచంపువు, రామాయణ చంపువు, చంపూరామాయణం అనే పేర్లతో వ్యవహారిస్తారు. దీనికి రామచంద్రపండితుడు సాహిత్య మంజూషికా వ్యాఖ్యను, నారాయణ పండితుడు పదయోజన వ్యాఖ్యను రచించినారు. వీళ్ళిద్దరూ తెలుగువాళ్లే. రామచంద్రుడు తెలుగువాడైన కొండుభట్టు కుమారుడు. నారాయణుడు వ్యాఖ్యాతృ చక్రవర్తి కోలాచల మల్లినాథసూరి వంశీయుడు. పెద్దన సంతరించిన భోజ చంపూటీకకు ఆంధ్రులైన ఈ వ్యాఖ్యాతల వ్యాఖ్యలే ప్రేరకాలు కావచ్చు. ఈ వ్యాఖ్యారచనవల్ల పెద్దనకున్న సంస్కృతభాషా పాండిత్యాన్ని ఊహించవచ్చు. కాని ఈ వాఖ్య లభ్యంకాలేదు.

### 2. శేషశైలేశలీల :

ఇది చిత్రకవితా రీతిలో నిర్మింపబడిన ప్రబంధం. క, చ, ట, త, ప అనే ఐదు వర్గాక్షరాలకు చెందిన ఇరవైఐదు అక్షరాలను వదలి కేవలం ఎనిమిది అంతఃస్థోష్మ వర్ణాలతో - అంటే య, ర, ల, వ, శ, ష, స, హాలతో మాత్రమే పద్యరచన సాగటం ఇందులోని చిత్రత. కావ్యనామంలో కూడా ఈ చిత్రత కానవస్తుంది. పెద్దన పాండిత్య ప్రకర్షకూ, చిత్రకవితా ప్రీతికీ ఈ కావ్యం చక్కటి నిదర్శనం. ఈ కావ్యం అలబ్ధం.

### 3. మత్స్యపురాణం :

పెద్దన రాజాబహిరి పామన్నపాలుని ఆస్థానంలో ఉన్నప్పుడు రచించిన కృతి. సంస్కృతమత్స్య పురాణానికి అనువాదం. "మత్స్యపురాణ మొనర్పవే, సారసుధా ప్రసార విలసత్కృతి సాంద్రవచశ్చమత్కృతిన్" (ము. వి. 1-25) అని చినసోమ భూపాలుని ముఖంగా పెద్దన తన మత్స్యపురాణాన్ని ప్రశంసించుకున్నాడు. ఈ కావ్యంకూడా లబ్ధంకాలేదు. పెద్దన గద్వాలకు రాకపూర్వం సురపురసంస్థానంలో ఉన్నప్పుడు రచించిన గ్రంథాలన్నీ లభ్యం కాకపోవటానికి కారణమేమిటో !

## 4. ముకుందవిలాసము :

అష్టమహిషులలో ఒకరైన భద్రాదేవితో శ్రీకృష్ణునికి జరిగిన వివాహ వృత్తాంతం ఇందులోని ప్రధానేతివృత్తం. భద్రాపరిణయం, భద్రాపరిణయోల్లాసం అని దీనికి నామాంతరాలు. చినసోమ భూపాలుని ఆస్థానంలో చేరిన తరువాత ఆతని ప్రేరణచే పెద్దన రచించిన మొదటి ప్రబంధం. ఇది గద్వాల కేశవస్వామికి అంకితం చేయబడింది. శ్లేష, శబ్దాలంకారాలు, బంధకవిత మొదలైన చిత్రకవితా విన్యాసాలు ఎన్నో ఈ కావ్యంలో కనిపిస్తాయి. ఈ కావ్యానికి సంబంధించిన ఇతర విశేషాలు తరువాత వివరింపబడతాయి.

## 5. అధ్యాత్మరామాయణము :

ముకుందవిలాసాన్ని రచించేనాటికి పెద్దన సోమయాజి కాలేదు. ముకుంద విలాసంలోని కింది ఆశ్వాసాంత గద్యమే దీనికి ప్రమాణం.

"ఇది శ్రీమదుభయకవితా నిస్సహాయ సాహితీవిహార కాణాదాన్వయ తిమ్మనార్యకుమార వినయగుణధుర్య పెద్దనార్య ప్రణీతంబైన భద్రాపరిణయోల్లాసంబగు ముకుందవిలాసంబను మహాప్రబంధంబునందు......

పై గద్యలో పెద్దనకు సోమయాజి బిరుదం లేదు. ముకుందవిలాసం తరువాత రచింపబడ్డ అధ్యాత్మరామాయణ, యథాశ్లోక తాత్పర్య రామాయణాల ఆశ్వాసాంత గద్యల్లో పెద్దనకు సోమయాజి బిరుదం కనిపిస్తున్నది.

"ఇది శ్రీమదుభయ కవితానిస్సహాయ సాహితీ విహార
కాణాదాన్వయ తిమ్మనార్య కుమార వినయ విభ్రాజిత
పెద్దన సోమయాజి ప్రణీతంబైన అధ్యాత్మరామాయణంబునందు

(యథాశ్లోకతాత్పర్య రామాయణంబునందు)......

కనుక పెద్దన ముకుందవిలాసాన్ని రచించిన తరువాతనే సోమయాజియై అధ్యాత్మ రామాయణాన్ని రచించినాడని చెప్పవచ్చు. ఇది బ్రహ్మాండ పురాణంలోని ఉత్తరకాండంలో ఉన్న ఏడుకాండల అధ్యాత్మ రామాయణానికి అనువాదమనే విషయం పెద్దన అధ్యాత్మరామాయణావతారికలోని కింది పద్యం వల్ల తెలుస్తుంది.

"ధర బ్రహ్మాండపురాణరాజమున విస్తారస్థితింబొల్చు ను
త్తరఖండంబున కాండసప్తకముతో తత్త్వార్థ సారాంశమై
యరయన్ రామకథాసుధాకలితమై యధ్యాత్మరామాయణం
బరుదౌ మీరది కేశవాంకితముగా నాంధ్రోక్తిఁ జేయందగున్.

జాంబవత్పాదబంధం, రథబంధం, పాదభ్రమకం మొదలైన చిత్రకవితా రూపాలు ఇందులోకూడా కానవస్తవి. ఇందులోని కవిత్వశైలికి మాసరగా ఒకటి రెండు పద్యాలు.

పవసమనోజవంబులనుఁ బట్టుగ నిల్పగఁజాలు నాత్మవై
భవములు బొల్చు సత్వరత భంగినెసంగి ఖలీనధావనా
ప్రవళగతి ప్రభావముల భాసిలు యోగ్యవతంసవృత్తిచే
నవిరళవైరి వర్గవిజయాహ్వయముల్ హయముల్ పురంబునన్
(బాలకాండం)

అతిసత్త్వంబళనిప్రభంబు నతివేగారూఢమౌ బాణమీ
గతిచే రాఘవుఁడచ్యుతుండు వయివంగా నమ్మహాస్త్రంబును
గ్రత వక్షమ్మునుజొచ్చి వచ్చి చనినంగంపించి యవ్వాలి య
ద్భుతశబ్దంబొనరించి బిట్టెగసి తోడ్తో ధాత్రి వ్రాలెన్వెసన్
(కిష్కింధాకాండం)

## 6. యథాశ్లోకతాత్పర్యరామాయణము (బాలకాండ)

ఈ రామాయణ రచనకు పూర్వం తెలుగులో వెలసిన భాస్కర రామాయణం, రంగనాథ రామాయణం మొదలైన రామాయణాలు ఉన్నాయి. అవి ప్రధానకథను వాల్మీకి రామాయణంనుండే గ్రహించినా పూర్తిగా మూల విధేయాలు కావు. ఎన్నో కొత్తకల్పనలు వీటిలో చోటు చేసుకున్నవి. వాల్మీకంలో ఉన్న అంశాలను యథాతథంగా తెలుసుకోదలచినవాళ్ళకు ఇవి ఉపయోగపడవు. అందువల్ల పెదసోమ భూపాలుడు తన ఆస్థానకవులచేత వాల్మీకంలో ఉన్న ప్రతిశ్లోకభావం వచ్చేట్లుగా ఒక రామాయణాన్ని రచింపింపదలచినాడు. కాని ఈ సంకల్పం ఆతని జీవిత కాలంలో నెరవేరలేదు. చినసోమన తన తాత సంకల్పాన్ని నెరవేర్చదలచి ఈ రామాయణరచనను కొనసాగించ

వలసిందిగా తన ఆస్థానకవులను కోరుతాడు కామసముద్రం అప్పలాచార్యుల వారి పర్యవేక్షణలో ఈ రచన సాగుతుంది. కాణాదం పెద్దన (బాలకాండం) కొత్తపల్లి రామాచార్యులు (అయోధ్యాకాండం) గార్గ్యపురం సుబ్బశాస్త్రి (అరణ్యకాండం) కామసముద్రం అప్పలాచార్యులు (కిష్కింధాకాండం) తిరుమల కృష్ణమాచార్యులు (సుందరకాండం) బోరవెల్లి శేషాచార్యులు (యుద్ధ కాండం) ఈ రామాయణాన్ని పూర్తి చేసినారు.

ఈ రామాయణంలోని పెద్దనశైలికి ఒక ఉదాహరణం.

గంగను సరయూనది సెసఁ
గంగను సంగమమగుచోఁ దగంగను దరినా
గంగను గాంచిరి వారరు
గంగను దివ్యమగు త్రిపథగంగను వేడ్కన్ (2 ఆశ్వాసం)

పెద్దన రచించిన గ్రంథాలలో లభ్యమౌతున్న ముకుందవిలాసం, అధ్యాత్మ రామాయణం, యథాశ్లోక తాత్పర్య రామాయణం- ఈ మూడూ గద్వాల ప్రభువైన రాజారామ భూపాలరావు బహద్దర్ గారిచే తమ సాహిత్య విద్యా ముకురముద్రాక్షరశాలలో ముద్రింపబడినవి.

ఇంతవరకు ముకుందవిలాసకర్త కాణాదం పెద్దన విరాజిల్లిన గద్వాల సంస్థానాన్ని గురించీ, తత్ప్రభువుల గురించీ, ఆతని రచనలను గురించీ వివరింపబడింది. ఇక ముకుందవిలాస ప్రబంధాన్ని గురించి వివరంగా తెలుసుకుందాం.

## కథాసంగ్రహం

### ప్రథమాశ్వాసము :

శ్రీకృష్ణుడు ద్వారకలో ఉంటూ ప్రజలను ఈతిబాధలు లేకుండా పాలిస్తూ ఒకనాడు పాండవులను చూడగోరి ఇంద్రప్రస్థ పురానికి వెళ్ళి అక్కడ కొంతకాలం ధర్మజాదులతో కాలక్షేపం చేస్తూ ఉంటాడు. ఒకనాడు కృష్ణార్జులిద్దరు ఏవో ముచ్చట లాడుతుండగా వారిదగ్గరికి అగ్ని దేవుడు వచ్చి ఖాండవవనాన్ని ఆహుతిగా వేడుకుంటాడు. కృష్ణార్జునులందుకు అంగీకరిస్తారు. అగ్ని దేవుడు ఖాండవ వనాన్ని దహిస్తుండగా ఆ వనంలో ఉన్న మయుడు అగ్నిదాహాన్ని భరించలేక అర్జునుణ్ణి శరణు వేడుకుంటాడు. అర్జునుడు మయుణ్ణి రక్షిస్తాడు. మయుడు కృతజ్ఞుడై అర్జునునికి మయసభను సమర్పిస్తాడు. కొంతకాలం తరువాత శ్రీకృష్ణుడు ధర్మరాజాదుల సెలవు తీసుకొని ద్వారకకు తిరిగి వస్తాడు.

అర్జునుడు తనను రక్షించింది శ్రీకృష్ణుని మూలంగానే కదా అని మయుడు ఒక చిత్రసభను నిర్మించి దానిని శ్రీకృష్ణునికి సమర్పించాలని ద్వారకకు వెళ్ళి శ్రీకృష్ణుని భవనంలో ప్రవేశిస్తాడు. శ్రీకృష్ణుని మాయా ప్రభావం వల్ల ఆ సభాభవనమంతా ఆతనికి పలువింతలతో కనిపిస్తుంది. తానే మార్గంలో వచ్చింది, తిరిగి ఏ మార్గంలో వెళ్ళవలసింది తెలియక మయుడు అయోమయ పరిస్థితిలో పడి విశ్వమయుడైన అచ్యుతునికి తాను చిత్రసభను సమర్పింప బూనటం అవివేకమే అని భావించి శ్రీకృష్ణునితో ఇలా అంటాడు.

"స్వామీ! మీరు నన్ను అగ్నిజ్వాలలనుండి రక్షించినారు. ప్రత్యుపకార బుద్ధితో నేనేవస్తువులను మీకు సమర్పించదలచుకున్నాను. అదేమి చిత్రమోకాని ఆ వస్తువులన్నీ మీ నగరంలో ప్రత్యక్షమౌతున్నాయి. కనుక రైవతక పర్వత సానుతలంమీద మీకొక కేళీవనాన్ని నిర్మిస్తాను. దయతో అంగీకరించండి."

అందుకు శ్రీకృష్ణుడంగీకరిస్తాడు. ఇంద్రుని నందనవనంతోనూ, కుబేరుని చైత్రరథంతోనూ, వరుణుని ఋతుమంతంతోనూ దీటైన ఒక అందమైన ఆరామాన్ని రైవతకంపైన నిర్మించి శ్రీకృష్ణునికి సమర్పిస్తాడు.

ఖాండవవనదహన సమయంలో దర్పంతో తాను చేసిన చేష్టలకు పశ్చాత్తప్తుడై ఇంద్రుడు వింతైన దివ్యవస్తువుల నెన్నిటినో కానుకలుగా తెచ్చి శ్రీకృష్ణునికి సమర్పించదలచు కుంటాడు. కాని తాను కానుకలుగా తెచ్చిన దివ్యవస్తువులన్నీ ద్వారకలో ప్రతి ఇంటా కనబడటంతో ఇంద్రుడు శ్రీకృష్ణుని మహిమకు ఆశ్చర్య పడతాడు. చివరికి ఆతని అంగీకారంతో మయుడు రైవతక పర్వతంపైన నిర్మించిన కేళీవనంలో దివ్యహరిచందనాది లతాసంచయాన్ని నాటి స్వర్గలోకానికి వెళ్ళిపోతాడు. శ్రీకృష్ణుడా కేళీ వనంలో విహరిస్తూ సుఖంగా ఉంటాడు.

ఒకనాడు వసుదేవుడు చెల్లెలైన శ్రుతకీర్తి (సాత్వతి) యోగక్షేమాలను తెలుసుకొని రావటానికి తన కుమారుడైన గదుణ్ణి పంపుతాడు. గదుడు కేకయపురానికి వెళ్ళి మేనత్త యోగక్షేమాలను తెలుసుకొని వచ్చి తన తండ్రికి తెలియజేస్తాడు. ఏకాంతంగా శ్రీకృష్ణునితో మేనత్త కూతురైన భద్రాదేవి సౌందర్యాతిశయాన్ని గూర్చి చెపుతాడు. శ్రీకృష్ణునికి భద్రపై ప్రేమ

అంకురిస్తుంది. వసంతంలో ఒకనాడు శ్రీకృష్ణుడు రైవతక పర్వతానికి వెళ్లి తదారామశోభను తిలకిస్తూ ఆనందమగ్నుడౌతాడు.

**ద్వితీయాశ్వాసము :**

అప్పుడు శ్రీకృష్ణునికి ఆ ఆరామంలోని ఒక మామిడి చెట్టుపై జగన్మోహనాంగమైన ఒక రాచిలుక కనిపిస్తుంది. ఆకారంలోనూ, విలాసంలోనూ, వాగ్విలాసంలోనూ దీటులేని ఆ చిలుకను చూసి శ్రీకృష్ణుడు ఆశ్చర్యచకితుడై దాన్ని పట్టుకుంటాడు. అప్పుడా చిలుక మనుజ వాక్కులతో మృదు మధురరీతిలో శ్రీకృష్ణుణ్ణి స్తుతించి ఇలా అంటుంది.

"మహాత్మా! ఒకనాడు నేను సరస్వతీదేవి ఆజ్ఞపై లక్ష్మీదేవి దగ్గరకు పోగా ఆదేవి తన అంశతో జన్మించిన భద్రాదేవిని సమస్త విద్యల్లో ప్రవీణురాలిగా చేయమని నన్నాజ్ఞాపించింది. నేను కేకయ నగరానికి పోయి భద్రాదేవిని సంగీతం, నాట్యం, కావ్యనాటకాలు, అలంకారశాస్త్రం, తర్కం, వ్యాకరణం, కవితారచన – వీటన్నింటిలో ప్రవీణురాలిగా చేసినాను. యౌవనవతియైన ఆ భద్ర సౌందర్యాన్ని వర్ణించటం అలవికాని పని. భద్రకు తగిన వరుణ్ణి అన్వేషిస్తూ పట్టణాలన్నీ తిరుగుతూ చివరికి ద్వారకా నగరం చేరుకున్నాను. ఈ రైవతకంపై మిమ్మల్ని చూసినాను. భద్రకు మీరే తగిన వరులు. దృష్టకేతువు (భద్ర తండ్రి) అనేకరాజకుమారుల చిత్రపటాలను తెప్పించి భద్రాదేవికి చూపగా ఆమె మీ పటాన్ని తప్ప తక్కిన పటాలను చూడనైనా చూడదు. పొద్దుపోకకై నేను ఆయా రాజకుమారుల కథలను కృతులుగా చేసి పాడేప్పుడు మీ చరిత్రనే కృతిగా పాడుమని నన్ను వేడుకుంటుంది. రహస్యంగా నేనొకనాడీ విషయాన్ని ప్రసక్తికి తేగా చిన్నతనం నుండే తనకు మీపై ఉన్న గాఢానురాగాన్ని వ్యక్తంచేసి మిమ్మ తప్ప ఇతరులను కోరనని తెలిపింది. సర్వదా మీ కోసమే పరితపిస్తున్న భద్రను మీరు అనుగ్రహించాలి."

చిలుక ఈ విధంగా పలికి భద్రాదేవి సౌందర్యాన్ని సుధామధురోక్తులతో వర్ణిస్తుంది. శ్రీకృష్ణునికి భద్రపై మోహం ప్రవృద్ధమౌతుంది. తన నెట్లైనా భద్రతో కూర్చుమని చిలుకను వేడుకుంటాడు. అప్పుడు చిలుక తన రెక్కల నడుమ భద్రపరచి తెచ్చిన భద్రాదేవి చిత్రపటాన్ని శ్రీకృష్ణునికి

చూపుతుంది. ఈ విధంగా చిలుక శ్రీకృష్ణునికి భద్రపై అనురాగాన్ని కలిగించి తిరిగి కేకయనగరానికి వెళ్ళిపోతుంది. శ్రీకృష్ణుడు భద్రాదేవినే స్మరిస్తూ ఆమెకై పరితపిస్తూ ఉంటాడు.

## తృతీయాశ్వాసం :

చిలుక కేకయ నగరానికి వచ్చి శ్రీకృష్ణుడిచ్చిన పారిజాత సుమహారాన్ని భద్రకిచ్చి ద్వారకలో జరిగిన వృత్తాంతాన్ని తెలుపుతుంది. శ్రీకృష్ణుని సౌంద ర్యాన్ని వర్ణించి చెపుతుంది. శ్రీకృష్ణుడు వచ్చి తననెప్పుడు గ్రహిస్తాడో అని భద్ర పరితపిస్తుంది.

ధృష్టకేతువు తన కుమార్తెకు స్వయంవరాన్ని చాటిస్తాడు. ఆ స్వయం వరానికి రాజకుమారు లెందరో వస్తారు. శ్రీకృష్ణుడు కూడా వస్తాడు. చిలుక భద్రను రథంమీద కూర్చోబెట్టుకొని రాజకుమారుల నొక్కొక్కరినే చూపిస్తూ వాళ్ళ నామరూప విభవాది గుణాలను పేర్కొంటూ శ్రీకృష్ణుని దగ్గరకు వస్తుంది. భద్రమనస్సు శ్రీకృష్ణునిపై లగ్నమౌతుంది. చేతిలోని పుష్ప హారాన్ని అతని మెడలో వేసి సిగ్గుతో మరలిపోతుంది. శ్రీకృష్ణుడేదో మాయ పన్నినాడని కసలి తనపైకి వచ్చిన రాజులందరినీ శ్రీ కృష్ణుడెదుర్కొని వారిపై విజయం సాధిస్తాడు.

కేకయరాజైన దృష్టకేతువు భద్రా శ్రీకృష్ణులకు శుభలగ్నంలో కల్యాణోత్సవం నిర్ణయిస్తాడు. కల్యాణం వైభవంగా జరుగుతుంది. బ్రహ్మాది దేవతలు వచ్చి వధూవరులను ఆశీర్వదిస్తారు. భద్రా శ్రీకృష్ణులు ద్వారకకు వచ్చి సుఖసంతోషాలలో ఓలలాడుతారు. కొంతకాలానికి వీరికి భద్రజయుడనే కుమారుడు జన్మిస్తాడు.

విష్ణుమూర్తి వివాహ సత్కథలను వినగోరిన జనకమహారాజుకు శుక మహర్షి పై కథను చెప్పినట్లుగా వర్ణింపబడింది.

## కవితావిశేషాలు

శ్రీ కృష్ణుడు దృష్టకేతువు కుమార్తెయైన భద్రాదేవిని వివాహమాడటం ముకుందవిలాసంలోని ఇతివృత్తం. సంస్కృత భాగవతంలో ఈ విషయమంతా ఒకే శ్లోకంలో చెప్పబడింది.

"శ్రుతకీర్తేః సుతాం భద్రాముపయేమే పితృష్వసుః
కైకయీం భ్రాతృభిర్దత్తాం కృష్ణః సంతర్దనాదిభిః" (X-58-56)

(శ్రీ కృష్ణుడు, తన మేనత్త శ్రుతకీర్తి కూతురు, కేకయ రాజకుమార్తె ఐన భద్రాదేవిని ఆమె సోదరులైన సంతర్దనాదులు సమర్పింపగా వివాహ మాడినాడు.)

వేదవ్యాసుని వలెనే పోతనకూడా భద్రావివాహాన్ని ముక్తసరిగా ఒక్క పద్యంలోనే జరిపించినాడు.

"జనవంద్యన్ శ్రుతికీర్తి నంద్యోదరుణిన్ సందర్శనక్షోణి పా
ద్యనుజన్ మేనమఱందలిన్ విమలలోలాపాంగఁ గైకేయ ని
ర్ధనయోన్నిద్రఁ బ్రపూర్ణ సద్గుణసముద్రన్ భద్ర నక్షుద్ర నా
వనజాతాక్షుఁడు పెండ్లియాడె నహితవ్రాతంబు భీతిల్లఁగన్"

(భాగవతం X-ఉత్తర. 145)

ఇతివృత్తం చిన్నదైనా పెద్దన తన కవితా శక్తితో ముకుందవిలాసాన్ని చక్కని ప్రబంధంగా తీర్చిదిద్దినాడు. ఆశ్వాసాంత గద్యల్లో దీనిని మహా ప్రబంధమని పేర్కొన్నాడు. ప్రబంధాల్లో ఉండవలసిన నగరార్ణవాద్యష్టాదశవర్ణనల్లో ఏ కొన్నో తప్ప చాలావరకు ఇందులో చోటుచేసుకున్నాయి. "ఈతని కవనము రసవంతమయి కవిజనహృదయ రంజకముగా నుండును"- అని వీరేశలింగం పంతులుగారు పెద్దన ముకుందవిలాస కవిత్వాన్ని ప్రశంసించినారు. ముకుందవిలాసంలోని తన కవితాశైలిని గూర్చి పెద్దనసోమయాజి ఈ విధంగా చెప్పుకున్నాడు.

"ఇందు సకలహితమునిచ్చు మున్ విష్ణుచి
త్తీయతుల్యమౌ మదీయకవిత
యుదుట చేవదొలువ నులిఁబోలు నళిమోము
మృదువు గాదె విరులమీద వ్రాలి"

"కుందవిలాసము తావి ము
కుందవిలాసము సదాముకుందవిలాసం

బిందువిలాసమును సుధా
బిందువిలాసము హసించు పేశలఫణితిన్"

(ముకుందవిలాసం I-32, 33)

ముకుందవిలాసరచనకు పూర్వం పెద్దనకవిత విష్ణుచిత్తీయ తుల్యమట. విష్ణుచిత్తీయమనే నామాంతరం కలిగిన రాయల ఆముక్తమాల్యద అతి ప్రౌఢమైన ప్రబంధం. పెద్దన కవితకూడా అంత ప్రౌఢంగా ఉండేదన్నమాట. కాని ముకుందవిలాసంలోని కవిత మృదుమధురమైనది. ఇంతమార్పు ఆయన కవిత్వంలో ఎట్లా వచ్చింది ? కర్రను తొలిచేప్పుడు అతికఠినంగా ఉండే తుమ్మెద మోము పువ్వులమీద వాలినప్పుడు మార్దవాన్ని పొందదా ? అని దీనికి పెద్దన సమాధానం. ముకుందవిలాసంలోని రచన రసవంతమై సహృదయుల నాకర్షిస్తుందనటంలో సందేహం లేదు.

మూడాశ్వాసాలు గల ఈప్రబంధంలో పెద్దన తన కవితాశక్తిని ఎంతగానో ప్రదర్శించినాడు. చక్కని కల్పనలతో కూడిన వర్ణనలు ఈ కావ్య సౌంద ర్యాన్ని ఇనుమడింపజేస్తున్నాయి. కొన్ని ఉదాహరణలు పరిశీలించండి.

భద్రాదేవి మోము వర్ణన

"అనువై నెన్నుదురొంటుగాఁ బదునొకండై కన్బొమల్ జంటగా
ఘనపం బోల్పఁగ రెండు తొమ్మిదులునై కర్ణద్వయంబొప్ప గా
గన పూర్ణస్థితి బర్వ లీల నెసఁగంగా నింతయుంగూడఁదా
దినసంఖ్యందిలకింప నిండునెలగా దీపించు మోమింతికిన్"

(ముకుందవిలాసం II-98)

స్త్రీల ముఖాన్ని నిండు చంద్రునితో పోల్చటం కవిసమయం. పెద్దన పై పద్యంలో భద్రమోమును నిండు చంద్రునిగా కాక నిండు నెలగా ఉత్ప్రేక్షిస్తు న్నాడు. 'నిండునెల' అన్నది శ్లిష్టపదం. దీనికి నిండుచంద్రుడు, ముప్పైరోజులు గల నిండునెల అని రెండర్థాలు. భద్రమోము నిండు చంద్రుని మాదిరిగా దీపిస్తుందని చెప్పటంలో అంత విశేషమేమీ లేదు. కాని ఆమె ముఖం నిండునెల (ముప్పై రోజులుకల నిండునెల) గా భాసిస్తుందని చెప్పటంలో విశేషం ఉన్నది. ఇందుకు కవి చేసిన కల్పన చూడండి. భద్రనుదురు ఒంటు (౧) ఆకారంలోనూ,

కన్బొమలు రెండు పదకొండు (౧౧) ఆకారంలోనూ, రెండు చెవులు రెండు తొమ్మిదుల (౯౯) ఆకారంలోనూ ఉన్నాయట. ఈ సంఖ్యల నన్నింటినీ కూడితే ముప్పై అవుతుంది. నిండు నెలకు రోజులు ముప్పైకదా ! అందువల్ల భద్రాదేవిముఖం నిండునెలగా భాసిస్తున్నదట. ఎంత చక్కని కల్పన !

తాళాంకనందినీ పరిణయంలో కూడా సరిగ్గా ఇట్టి కల్పనే కనిపిస్తుంది. శశిరేఖ మోము వర్ణన.

"బాలిక కా పితామహుఁడు ఫాలతలంబున నొంటు బెట్టియున్
మేలగు కర్ణయుగ్మ మెలమిన్నవకంబుల వ్రాసి భ్రూయుగం
బోలి గనంబడం బదునొకండిట ముప్పదిగా గణింపఁగా
నాలలిమోము నిండునెల యామిని వర్ణనసేయు టబ్రమే (II-78)

తాలాంకనందినీపరిణయ కర్తయైన ఆసూరి మరింగంటి వేంకట నరసింహాచార్యులు కాబాదం పెద్దన కవికి అర్వాచీనులు.

భద్రాదేవి కపోలవర్ణనం

"భువనజాతంబు గెలిచి యా యువిదమోము
తనకెనగ వచ్చె వీడని కినిసి రెండు
భాగములుఁజేయ భీతిఁదత్పూర్వములనుఁ
గొలుచు నెలతున్కలనఁగఁ జెక్కులు సెలంగు" (ము. వి. II-105)

సాంధ్యరాగవర్ణనం

సమయభిషగ్వరుండపర శైలపుకుప్పె దినేంద్రుఁడన్ రసేం
ద్రమునిడి పైఁదదూర్ధ్వ కరతామ్రశలాక ఘటించి వహ్నియో
గము నొనరింప సిందురముగాఁ బయికింబ్రసరించె నాఁగఁ దొం
బమరెను సాంధ్యరాగము నభోంతరదంతురితాంశుభాగమై
(III-42)

శ్లేషచమత్కారమన్నా, శబ్దాలంకార చమత్కారమన్నా పెద్దనకు పెద్ద ప్రీతి. పెద్దన ప్రయోగించిన శ్లేషాంకారాలకు నిఘంటువుల అవసరం ఉండదు. శ్లేషాలంకార ఘటనలో ఈతడు చూపిన నైపుణ్యానికి ముకుంద విలాసంలోనుండి ఎన్ని ఉదాహృతులనైనా ఎత్తి చూపవచ్చు. ఒకటి రెండింటిని మాత్రం మనవి చేస్తాను.

ఒకయేటఁ జిక్కె మీనము
నొకనెలకేఁ జిక్కెఁ బద్మమొక పగటింటన్
వికలతఁ జిక్కెంగుముదము
సకి నయనసమంబులగునె జడగతులెపుడున్.

(I-219)

భద్రాదేవి కండ్లసొగసును వర్ణించే పద్యం ఇది. భద్ర నేత్రసామ్యాన్ని పొందటంకోసం చేప, తామర, కలువ-ఎంతగానో ప్రయత్నించినాయట. అట్లా ప్రయత్నించి చేప ఒక ఏట (సంవత్సరకాలంలో) కృశించి పోయింది. తామర ఒకనెలలోనే చిక్కిపోయింది. ఇక కలువ ఒక రోజులోనే కృశించి పోయింది. చేప ఒక ఏడు, తామరపువ్వు ఒకనెల, కలువ ఒకరోజు మాత్రమే ఉంటాయి, కనుక ఇవి భద్రాదేవి నేత్రాలతో సామ్యాన్ని పొందలేక పోయినాయని తాత్పర్యం. ఇక్కడ శ్లేషవల్ల 'ఏటఁజిక్కె' అనేచోట చేప ఏటిలో (నదిలో) చిక్కుకున్నదనీ, 'నెలకే చిక్కె' అనేచోట తామర ఒక వెన్నెలకే వాడిపోయిందనీ, ఒక పగటింటన్ చిక్కె అనే చోట ఒక పగటిపూటనే కలువ చిక్కి పోయిందనీ అర్థాంతరాలు స్ఫురిస్తున్నాయి. అంతేగాక చేప ఒక సంవత్సరంలో కృశిస్తే కమలం ఒక నెలలోనే, కలువ ఒక పగటిపూటనే- అని ఈ విధంగా ఒక్కొక్కదానిలో క్రామికమైన న్యూనతాభావం కూడా స్ఫురించి చమత్కారాన్ని కలిగిస్తుంది. జడగతులనే చోట 'లడయోరభేదః' అనే నియమం ప్రకారం జలగతులనే అర్థాంతరంకూడా. మీనాదులు జల గతులేకదా!

ఈరీతిగా శ్లేషార్థం కలిగిన భిన్నభిన్న పదాలను కాకుండా ఒకే శ్లిష్ట పదాన్ని పునఃపునః ప్రయోగించి శ్లేషను ఎంత చమత్కారంగా నిబంధించి నాడో చూడండి.

"సారంగంబు హసించు మేచకరచాంచచ్చాకచక్యంబునన్
సారంగంబు హసించు నీక్షణరుచా సౌభాగ్యభాగ్యంబునన్
సారంగంబు హసించుఁ గంఠనినద స్వారస్య విస్ఫూర్తులన్
సారంగంబు హసించు యానగరిమం జంద్రాస్య సాంద్రస్థితిన్.

(I-224)

తుమ్మెద, లేడి, వానకోకిల, ఏనుగు అనే నానార్థాలుకల సారంగమనే ఒకేపదాన్ని ఆవృత్తంచేస్తూ క్రమంగా భద్రాదేవి కురులు, కండ్లు, కంఠస్వరం, నడక వర్ణింపబడ్డాయి.

ఒక పద్యంలో వాడబడ్డ శ్లిష్టపదాలన్నీ ప్రకృతార్థాన్ని బోధించటంతోపాటు అప్రకృతమైన విషయానికి సంబంధించిన ఆయా అంశాలనుగూడా తెలియజేయటం పెద్దన శ్లేష ప్రయోగంలోని ఒక లక్షణం. ఈ కింది పద్యాలు పరిశీలించండి.

"గతి మత్తేభము నాస చంపక మొగింగైశ్యంబు కందంబు సం
గత వాక్యంబులు మత్తకోకిలలు దృక్పాండిత్యమయ్యుత్పల
ద్యుతి మోమంబురుహంబు దేహరుచి విద్యున్మాలిగా మానినీ
తతవృత్తస్థితులెన్నఁగాఁదరమె భద్రాఙ్గానికైనందగున్.
(I-225)

పై పద్యంలో భద్రాదేవి నడక మొదలైన వాటికి ఉపమానంగా చెప్పబడిన మత్తేభం, చంపకం, కందం మొదలైనవి ఛందస్సుకు సంబంధించిన మత్తేభాది వృత్తాలను కూడా స్ఫురింప జేస్తున్నాయి. ఇట్టివే మరికొన్ని ఉదాహృతులు.

"కుంభకుచ మీనలోచన గోనితంబ
యబ్జధామాస్య హరిమధ్య యళిశిరోజ
చాపసుభ్రూయుగళ నక్రజంఘ యతుల
కన్య సరసక్రియల రాశిగాదె జగతి". (I-226)

ఈ పద్యంలో కుంభం, మీనం, వృషభం (గో), కర్కాటకం (అబ్జ), సింహం (హరి) వృశ్చికం (అళి) ధనుస్సు (చాప) మకరం (నక్ర) తుల, కన్య, మిథునం (సరస) మేషం (క్రియ) అనే జ్యోతిశ్శాస్త్రీయమైన రాశులు ధ్వనితము లౌతున్నవి.

"లక్షణముల శుభరోహిణి
యక్షీణస్వాతి భూతి హస్తాంబుజధీ
లక్షితచిత్త సదుత్తర
నక్షత్రపు మొలకగాదె నాతివిభాష్తిన్" (I-227)

ఈ పద్యంలో ధ్వన్యమానమౌతున్న రోహిణి, స్వాతి, హస్త, చిత్త, ఉత్తర అనే నక్షత్రపరమైన అర్థం 'భద్ర నక్షత్రపు మొలక' అనే భావానికి ఎంతో పోషకంగా ఉన్నది.

"ఆ మధ్వాకృతి యధరము
నా మాయావాది రీతి యట మధ్యముగా
భామామణి మోమా
రామానుజ మండల స్ఫురణందనరారెన్" (II-210)

మధ్వాకృతి = (మధు + ఆకృతి = తేనెవంటిది; మాయావాది రీతి = శూన్యం; రామానుజ మండలం = (రామా + అనుజుడు = లక్ష్మీదేవి సోదరుడు-చంద్రుడు) చంద్రమండలం; భద్రాదేవి అధరాన్ని, మధ్యాన్ని, మోమును వర్ణించే ఈ మూడు పదాలచే క్రమంగా త్రిమతాచార్యులైన మధ్వాచార్యులు; శంకరాచార్యులు (మాయావాద స్థాపకుడు), రామానుజాచార్యులు పేర్కొనబడినారు.

"పద్మదృశ, నీలకచ, మహాపద్మవదన
శంఖగళ, కుందరదన, కచ్ఛపపదాగ్ర
వరమకరజంఘ జెందనీ సిరి ముకుంద
యట నవస్ఫూర్తి నిధిలాభమందినటుల" (I-223)

ఈ పద్యంలో భద్ర నేత్రాదులకు ఉపమానంగా చెప్పబడిన పద్మం, నీలం, మహాపద్మం, శంఖం, కుందం, కచ్ఛపం, మకరం అనే పదాలు; వర, ముకుంద శబ్దాలు శ్లేషవల్ల కుబేరుని నవనిధులైన పద్మం, మహాపద్మం మొదలైన వాటిని తెలుపుతూ ప్రకృతార్థానికి ఎంతో స్ఫూర్తినిస్తున్నాయి. కింది పద్యంలో పెద్దన శ్లేషనెంత మనోహరంగా కూర్చినాడో చూడండి.

"ముఖవైఖరికి మోడె మొదలనే శశిరేఖ
యధరంపు రుచికి లోనయ్యె సుధయు
నాసకు సరిరాక నలిగెందిలోత్తమ
లోచనద్యుతులకు లోగె హరిణి

హాసలీల భ్రమించె నభినవ కౌముది
యనదయ్యెఁగుచవృద్ధి కద్రికయును
ఊరుద్వయ స్ఫూర్తికోడిగి రంభ చలించె
నట గోరునకుఁబోలదయ్యెఁదార

యారి తనుకాంతికినిఁదక్కువయ్యె హేమ
చిత్రరేఖలఁగొదవయ్యెఁ జిత్రరేఖ
యేనొకట నాకమునకేగి యీ శుభాంగి
యంగముల నెన్న నప్సరలందు గాని" (II-123)

భద్రాదేవికి దీటైన సౌందర్యవతు లెవ్వరైనా స్వర్గంలో ఉన్నారా చూద్దామనే కోరికతో చిలుక స్వర్గానికి పోయిందట. స్వర్గస్త్రీ లెవ్వరూ భద్రాదేవి సౌందర్యానికి సాటిరాలేకపోయినారట. ఈ విషయాన్ని చిలుక శ్రీకృష్ణునికి తెలిపే సందర్భంలోనిది ఈ పద్యం. శశిరేఖ, సుధ, తిలోత్తమ, హారిణి మొదలైన అప్సరసలంతా ఆయా అవయవాల సౌందర్యం విషయంలో భద్రాదేవికి సరిరాలేక ఓడిపోయినారని చెప్పటం ప్రకృతాంశం. శశిరేఖ, సుధ, తిలోత్తమ, హారిణి, కౌముది, అద్రిక, రంభ, తార, హేమ, చిత్రరేఖ— ఈ అప్సరసల పేర్లలోని శ్లేషవల్ల క్రమంగా చంద్రరేఖ, అమృతం, నువ్వు పువ్వు, ఆడలేడి, వెన్నెల, పర్వతం, అరటి, నక్షత్రం, బంగారం, చిత్రమైన రేఖ అనే అర్థాలు కూడ స్ఫురిస్తున్నాయి. అందువల్ల శశిరేఖ = చంద్రుని రేఖ భద్ర ముఖవైఖరికి ఓడిపోవటం, అమృతం అధరరుచికి సరి రాకపోవటం. నువ్వు పువ్వు నాసకు ఓడిపోవటం మొదలైన అందమైన భావాలు ఏర్పడి ప్రకృతార్థాన్ని ఎంతగానో సముద్దీప్తం చేస్తున్నాయి.

ఆయా సందర్భాలలో ప్రయుక్తమైన శ్లేషల్లో శాస్త్ర విషయాలను ఎంతో సముచితంగానూ, మనోహరంగానూ నిబంధించటం కనిపిస్తుంది. ఇది పెద్దనకు వెన్నతో పెట్టిన విద్య. ఈ కింది పద్యాన్ని పరిశీలించండి.

"కందర్పరసమునఁ గలికి కూష్మము హెచ్చె
నష్టమూర్తిహితాప్తి నందరమ్మ
చంద్రోదయమటన్న సతికిఁగాఁక యెసంగె
మార్తాండయోగాళి మనుపరమ్మ

నవమాలినీ వసంతమున శాంతిలదింతి
మధుసూదననియుక్తి మనుపరమ్మ
శీతప్రభంజన స్థితి లతాంగి చలించె
వాత భంజినిఁగూర్పు వలవరమ్మ

సతియు భావ భవాతంక శంకఁబూన
స్నేహగతిఁగాంచ నెవ్వారిచేతనోపు
నచ్యుతానంత గోవింద యని తలంచి
చేరి భవరోగవైద్యు భజింపరమ్మ" (III-95)

శ్రీకృష్ణుని విరహంతో బాధపడుతున్న భద్రాదేవి తాపాన్ని పోగొట్టటానికై ఆమె చెలికత్తెలు ప్రతీకారాన్ని చెప్పుకునే సందర్భంలోనిది ఈ పద్యం. ఇందులోని కందర్పరస మొదలైన శబ్దాలు ఆయుర్వేదంలో ప్రయుక్తమయ్యే ఔషధాల పేర్లను తెలియజేస్తున్నవి.

1. కందర్పరసం = మకరధ్వజం;
2. చంద్రోదయం = పూర్ణ చంద్రోదయం
3. మాలినీవసంతం = మాలినీవసంతం
4. శీతప్రభంజనం = శీత భంజనం
5. అష్టమూర్తిహితాప్తి = గంధక రసం*
6. మార్తాండయోగం = సూర్యావర్తి యోగం
7. మధుసూదనం = వైష్ణవీరసం
8. వాతభంజిని = వాతవిధ్వంసిని

పై రీతిగా ఆయుర్వేదౌషధాల పేర్లు ధ్వనించటమే కాక ఆయా ఔషధాలవల్ల కలిగే వికారాలను దూరంచేసే ఇతరౌషధాలను కూడా పేర్కొనటం విశేషం. పై వాటిలో కొన్ని ఔషధాలు వేడిని కలిగించేవి. మరికొన్ని శైత్యాన్ని కలిగించేవి. ఇక్కడ మరో విశేషం కూడా ఉంది. అది ఆయా ఔషధాలకూ, వాటికి విరుద్ధమైన ఔషధాలకూ ఉన్న వైరుధ్యాన్ని సూచించే పదాలను కూడా ఆ ఔషధనామాలలో చేర్చటం.

---

*అష్టమూర్తి = శివుడు, శివునికి హిత = పార్వతి; పార్వతీదేవి రజస్సే గంధకం.

కందర్ప - అష్టమూర్తి; చంద్ర - మార్తాండ.
వసంత - మధుసూదన; శీతప్రభంజన - వాతభంజిని.

'బాహట గ్రంథాను భావధుర్య' (ముకుంద విలాసం I-23) అని పెద్దన తన ఆయుర్వేద శాస్త్రాభినివేశాన్ని గురించి చెప్పుకున్న విశేషణం ఎంత సార్థకమో పై పద్యం నిరూపిస్తుంది.

ఇట్టి చమత్కారాలు గల పద్యాలు పెద్దన కవిత్వంలో కొల్లలు. స్థాలీపులాకంగా కొన్నింటిని మాత్రమే ఉదాహరించినాను.

పద్యంలోని పూర్వార్ధాన్నే యథాతథంగానో, ఏ కొద్దిపాటి మార్పుతోనో శ్లేషఘటితంగా పునరుక్తంచేసి ఉత్తరార్ధంగా చెప్పటం ముకుంద విలాసంలో చాలా చోట్ల కనిపిస్తుంది. ఈ పద్ధతికి మార్గదర్శకుడు నన్నెచోడు డనవచ్చు. కొన్ని ఉదాహృతులు.

"కాకవుల వాక్కులుండఁగ
నాకవుల మధూచితోక్తులభినుతి గనియెం
గాకవుల వాక్కులుండఁగ
నాకవుల మధూచితోక్తు లభినుతి గనవే. (ము. వి. I-19)

"తిరుమలరాయల భామిని
మరు నమ్మన సిరుల వెలయు మంగాంబ దగున్
తిరుమలరాయల భామిని
మరునమ్మన సిరులవెలయు మంగాంబ దగున్" (ము. వి. I-68)

"శ్యామాళుల్ పురుషవ్రజంబు సుమనోవ్యాప్తిన్ ఫలశ్రీలచే
నామోదింపఁగ నమ్మహావనీ విభుండై మాధవుం డొప్పె నా
శ్యామాళుల్ పురుషవ్రజంబు సుమనోవ్యాప్తిన్ ఫలశ్రీలచే
నామోదింపఁగ నమ్మహావని విభుండై మాధవుం డొప్పడే"
(ము. వి. I-238)

ఇట్టివే I-272; III-24; III-47; III-123; III-237 సంఖ్యలు గల పద్యాలు.

ఆశు, మధుర, చిత్ర, విస్తరరూప చతుర్విధ కవితల్లో పెద్దన ఉద్దండుడని "వరచతుర్విధ కవిత్వ ప్రవీణు"— అన్న ముకుంద విలాసావతారికలోని వాక్యంవల్ల తెలుస్తుంది. పెద్దన ముకుంద విలాసంలో చూపిన చిత్ర కవితా విన్యాసాలు అనేకం. ద్వ్యక్షరి, త్ర్యక్షరి, తలకట్లు, గుడులు, కొమ్ములు, అక్షర గుణితం, ఓష్ఠ్యం, నిరోష్ఠ్యం, పాదభ్రమకం, పద్యభ్రమకం, పాదగోపనం, గర్భకవిత్వం, బంధకవిత్వం మొదలైనవి చిత్రకవితా భేదాలు. పెద్దన ఈ కింది చిత్రకవితా భేదాలను ముకుందవిలాసంలో ప్రయోగించినాడు.

అక్షరద్వయ కందం

"మిమ్మే మేమా రేమా
మమ్మోము మఱేమి మర్మమా మమ్మారా
ముమ్మారు రమారామా
రమ్మర మరమేర మేఱి రామ మురారీ!" (III-318)

"కోకిల కలకల లీలల
కేకుల కేకల కులాళి కిలకిలల కళా
కాకలి కేళాకూళుల
లోకాళులు కేళికళికె లోలాకులలై" (I-250)

సోష్ఠ్య కందం

"భూమా వామాభవ్య
ప్రేమాను భవా భవాప్త పృథుభావి భవా
భామాభిగుప్త భామా
స్తోమ వివాహోపభావ్య సుమనోభావ్యా!" (ము.వి.III-313)

ఈ పద్యంలో ఓష్ఠ్య వర్ణాలతోపాటు నిరోష్ఠ్యాలైన న, థ, గ, స, హ అనే వర్ణాలు కూడా చోటు చేసుకున్నాయి. కనుకనే కవి దీన్ని సోష్ఠ్య కందం అని పేర్కొన్నాడు. ఓష్ఠ్య వర్ణాలే అధికంగా ఉన్న పద్యం సోష్ఠ్యం.

నిరోష్ఠ్య ద్వివిధ కందం

"కృష్ణా జయ సంరక్షిత
కృష్ణా జయ జలధర చయకృతఘన సశ్రీ
కృష్ణా జయనత హృత్పన్నగ
కృష్ణా జయనరహరి హరి ధృతగిరి శార్ఙ్గి" (ము. వి. III-313)

పై పద్యంలో నిరోష్ఠ్యాలే కాక మరో కందపద్యం కూడా గర్భితంగా చెప్పబడటం రెండో చిత్రత. గర్భిత కందం ఈ విధంగా ఉన్నది.

"జయ సంరక్షిత కృష్ణా
జయ జలధర చయకృతఘన సశ్రీకృష్ణా
జయనత హృత్పన్నగ కృష్ణా
జయ నరహరి హరి ధృతగిరి శార్ఙ్గి" (ము. వి. III-312)

నిరోష్ఠ్య సోష్ఠ్యకందం

"రామా రావణముఖ్యవి
రామా నిర్మలగుణాభిరామా శ్రీసు
త్రామా కంపితభార్గవ
రామా కమలాభిజన్మరామా రామా!" (ము. వి. III-314)

ముందొక నిరోష్ఠ్యం, తరువాత ఒక ఓష్ఠ్యవర్ణం - ఈ క్రమంలో నిరోష్ఠ్య ఓష్ఠ్యవర్ణాల సమ్మేళనంతో ఈ కందం రచింపబడింది. ద్వితీయపాదంలోని గు, సు వర్ణాలలో అచ్చుల ఓష్ఠ్యత్వాన్ని గ్రహించవలసి ఉంటుంది.

అపంచవర్గీయముక్తపదగ్రస్తం

"సరసావంశీ సుర వా
సురవారాశింసి శౌర్య శూరా శరహా
శరహారి హరి స్వరయా
స్వర యావహలీల యాస్యవశవాసరసా!" (ము. వి. III-315)

ఈ పద్యంలో పంచవర్గాక్షరాలు కాక కేవలం అంతఃస్థోష్మ వర్ణాలు మాత్రమే ప్రయోగింపబడ్డాయి. ముక్తపదగ్రస్తత కూడా జోడింపబడింది. అపంచ వర్గీయంగా 'శేషశైలేశలీల' కావ్యాన్నే రచించినవాడు పెద్దన.

శుద్ధపంచవర్గీయం

"పద్మాభపదచ్ఛందా
పద్మానందానుగత కృపాఖ్యందపద
ప్పద్మాప్త బింబకుందా
పద్మజ ముఖ కందధూతబంధ ముకుందా !" (ము. వి. III-316)

ఇందులో కేవల పంచవర్గాక్షరాలకే కాని అంతఃస్థోష్మ వర్ణాలకు ప్రయోగం లేదు.

అచలజిహ్వ:

"ఆభోగ మహీభాగ మ
హాభాగ మహామహా మహాభోగ మహా
మా భామా వహ బహు మహి
మా భామా వహావిభావ మఘవముఖావా !"

(ము. వి. III-317)

పై పద్యంలో ప్రయోగింపబడ్డ ఆ, భ, గ, మ, హ, వ, ఘ, ఖ అనే వర్ణాలను ఉచ్చరించేప్పుడు జిహ్వ కదలదు.

పాదభ్రమకందం.

"మార సమరామ సరమా
సారావన రసవిభావి సరసవరాసా
హారియరిధారి యరిహా
భారత జయదవరధీర ధదయజతరభా" (ము. వి. III-310)

పై పద్యంలోని ప్రతిపాదాన్ని విలోమంగా తిప్పి చదివినా అదే పద్య పాదమౌతుంది.

పై చిత్రకవితావిన్యాసాలుగల పద్యాలను అర్థం చేసుకొని ఆనందించాలంటే మేధకు పదును చాలా అవసరం.

గర్భ కవిత్వమూ, బంధకవిత్వమూ చిత్రకవితకు చెందిన శాఖలే. వీటిలో పాఠకులకు రసానుభూతిని కలిగించే గుణం అంతగా ఉండదనే చెప్పవచ్చు. కాని కవి పాండిత్య ప్రకర్షను నిరూపించు కోవటానికి ఉపయోగ పడతాయి. ఒక్కొక్కప్పుడు బంధకవిత సాహిత్యంలోని కొన్ని నిగూఢాంశాలను బహిర్గతం చేయటానికి సహకరిస్తుంది. పెద్దన ముకుంద విలాసంలో గర్భ కవిత్వాన్నీ, బంధ కవిత్వాన్నీ నిబంధించి తన చిత్రకవితా రచనా ప్రీతిని చాటుకున్నాడు.

ముకుంద విలాసంలో గర్భిత పద్యాలు మూడు రచింప బడ్డాయి.

1. సమద భాస్వద్దనుజ......III-306
2. శ్రీరంజితాకార ......III-309
3. కృష్ణా జయ ......III-311

పై వాటిలో రెండవ పద్యమైన 'శ్రీరంజితాకార' అనే పద్యంలో ద్విపద, చౌపది, లాలి, శోభాన, మంగళహారతి, సువ్వాల, ధవళాది వివిధ భేదాలు గర్భితమై ఉన్నాయి.

పెదన ముకుంద విలాసంలో రచించిన బంధచిత్రత గలిగిన పద్యాలు ఏడు. వాటిని దిగువ పేర్కొంటాను.

1. చం. అతివిమలా I-291...శేషబంధం.
2. కం. శ్రీశా గరుడాంచత్ I-294...శైలబంధం.
3. పంచ. నరాదరా సురా I-295...పుష్పగుచ్ఛబంధం.
4. శా. సత్యోపేతసుకేళి II-279...చక్రబంధం.
5. కం. దారవతను II-280...ఛత్రబంధం.
6. సుగం. శ్రీరమారసా II-281...గోమూత్రికాబంధం.
7. రమావాస సవా III-319...సర్వతోభద్రబంధం

శేషబంధ పద్యంలో గర్భ చిత్రత కూడా ఉన్నది. ప్రాచీన కవుల్లో పెద్దన తప్ప శైలబంధాన్ని వ్రాసిన కవులు కానరారు. సుబ్రహ్మణ్య విజయ

మనే విద్వత్కర్ణామృతంలో శైలబంధం ఉన్నట్లుగా ప్రబంధ రాజ వేంకటేశ్వర విజయ విలాస పీఠిక (పుట. 34) వల్ల తెలుస్తుంది.

సంగీత కళానిధియైన రామరాజ భూషణుని వసు చరిత్ర ప్రభావం పెద్దన సోమయాజి ముకుంద విలాసంపైన ఎంతగానో ఉన్నది. లయబద్ధంగా సంగీత శైలిలో రచింపబడిన "ఒక చాయ సనపాయ, పపారు పొదరిండ్ల" - మొదలైన వసుచరిత్ర పద్యాలను పోలిన పద్యాలు ముకుంద విలాసంలో ఎన్నో ఉన్నాయి. ఒక్క ఉదాహరణం.

"సురసాల సమశీల సురసాల తరుజాత
సరసాల వావాల పరిసరంబు
మలయాగ తటభాగ నిలయాగమా భోగ
వలయాగత సదాగతి లసితంబు
వనితాజన సమాజ జనితాజర మనోజ
జనతాజయ విరాజ దనునయంబు
సురతాంత సునితాంత పరితాంత సదుదంత
భరితాంత రసవాంత వరచయంబు

గహన సహచర సహచరావహిత మహిత
వికచ రుచికుల విచికిల సకల వకుళ
విసర మధురస మధురస దసమ కుసుమ
సముదయము పొల్చె మధుమాససముదయంబు" (ము. వి. I-236)

తన చిత్తమున (I-162), చమరీనికరవాల (I-270), ఈ దారిం బోరాదు (I-276) మొదలైన ముకుందవిలాస పద్యాలు లయబద్ధమైన సంగీతశైలిలో రచింపబడినవే.

ముకుంద విలాసంలో పెద్దన సోమయాజి చూపిన శబ్దాలంకార విలాసం అతివేలం. "ఈతని గ్రంథములో నున్నన్ని శబ్దాలంకారములు మఱి యే గ్రంథములోను లేవు" - అని వీరేశలింగంగారు తమ కవుల చరిత్రలో తెలిపినారు. ఈ కవి చూపిన శబ్దాలంకార వైచిత్రికి కొన్నింటిని మాత్రం ఉదాహరిస్తాను.

అనుప్రాస :— 1 ఆశ్వాసం. 22, 59, 160, 162, 166, 167, 174, 217, 230, 236, 240, 250, 273, 275, 276.

2 ఆశ్వాసం. 45, 127, 173, 193.

3 ఆశ్వాసం. 10, 49, 50, 131, 171, 178, 181, 189, 191, 289.

యమకం :— 1 ఆశ్వాసం. 147, 158, 169, 203, 216, 251.

2 ఆశ్వాసం. 37, 158, 192, 163, 229.

3 ఆశ్వాసం. 48, 288, 304.

ముక్తపదగ్రస్తం :—1 ఆశ్వాసం. 5, 59, 105, 140 సంఖ్యలు గల పద్యాలు.

### పూర్వకవుల అనుకరణలు

ఉక్తి చమత్కృతీ, భావ చమత్కృతీ కలిగిన ప్రసిద్ధ సంస్కృత శ్లోకాల నెన్నింటినో తెలుగు కవులు సందర్భానుగుణంగా అనువదించుకొని తమ కావ్యాలలో చొప్పించుకోవటం అసాధారణమేమీ కాదు. శ్రీనాథుడు కాశీ ఖండంలో వింధ్యపర్వత గర్వ నిర్వాపణ సందర్భంలో చేసిన మయూరుని సూర్య శతక శ్లోకానువాదాలు మొదలైనవి ఇందుకు నిదర్శనం. కాణాదం పెద్దన కూడా కొన్ని ప్రసిద్ధ సంస్కృత శ్లోకాలను అనువదించి సందర్భోచితంగా ముకుంద విలాసంలో చేర్చినాడు. ఈ అనువాద పద్యాలన్నీ చిలుక సంగీత సాహిత్యాలలో తనకున్న పాండిత్యాన్ని శ్రీకృష్ణునికి వివరించే సందర్భంలో నిబంధింపబడి ఎంతో సందర్భౌచిత్య శోభితాలుగా ఉన్నాయి. మూల శ్లోకాలను, పెద్దన సోమయాజి అనువాదపద్యాలను చూడండి.

(i) "సంగీతమథ సాహిత్యం సరస్వత్యాః కుచద్వయమ్
పకమాపాత మధుర మన్యదాలోచనామృతమ్"

"సరసస్ఫూర్తి సరస్వతీయువతికిన్ సంగీత సాహిత్యముల్
వరవక్షోజ యుగంబునాఁ బఱఁగు విద్వద్భ్యాల వృద్ధక్రియా
కరసంపజ్జనకంబులం దొకటి ద్రాక్షాగుచ్ఛ మాధుర్య వై
ఖరి వేఱొక్కటి నారికేళ ఫలపాకవ్యాప్తి సౌఖ్యం బిడున్"

(ము. వి. II-246)

(ii) శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గానరసం ఫణీ
సాహిత్యరసమాధుర్యం శంకరో వేత్తి వా నవా

"శిశువులకుం బశువులకున్
వశమై సొక్కించు గానవైఖరి మధురా
తిశయము సాహిత్య రుచిన్
భృశగతి సర్వజ్ఞుఁడైన నెఱుఁగంగలడే!" (ము. వి. II-247)

(iii) నైవ వ్యాకరణజ్ఞమేతి పితరం న భ్రాతరం తార్కికం
దూరాత్ సంకుచితైవ గచ్ఛతి పునశ్చండాలవచ్ఛాందసాత్
మీమాంసానిపుణం నపుంసకమితి జ్ఞాత్వా నిరస్తాదరా
కావ్యాలంకరణజ్ఞమేత్య కవితాకాంతా వృణీతే స్వయమ్.
(విశ్వగుణాదర్శచంపువు)

పనరన్ వ్యాకరణజ్ఞుఁ దండ్రి యనుచుం దర్కజ్ఞునిన్ భ్రాతయం
చును మీమాంసకుని న్నపుంసకుడటంచున్ వీడి దూరంబునం
గని యస్పృశ్యునిఁ బోలె ఛాందసుని వేడ్కం గావ్యలీలారస
జ్ఞు నిజేచ్ఛం గవితావధూమణి వరించున్ భావగర్భంబునన్.
(ము. వి. II-250)

పై విధంగా సంస్కృత కవుల ప్రభావమే కాక తెలుగు కవుల ప్రభావం కూడా కాణాదం పెద్దనపై ఉన్నది. పూర్వ తెలుగు కవుల రచనల్లోని పద్యాల అనుకరణలు, పోలికలు ఉన్న ముకుంద విలాసం పద్యాలను దిగువ ఉదాహరిస్తున్నాను.

1. తన భవ్యధామంబు తన భవ్యధామంబు (వ. చ. II-57)
తన మానసస్థితి తన మానసస్థితి. (ము. వి. I-71)

2. మెఱుఁగొప్పు నెఱిగొప్పు నెఱగప్పు (వ. చ. III-69)
తన చిత్తమునఁ గ్రొత్త నసలెత్త. (ము. వి. I-162)

3. ఈ జాలఁబోరాదు పేరాశము జవాది (వ. చ. II-57)
ఈ దారిఁబోరాదు కేదారకోదార (ము. వి. I-276)

4. ఒక చాయ ననపాయ పికగేయ (వ. చ. II-7)
సురసాల సమశీల సురసాల తరుజాల (ము. వి. II-236)

5. మందారమకరంద మాధుర్యమున (ఆం. మ. భాగ. VII-150)
మందార కుందారవిందా (ము. వి. II-160)

6. వచ్చినవాడు ఫల్గుణుడవశ్యము (మ. భా. IV-4-234)
వచ్చినవాడు మాధవుడవశ్యము (ము. వి. III-210)

7. అటఁజని కాంచె భూమిసురుఁడంబర (మ. చ. II-3)
అటఁజని కాంచెఁ గృష్ణుఁడు నంభోంతర (ము. వి. I-267)

## తెలుగుకావ్యాలలో భద్రాపరిణయవృత్తాంతం

పోతన భాగవతంలో ఒకే ఒక పద్యంలోనూ, చిన్నన్న అష్టమహిషీ కల్యాణంలో అతి క్లుప్తంగానూ భద్రాపరిణయ వృత్తాంతం చెప్పబడింది. రెడ్డిపల్లె ముద్దమరాజు కూడా ఒక అష్ట మహిషీ కల్యాణాన్ని రచించినట్లు 'ఉదాహరణ పద్యము' అనే సంకలన గ్రంథంవల్ల తెలుస్తుంది.[1] ఈ కావ్యం అలబ్ధం రెండు పద్యాలు మాత్రమే దొరికినవి.

భద్రాదేవీ పరిణయ వృత్తాంతం ప్రబంధరీతిలో సంతరింపబడిన తెలుగు కృతులు మూడు మాత్రమే కానవస్తున్నాయి. ఒకటి పెద్దన ముకుందవిలాసం. రెండవది కాళ్లకూరి గౌరీనాథకవి పూర్వులెవ్వరో రచించిన భద్రాపరిణయం. ఇందులో గ్రంథకర్త పేరుకానీ, కృతిభర్త పేరుకానీ, లేవని ఆచార్య దొణప్పగారు తెలుపుతున్నారు.[2] మూడవది ఆధునికుడైన అల్లమరాజు సుబ్రహ్మణ్యకవి రచించిన భద్రాపరిణయం. కాగా భద్రాపరిణయం ఇతివృత్తంగా రచితమైన ప్రబంధాలలో ముకుంద విలాసం మొట్ట మొదటిది. కాణాదం పెద్దన ఈ విషయాన్ని తన ముకుంద విలాసం అవతారికలో కృతిపతిముఖంగా స్పష్టపరచినాడు.

"పురుషోత్తమాష్ట మహిషీ
పరిణయములలోన మున్ను భద్రాదేవీ

---

1. ప్ర. ర. 77 పుట.
2. ఆం. సం. సా. 421 పుట.

పరిణయ మెవ్వరు తెనుఁగున
విరచించుట వినము పూర్వ విబుధులవలోన్ (I-27)

**సుబ్రహ్మణ్యకవి భద్రాపరిణయం**

సుబ్రహ్మణ్య కవి పందొమ్మిదో శతాబ్ది ఉత్తరార్ధానికి చెందిన కవి. ముకుందవిలాస కర్తవలె చిత్ర కవితా నిర్మాణంలో దిట్ట. శేషధర్మ కావ్యంలో చతురగర్భ నిరోష్ఠ్యోష్ఠ్య సరసబంధయమక కవితా విలాసుడననీ, శ్రీకృష్ణ కల్యాణంలో ఉభయభాషా కవిత్వ విలసితుడననీ చెప్పుకున్నాడు. ఎందువల్లనో కాని ఈయన తన భద్రా పరిణయంలో ముకుంద విలాసాన్ని మక్కీకి మక్కీగా అనుసరించినాడు. "నాస్త్యచౌరః కవిః" - అని క్షేమేంద్రుడు చెప్పిన ప్రకారం అనంతర కవులు పూర్వకవుల కావ్యాల్లోని మనోహర భావాలను తమ కావ్యాలలో అక్కడక్కడా సకృత్తుగా చొప్పించటం న్యాయ్యమే. కాని కావ్యమంతా అదే రీతిగా పూర్వకావ్యాల్లోని భావాలను గ్రహించి రచనచేయటం భావ్యం కాదు. సుబ్రహ్మణ్య కవి పెక్కు రీతులుగా ముకుంద విలాసాన్ని అనుకరించినాడు. కొన్నిచోట్ల పద్యాలను యథాతథంగానూ, కొన్నిచోట్ల పద్యాలలోని ఒకటి రెండు పదాల మార్పుతోను గ్రహించినాడు. మరికొన్నిచోట్ల అనేక పద్యభావాలను యథాతథంగా గ్రహించినాడు. కొన్ని ఉదాహృతులు.

**i)** పద్యాలను ఏమాత్రం మార్పుచేయక గ్రహించటం.

"ఆ కుమారుని సంతర్దనాఖ్యుఁ జేసి
యా రమాంశను గన్న కుమారికకును
భద్ర గుణలక్షణములు సూపట్టుకతన
భద్రయను నామమొసఁగె భూపాలమౌళి

(ము. వి. II.61; భ.ప. II-30)

**ii)** ఒకటి రెండు పదాలను మాత్రం మార్చి పద్యాన్ని గ్రహించటం.

"కుంభకుచ మీనలోచన గోనితంబ
యబ్జధామాస్య హరిమధ్య యళిశిరోజ
చాపసుభ్రూయుగళ నక్రజంఘ యతుల
కన్య నరసక్రియల రాశిగాదె జగతి" (ము. వి. I-226)

పై పద్యంలోని 'జగతి' అనే పదాన్ని 'తలప' అని మార్చి అదే పద్యాన్ని భద్రాపరిణయకర్త వాడుకున్నాడు. (II-112)

ఈ విధంగానే ముకుంద విలాసంలోని కాంచి వ్రజాంగనా (II-6) ఈ రీతి నీతి (I-160) గతి మత్తేభము (I-225) ఇది యెయ్యదియో (II-7) ఆటలఁ బాటల (II-87) మొదలైన పద్యాలు కొద్ది శబ్దాల మార్పుతో సుబ్రహ్మణ్య కవి భద్రాపరిణయంలో చోటు చేసుకున్నాయి. (భ. ప. I-123; II-113; II-7; II-41 మొ॥)

iii) భావాన్ని గ్రహించటం.
ద్వారకలోని వైశ్యుల వర్ణనం.

> "మున్నిజ పూర్వులాకులలముల్ దినియుండఁగ నొక్కదిక్కుగా
> నెన్నిక కొన్ని తానె ఘటియించి యవిన్నవతన్ ఘటించనై
> యున్నఁగుబేరుఁబేరుకొనరూర నవాధికలాభ సిద్ధి మా
> ద్యన్నిధిమద్విహారులు బెహారులు ముత్తరముందిరంబుగన్"
> (ము. వి. I-120)

> "మును దన పూర్వులాకులలముల్ దిని కాలము పుచ్చుచుండ మై
> కొని యొక దిక్కునన్ నవతఁగొన్ని నిధుల్ సమకూర్చుకొంచు ని
> ట్లొనరు కుబేరుఁబేరుకొనకుందురు బేరులు పట్టణంబునం
> దనిశనవాధికార్థ నిధులంచితదానకలా కళానిధుల్" (భ. ప. I-108)

ముకుందవిలాసంలోని ఉత్పలమాల భద్రాపరిణయంలో చంపకమాలగా అవతరించింది. ఈ రీతిగా ముకుంద విలాసంలోని పద్యాల భావాలను గ్రహించి సుబ్రహ్మణ్య కవి చెప్పిన పద్యాలనన్నింటినీ పూర్తిగా వేర్కొంటే పెద్ద గ్రంథమే ఔతుంది. కొన్నింటిని మాత్రం పద్యారంభ భాగాలను మాత్రమే నిర్దేశిస్తూ ఉదాహరిస్తాను.

| ముకుందవిలాసం | | భద్రాపరిణయం | |
|---|---|---|---|
| శ్రుతిపదక్రమలీల | I-118 | భగవున శేషునిన్ | I-106 |
| ధారారీతి సమీర | I-123 | ఒదవెడునాత్మ | I-111 |

| | | | |
|---|---|---|---|
| తారు సరత్న | I-124 | లలితమణీ | I-112 |
| వసుదేవ చిరభాగ్య | I-135 | దేవకీవసుదేవ | I-117 |
| అపరంజి వన్నె | I-136 | కనకంపు వన్నె | I-118 |
| సిరికి వరుండు | I-139 | చెలువుగ మన్మథున్ | I-119 |
| ఒకయేటం జిక్కె | I-219 | ఉవిద నేత్రము | II-107 |
| భువన జాతంబు | II-105 | చలమున మోము | II-103 |
| అడ్డమేర్పడ వళియు | II-114 | వళి యడ్డురేఖ | II-94 |

సర్వవిధాలా సమర్థుడైన సుబ్రహ్మణ్యకవి ఈ విధంగా కాణాదం పెద్దన ముకుంద విలాసాన్ని కాపీ చేయటంలోని చిదంబర రహస్య మేమిటో తెలియదు.

రచనా విషయంలో ఈ విధంగా సుబ్రహ్మణ్యకవి అనేక రీతులుగా అనుకరించినా కథావిషయంలో మాత్రం దిగువపేర్కొన్న మార్పులు చేసినాడు.

i. శ్రీకృష్ణుడు మొదట ఇంద్రప్రస్థపురానికి వెళ్లి ఆ తరువాత రైవతక పర్వతానికి వెళ్లినట్లుగా ముకుందవిలాసంలో వర్ణింపబడింది. భద్రాపరిణయంలో ఇది వ్యత్యస్తంగా చెప్పబడింది.

ii. శ్రీకృష్ణునికి భద్రాదేవి ఉదంతాన్ని వివరించి వారిద్దరిమధ్యా చిలుక దౌత్యాన్ని నెరపినట్లుగా ముకుందవిలాసంలో ఉన్నది. భద్రా పరిణయంలో చిలుక యోగినిగా మార్చబడింది. తిర్యగ్జంతువు దౌత్యాన్ని నెరపటం అనుచితమని భావించి సుబ్రహ్మణ్యకవి ఈ మార్పు చేసి ఉండవచ్చు.

iii. ముకుందవిలాసంలోని ఖాండవ వన వృత్తాంతం, మయుని వృత్తాంతం మొదలైన అవాంతర కథలు భద్రాపరిణయంలో వదలి వేయ బడినవి. సుబ్రహ్మణ్య కవి కథను చాలా సంగ్రహించినాడు.

iv. భద్రాదేవి శ్రీకృష్ణుని తండ్రియైన వసుదేవుని తోబుట్టువు (శ్రుత కీర్తి - సాత్వతి) కూతురు. కనుక భద్రా శ్రీకృష్ణులిద్దరూ మేనత్త మేనమామ బిడ్డలు. ఇంతటి సమీప బాంధవ్యం ఉన్నా భద్రా శ్రీకృష్ణుల కీవిషయం తెలిసినట్లుగా సుబ్రహ్మణ్యకవి పేర్కొనక పోవటం వింతగానే ఉంది. అంతే కాక శ్రీకృష్ణుడొక రాజకుమారుడని భద్ర తెలుసుకున్నట్లు, అట్లే భద్ర

నొక రాజకుమార్తెగా శ్రీకృష్ణుడు విని ఉన్నట్లు చెప్పబడింది. కాని ముకుంద విలాసంలో భద్రా శ్రీకృష్ణులు సుభద్రార్జునులవలె, శశిరేఖాభిమన్యులవలె పరస్పరం పూర్వపరిచయం ఉన్న వాళ్లే అని సూచింపబడింది.

**భాషాచ్ఛందోవిశేషాలు**

ముకుందవిలాసంలోని భాషాచ్ఛందస్సులకు సంబంధించిన విశేషాలను కొన్నింటిని దిగువ పేర్కొంటాను.

క్త్వార్థకేకారసంధి : మఱచైన (II.72)

అసాధు శబ్దాలు : జాగ్రత (II-144)

వైరి సమాసాలు : (బహునాళ్లకు III-28), బహువేలు (II-74)

కువర్ణంపరంగా ఉన్నప్పుడు నగాగమాభావం : శ్రీమంతు కెక్కఁజేయుము (III-73)

వ్యావహారిక ప్రయోగాలు : ఐతే (III-26). ఐనా (II-242) నుంచి (II-242), తిరిగెటి (II-207), మఱీమఱి (II-82) పాడేటి (II-67) పెంచెటిదాని (II-68) లాలించినా (II-72), ఇటీవల (III-5)

అన్యదేశ్యాలు : (బాణి) జాగ (II-140)

వింతక్రియలు : నళతళాయించు (III-198) తళతళ ప్రకాశించు అని అర్థం; వాచించెద (III-14) వచించెద అని అర్థం.

'కాని' కి బదులుగా 'క' : తోడుకఁటమ్మ (II-61)

కళను ద్రుతప్రకృతికంగా వాడటం : లేకన్ (II-202)

**ర - అ ప్రాస**

అప్పకవి ర-అ ల ప్రాసను ప్రాసవైరమని నిషేధించినాడు. కాణాదం పెద్దన దిగువ ఉదాహరించిన అనేక పద్యాలలో ర-అ ప్రాసను ధారాళంగా వాడినాడు.

| | |
|---|---|
| సిరికి వరుడు | I-139 |
| హరికరపాద | I-155 |

| | |
|---|---|
| ఈరీతి నీతి | I-160 |
| కరుణ సహాయ | I-178 |
| నెటి తెక్కల | I-244 |
| మురభంజన | II-78 |
| సరియె కద | II-82 |
| తరుణీ లావణ్యాంబుధి | II-171 |
| హరపరమేష్ఠి | II-242 |
| హరిపైఁ బంచాయుధములు | II-272 |
| హరి యిపుడే | III-8 |
| తెలవ పలుక్కునన్ | III-22 |
| పిఱుఁదుందీవి | II-118 |
| మఱి జానువు | II-119 |
| శారికమా | III-90 |
| మెఱుఁగుసకు | III-160 |
| అరయును | III-193 |
| కీరము సెప్పిన | III-204 |
| మఱియును | III-222 |
| తెలవంగని | III-257 |
| ఆఱుగురిఁజెలుల | III-260 |

## ద్వ్యక్ష్యాది ప్రాసలు

శ్రావ్యతకోసమై ద్వ్యత్రిప్రాసాదుల నెన్నింటినో పెద్దన సోమయాజి ముకుందవిలాసంలో ప్రయోగించినాడు. అప్పకవీయాదుల్లోని లక్ష్యాలను బట్టి ఈ ప్రాసలు నాలుగు పాదాల్లోనూ ఉండవలెనని తెలుస్తుంది. కాని రెండు, మూడు పాదాల్లో మాత్రమే ఉన్నా పద్యానికి శ్రావ్యత కలుగు తుంది. పెద్దన సోమయాజి ఈ ప్రాసలను ఎన్నిరీతులుగా, ఎంత బహుళంగా ప్రయోగించి పద్యాలలో శ్రావ్యత సాధించినాడో కింది ఉదాహృతులవల్ల తెలుస్తుంది.

ద్వి ప్రాస

i. నాలుగు పాదాల్లో

1 ఆశ్వాసం. 19, 37, 54, 82, 92, 117, 146, 150, 158, 167, 169, 174, 207, 232, 284.

2 ఆశ్వాసం. 9, 30, 87, 120, 127, 147, 151, 176, 186, 191, 192, 220, 221, 236, 237.

3 ఆశ్వాసం. 13, 52, 55, 57, 59, 65, 92, 126, 150, 175, 211, 212, 238, 243, 288.

ii. 1, 2, 3 పాదాల్లో

1 ఆశ్వాసం. 260, 261.

3 ఆశ్వాసం. 34, 208, 267.

iii. 1, 2 పాదాల్లో

1 ఆశ్వాసం. 116, 151, 160, 168, 193, 211, 213, 227, 230, 259, 264.

2 ఆశ్వాసం. 36. 54, 70, 94, 104, 107, 173, 206, 245, 248, 260, 276.

3 ఆశ్వాసం. 11, 33, 36, 41, 46, 94, 128, 162, 170, 204, 217, 224, 229, 236. 241, 242, 246, 248, 266, 272, 273.

iv. 2, 3, 4 పాదాల్లో

1 ఆశ్వాసం. 15, 156, 275,

2 ఆశ్వాసం. 73, 125, 142, 203.

v. 2, 3 పాదాల్లో

1 ఆశ్వాసం. 42, 258, 267.

2 ఆశ్వాసం. 101, 184, 255.

3 ఆశ్వాసం. 102, 145, 226.

vi. 1, 3 పాదాల్లో

2 ఆశ్వాసం. 81, 124, 140, 247.

3 ఆశ్వాసం. 86, 116, 159, 182.

vii. 1, 4 పాదాల్లో

1 ఆశ్వాసం. 14, 65, 278.

2 ఆశ్వాసం. 170, 209, 240, 252.

3 ఆశ్వాసం. 93, 146.

viii. 1, 2, 4 పాదాల్లో

2 ఆశ్వాసం. 80, 202.

ix. 1, 3, 4 పాదాల్లో

1 ఆశ్వాసం. 85, 273.

3 ఆశ్వాసం. 184.

x. 2, 4 పాదాల్లో

1 ఆశ్వాసం. 9, 119, 196.

2 ఆశ్వాసం. 122, 124, 246, 269.

3 ఆశ్వాసం. 158, 192.

xi. 3, 4 పాదాల్లో

1 ఆశ్వాసం. 8, 69, 83, 130, 132, 145, 170, 185, 187, 204, 213, 252, 259, 262, 274.

2 ఆశ్వాసం. 36, 110. 130, 200, 208, 260.

3 ఆశ్వాసం. 35, 45, 78, 94, 135, 136, 143, 216, 225, 247, 271, 272, 273, 294, 298.

## త్రి ప్రాస

నాలుగు పాదాల్లో

1 ఆశ్వాసం. 51, 203, 251, 286.

2 ఆశ్వాసం. 32, 35, 52, 163, 204.

3 ఆశ్వాసం. 50, 51, 80, 81, 84, 90, 252, 264.

1, 2, 3 పాదాల్లో

1 ఆశ్వాసం. 165.

3 ఆశ్వాసం. 17.

1, 2 పాదాల్లో

1 ఆశ్వాసం. 103, 125, 170, 181, 204, 261.

2 ఆశ్వాసం. 58, 163, 173, 177, 207, 268.

3 ఆశ్వాసం. 7, 21, 25, 48, 140, 258.

1. 3, 4 పాదాల్లో

3 ఆశ్వాసం. 240.

2, 3, 4 పాదాల్లో

1 ఆశ్వాసం. 146.

2 ఆశ్వాసం. 8.

3 ఆశ్వాసం. 258.

2, 3 పాదాల్లో

1 ఆశ్వాసం. 25, 278.

3, 4 పాదాల్లో

1 ఆశ్వాసం. 103.

2 ఆశ్వాసం. 49, 54.

3 ఆశ్వాసం. 13, 244, 248.

**చతుష్ప్రాస**

నాలుగు పాదాల్లో

1 ఆశ్వాసం. 27, 109.

2 ఆశ్వాసం. 35.

3 ఆశ్వాసం. 118.

1, 2, 3 పాదాల్లో

1 ఆశ్వాసం. 51.

2 ఆశ్వాసం. 182.

1, 2 పాదాల్లో

1 ఆశ్వాసం. 84, 147.

2 ఆశ్వాసం. 37, 49.

3 ఆశ్వాసం. 122, 205, 257.

2, 3 పాదాల్లో
1 ఆశ్వాసం. 28.

2, 4 పాదాల్లో
3 ఆశ్వాసం. 47.

3, 4 పాదాల్లో
2 ఆశ్వాసం. 37.
3 ఆశ్వాసం. 122, 180, 261.

**పంచప్రాస**

నాలుగు పాదాల్లో I-33; II-156, 164.
1, 2 ,, II-31, III-244.
3, 4 ,, I-222, II-31.

**షట్ప్రాస**

నాలుగు పాదాల్లో I-222, II-234.

**సప్తప్రాస**

నాలుగు పాదాల్లో I-2.
1 ,, I-222.

**అర్థాలంకారఘటన**

ముకుంద విలాస కర్తకు శబ్దాలంకారాలపై ఎంత మక్కువో పైన వివరింపబడింది. అట్లని పెద్దన సోమయాజి అర్థ సౌందర్యా పాదకాలైన అర్థాలంకారాలను పరిహరించలేదు. ఉపమ, ఉత్ప్రేక్ష, రూపకం, సమాసోక్తి, శ్లేష, దృష్టాంతం, అర్థాంతరన్యాసం మొదలైన అర్థాలంకారాలను మనోహర రీతిలో ప్రయోగించి శాబ్దిక సౌందర్యంతోపాటు ఆర్థిక సౌందర్యాన్ని కూడా ఘటించినాడు. ఆయా సందర్భాలలో పాఠకులు దీనిని గుర్తించవచ్చు.

**ఉపసంహారం**

ముకుందవిలాసం మొదటిసారి క్రీ. శ. 1875 (శా. శ. 1797) లో గద్వాలలోని 'సాహిత్య విద్యా ముకుర'మనే సొంత ముద్రణాలయంలో గద్వాల ప్రభువు రామభూపాల రాయలవారిచే ముద్రింపబడింది. ఆ తరువాత

మళ్ళీ ఈ ప్రబంధం ముద్రణకు నోచుకోలేదు. పూర్వ ముద్రిత ప్రతులుకూడా ప్రస్తుతం ఎంతో గాలిస్తే కాని దొరకవు. ఎక్కడో ఒక ప్రతి దొరికినా "సంవృత ఏవ శోభతే" అన్నట్లుగా దాన్ని భద్రంగా రక్షించుకోవాలన్న అభిప్రాయమే కలుగుతుంది కాని చదువుకోవాలన్న కుతూహలం కలుగదు. అంతేకాక ముద్రణ దోషాలు వగైరా. ప్రస్తుత ముద్రణంలో ఈ దోషాలన్నీ సవరించబడినాయి.

ఒక శతాబ్ది క్రితం ముద్రింపబడి ప్రస్తుతం అందుబాటులో లేని ఈ ప్రబంధాన్ని ముద్రించటానికి తలపెట్టిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీని సాహితీప్రియులు అభినందించాలి.

గ్రంథ సంపాదన సందర్భంలో నాకు సహకరించిన ఆచార్య పుల్లెల శ్రీరామచంద్రుడు, డా॥ జి. ధర్మారావు, శ్రీ విఠల్ రెడ్డి, శ్రీ సత్యనారాయణ గార్లకు నా కృతజ్ఞతలు

ముకుందవిలాస గ్రంథ పరిష్కరణకు, పీఠికా రచనకు అవకాశం కల్పించిన ఆం. ప్ర. సాహిత్య అకాడెమీ కార్యవర్గానికి ముఖ్యంగా తదధ్యక్షులైన శ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి, కార్యదర్శులైన డా॥ ఇరివెంటి కృష్ణమూర్తిగారికి నా హార్దిక కృతజ్ఞతాభివందనాలు.

"ఇద్దఱు జోడు నన్నకవి యెఱ్ఱన, తిక్కన సోమయాజి దా
నద్దగు వారికిన్ ముగురికొక్కఁడె దీటగు నల్లసాని మా
పెద్దన వారితోడుగను బేరు వహించిన శ్రీ కణాదము
న్బెద్దన సోమయాజి యను పెద్దనఁ బోల్చు కవిత్వసంపదన్"

హైదరాబాదు
26-5-1985

ఆర్. శ్రీహరి

శ్రీరస్తు

శ్రీ హయగ్రీవాయ నమః

శ్రీమతే శ్రీ భూచెన్నకేశవాయ నమః

# ముకుందవిలాసము

## ప్రథమాశ్వాసము

శ్రీ మేల్ గూర్పు భరింపుమీ సకల ధాత్రీరాజ్యము న్నీవ యం
చామోదాప్తి నొసంగు లీల వలనౌ హస్తంబునం దెల్పు నా
శ్రీమత్కేశవ శౌరి సాంద్ర కరుణాశ్రీ రంజిలన్ సద్గుణ
స్తోముం దిర్మలరాయ సోమనృపతిన్ సుశ్రీయుతుం జేయుతన్. ౧

ఉ. శ్రీలలనాంశజన్మపరిశీలను నీలసునంద గోపక
న్యాలసుతన్ వరించు తఱి సంగతమంగళఘోషచాతురీ
లీల ఘటించు లీల మురళీశ్రుతి వర్తిలు కృష్ణమూర్తి గో
పాలుఁడు భక్తపాలుఁడు కృపాళుఁడు సోమనృపాలు నేలుతన్. ౨

శా. శ్రీ మాంగల్యవతీనివాసత నురఃశ్రీ దెల్ప శేషాచల
గ్రామ గ్రామణినా నెసంగి త్రిజగత్కల్యాణ సంధాతయౌ
శ్రీమద్వేంకటనేత ప్రోచు శుభదృష్టిన్ ముష్టిపల్ల్యన్వయున్
సోమున్ రాజలలాము నూర్జితకళాస్తోమున్ జయస్థేమునిన్. ౩

సీ. ఏ నాతి యాకాశ భూనాథ సుతయౌటఁ
దెలుపు నంచిత మధ్యదేశ కలన
నే రామ ధరణీ కుమారియౌ టెఱిగించు
పృథు విడంబ నితంబ బింబ గరిమ

నే నీలవేణి కళానిధి సోదరి
యౌటఁ జాటు మనోహరాస్య లీల
నే యింతి శేషశైలేశ వాసిని యౌటఁ
జూపు రోమాళి వక్షోజ పాళి
నట్టి శ్రీశానుషంగ దయాంతరంగ
లాలితాపాంగ శ్రీ యలమేలు మంగ
యమ్మహాలక్ష్మి సుకుమారుఁ డని యనేక
భాగ్యము లొసంగు సోమభూపాలమణికి. ౪

సీ॥ దనుజభేదనధురంధరమౌ శరమును
శరమును వహియింపఁజాలు గరియు
గరిమేతలకు నాథగరిమ గాంచు గుణంబు
గుణముపై వసియింపఁగూర్చు రథము
రథవరాధారమై రంజిల్లు విల్లును
విల్లునిలుగనుండు వీరభటులు
భటకులజ్యేష్ఠుఁడై ప్రబలు సారథియును
సారథి ముఖవచ స్తుతులు హరులు
హరుల రక్కసిడాచిన యురవుపొదియు
పొదినిఁ జొరఁబాఱు చక్రవిస్ఫురణలెసఁగఁ
త్రిపురవిజయంబు గైకొన్న దేవమౌళి
సోమవిభు శాశ్వతైశ్వర్యధాముఁ జేయు. ౫

మ॥ హరికిన్ సోదరియౌటఁ దద్గుణమునన్ శ్యామాకృతింబొల్చి యీ
శ్వరు భామామణియౌటఁ దద్గుణమునంచన్మందహాసంబునం
దరయందాల్చి గజాస్యమాతయగుటన్ యానంబునందెల్పు నా
గిరిసంజాత యొసంగుఁగాత జయలక్ష్మిన్ సోమభూజానికిన్. ౬

మ॥ హరినాభీకమలంబునందు నిజవక్త్రాళిశ్రుతిస్వానవి
స్తరతంగల్గుటఁ దత్సువర్ణరుచితోఁ దానున్ సువర్ణాకృతిన్
నెరయందాల్చి సువాణి వాణి నలివేణిం బ్రేమ రంజించు వా
గ్వరుఁడిచ్చున్ సుచిరాయురున్నతులు వేడ్కన్ సోమభూభర్తకున్. ౭

ఉ॥ విశ్వనుతశ్రుతిస్తవ నవీన సుధారస ధారలట్ల యో
శాశ్వత పూరుషార్థముల సజ్జనవత్సలయై వసించి యా
త్మేశ్వరు దేవతావృషభు నెప్పుడుఁ బాయని కామధేను వా
గీశ్వరి సోమభూవరున కిష్టపదార్థ సమృద్ధి గూర్చుతన్. ౮

చ॥ నిజభజనాభియోజనవినీత సుధీజన సూక్త సత్కృతి
వ్రజముల మాధురీగుణ మవశ్యము నిల్పునిరీక్ష నిక్షుసా
రజలధిమధ్యవాసతను రంజిలు బాహుదశాంచితున్ మహా
గజముఖు భక్తిమత్సుముఖు గణ్యగణప్రముఖున్ భజించెదన్. ౯

కం॥ అల భోగ సుకీర్తి బలో
జ్జ్వల యోగనిరూఢి సుప్రసక్తులు హరి భ
క్తులు వరముక్తులు మత్కృతి
వెలయింతు రనంతగరుడ విష్వక్సేనుల్. ౧౦

మ॥ సవిత్రుం డాదిగురుండుగాఁ జదివి తత్సాహిత్య విఖ్యాతికై
కవితామాధురి నాటకాకృతికృతిం గల్పించి రామాయణం
బవనిన్ వాగమృతంబు నించిన శుభస్వాంతున్ హనూమంతు స
త్కవికాంతున్ నుతియింతు మామకకవిత్వప్రౌఢి సాహాయ్యర్థమై. ౧౧

కం॥ వరధర్మయుక్తి నరిదర
కర జగదానందకముల కంపిత వికృత
స్మర పంచాయుధ గుణముల
హరి పంచాయుధగణముల నభినుతి సేతున్. ౧౨

కం॥ శ్రీకలితరామకృష్ణ
శ్లోక పతాకాయమాన శుభవాగమృత
స్వీకృతవిలాసులను వా
ల్మీకి వ్యాసుల నుతింతు మేదురభక్తిన్.

కం॥ వివరింతు నుతుల నతుల
వ్యవహారుం జోరు సుకృతి వైభవభూతిన్
భవభూతిన్ శివభద్రుం
గవిరుద్రున్ హరిదాసు కాళిదాసున్.

ఉ॥ నన్నయభట్టు భీమన ననంతు నథర్వుణుఁ దిక్కహోత్రి నె
ఱ్ఱన్నను సోము భాస్కరుని నయ్యలు నైషధకావ్య కర్తఁ బో
తన్ననుఁ బిన్నవీరుని చినన్నను సూరప రామభద్రుఁ బె
ద్దన్ననుఁ దిమ్మనార్యు గరుడాంకుని మూర్తి సుకీర్తి నెంచెదన్.

కం॥ ఎల్లప్పుడు సేవించెద
నుల్లంబున వేదశాస్త్రయోగాన్వితులన్
బిల్లే వంశాంచితులన్
మల్లేశ్వరదీక్షితులను మద్గురువరులన్.

కం॥ ఉర్వర వీరనృసింహా
ఖర్వ కృపాలబ్ధ సరస కవితాలహరీ
ధూర్వహు మద్భగినీధవు
దూర్వాసి నాగార్యు సుగుణధుర్యు నుతింతున్.

వ॥ అదియునుంగాక

కం॥ కాకవుల వాక్కులుండఁగ
నాకవుల మథూచితోక్తు లభినుతి గనియెం

గాకవుల వాక్కులుండఁగ
నాకవుల మధూచితోక్తు లభినుతి గనవే. ౧౯

వ॥ అని యిష్టదేవతానమస్కృతియును, సుకవిజన పురస్కృతియునుఁ, గుకవిప్రకారాంతర పరిష్కృతియునుంగావించి యే నొక్క ప్రబంధంబు రమారమణ పరిణయ ప్రసంగ సంగత శృంగార చమత్కార రసానుబంధముగా నొనరింపంబూనియున్న సమయంబున. ౨౦

సీ॥ భుజశౌర్యదీప్తు లుప్పొంగి నెల్గడిలీల
మౌళిసీమను హేమమకుట మమర
మనివికి కవిబుధమణులు వీనులఁజేరు
సరణి నొంటీలు పచ్చలు సెలంగ
తను సోముఁడని తార లనుసరించిన మాడ్కి
రమణీయ తారహారములు దనర
తము వెచ్చపెట్టకుండ మణీసువర్ణాద్రు
లడిగెదునన కేలఁ గడెములలర

మంజు మంజీర మణిపుంజరంజనాప్తి
లలిత చరణారుణిమతోడఁ గలసిమెలఁగ
దివ్య భూషాంబరములతోఁ దేజరిల్లి
పాలితనృపాళి సోమభూపాలమౌళి. ౨౧

వ॥ వెండియుం దారాచల తారాబల హీరోపల హారోజ్జ్వల రాకాధిప లోకాధిప వరనందన హరిచందన బృందారక మందారక కుంద శరత్కుంద మరుత్సింధుర దరసుందరతర ప్రభానుభావ కీర్తిసుధాలేప దీపితదిశా ప్రదేశ ప్రసారుండును, హరిచరణ సంజాత సురవాహినీ సహోదరీభూత మహాన్వయ విశిష్టముష్టిపల్లి వంశాలంకారుండును, నిజ సంప్ర

దాయ పారంపరీ కల్పితాగ్రహార సమూహ మహిత మహీసుర మహా విభవ రక్షణ విచక్షణుండును, స్వకీయ సోమపాత్రతా సార్థీకృత చక్రవర్తి లక్షణుండును, శ్రీమత్కేశవస్వామి చరణకమల యుగళ భక్తి నిష్ఠాగరిష్ఠుండును, షోడశమహాదాన చతుష్షష్టి విద్యాపటిష్ఠుండును, కేళాదిరాయ రాజవేశ్యా భుజంగ సంగ్రామ ధనంజయాదిగర్భేశ్వరాది బిరుద సార్థసమర్థన ధూర్వహ సాహసాంకుండును, తిరుమలరాయ మహీశ్వరార్ధాంగ లక్ష్మీవిడంబ మంగాంబా గర్భసుధార్ణవ పూర్ణిమా శశాంకుండును, శ్రీమద్విజయలక్ష్మీ సహాయుండును నగు సోమ భూపాలరాయుండు నొక్క శుభవాసరంబున సుధర్మా సమాన సభాంత రంబునం జింతామణివింత రాణించు మాణిక్య సింహాసనంబున నధ్యాసీ నుండగుచు హీరతనుత్రాణహారంబుల నైరావతోచ్చైశ్శ్రవంబుల ననుక రించు కరితురంగంబులెసంగం గార్యచాతుర్య సుపర్వమంత్రులగు మంత్రులును, విద్యావిశేష ప్రసిద్ధకవి బుధులగు కవిబుధులును, నారద సదృశ గానచర్యులగు గాయక వర్యులును, నాసత్య గుణహృద్యులగు వైద్యులును, నప్సరస్సమానతావశ్యలగు వేశ్యలును నాదిగాఁగల పరివారంబు పరివేష్టింప సకలవైభవ సాంద్రుండగు దేవేంద్రుని సొంపున సంపదల నింపొందుచు. ౨౨

సీ॥ నను నందవరపురాన్వయ పయోనిధి చంద్రుఁ
గాణాదవంశ విఖ్యాతి సాంద్రు
నాశ్వలాయనసూత్రు నాత్రేయముని గోత్రు
సకల విద్వత్కవిప్రకర మిత్రుఁ
బ్రౌఢలక్ష్మీపతి పండిత సోదర్యు
బాహట గ్రంథానుభావధుర్యు
వేదశాస్త్ర పురాణ వివిధ మర్మధురీణు
వర చతుర్విధ కవిత్వ ప్రవీణు

భోజచంపూ ప్రబంధార్థ బోధనాను
బంధగీర్వాణ టీకా నిబంధనాది
పేశల వచో రచనచర్యుఁ బెద్దనార్యుఁ
గాంచి దయమించి పలికె సగౌరవముగ. ౨౩

గీ॥ కాదివర్ణంబు లిరువదియైదు విడిచి
చేసితి వపంచ వర్గీయ చిత్రకృతిని
'శేషశైలేశలీలా'ఖ్యచే నెసంగ
యాది మితవర్ణ నియతి శక్యంబె జగతి. ౨౪

ఉ॥ శ్రీరమణీయతన్ సుకపురీనగరీ సగరీయదేశ భూ
భారధురీణుఁడౌ బహిరిరామనృపాలు సభాంతరంబునన్
మారమణాంకితంబుగను మత్స్యపురాణ మొనర్చుఁబూనవే
సారసుధాప్రసార విలసత్కృతి సాంద్ర వచశ్చమత్కృతిన్. ౨౫

కం॥ మీ తాతయు మీ తండ్రియు
మీ తమ్ముఁడు మీరు మఱియు మీకులజులు వి
ఖ్యాత ప్రబంధరచనా
ప్రీతచరిత్రులు కణాదపెద్దన సుకవీ! ౨౬

కం॥ కృతిముఖమున సరసాలం
కృతిముఖమునఁ బేరుఁగాంచు నిల సుతవన సం
తతిముఖములగుట వాణీ
కృతముఖమణి మాకు నొక్క కృతి హితవందన్. ౨౭

కం॥ పురుషోత్తమాష్ట మహిషీ
పరిణయములలోన మున్ను భద్రాదేవీ
పరిణయ మెవ్వరు తెనుఁగున
విరచించుట వినము పూర్వవిబుధులలోనన్. ౨౮

కం॥ కావున మీరది తెనుఁగున
కోవిదు లౌననఁగ శ్రీముకుందవిలాసా
ఖ్యావిధిఁ జేయుడు కేశవ
దేవున కంకితముగాఁగ ధీరవతంసా! ౨౯

కం॥ అని బహుమతి నొనరించిన
విని బహుమతి నేను సోమవిభు ననుమతిచే
ననుమతిమంతులు మేలన
ఘనకృతి రచియింతుఁ జతురకవితావిహృతిన్. ౩౦

కం॥ శ్రీకలితాంకుఁడు సోమ
క్ష్మాకాంతుఁడు దోడుగాఁగ సరసయగు కృతి
శ్రీకి నధిపతినిఁ జేసితి
శ్రీకేశవపతిని సుగుణసింధుఁడ నగుచున్. ౩౧

గీ॥ ఇందు సకలహితము నిచ్చు మున్ విష్ణుచి
త్తీయతుల్యమౌ మదీయకవిత
యుదుట చేవ దొలువ నులిఁ బోలు నళిమోము
మృదువు గాదె విరుల మీఁద త్రావి. ౩౨

కం॥ కుందవిలాసము తావి ము
కుందవిలాసము సదా ముకుందవిలాసం
బిందు విలాసమును సుధా
బిందువిలాసము హసించు పేశలఫణితిన్. ౩౩

వ॥ అని నిశ్చయానుసంధానంబున మదీయ ప్రబంధ సంధాయకుండగు సోమభూపాలరాయవతంసుని వంశాభ్యుదయం బభివర్ణించెద. ౩౪

కం॥ శ్రీదామోదరపాద
ప్రాదుర్భావమున సురతరంగిణి తనకున్

సోదరిగా మేదినిఁ దగు
నాదిని నేవంశ మట్టి యన్వయసరణిన్. 34

కం॥ శ్రీ ముష్టిపల్లినామ
గ్రామప్రాముఖ్య నాదగౌడు కులమునం
బ్రేమను మాధవసేవా
శ్రీమంతుఁడు వెలసెఁ బెద్దనృపవరుఁ డవనిన్. 35

ఉ॥ పెద్దనఁగా నెసంగి నృపబృందములోపల ముష్టిపల్లి మా
పెద్దన బొల్చు వామనుని పెద్దన గల్మిని బల్మిఁ గ్రీడికిం
బెద్దనవాడిచే నకులుపెద్దన పాడి సమీరసూతికిం
బెద్దన సత్కృపన్ గదుని పెద్దన నద్దిర యిద్ధరాస్థలిన్. 36

గీ॥ అట్టి ముష్టిపల్లి యా పెద్దనృపుఁడు పూ
డూరినాద గౌడువీరఘనుని
తనయ బక్కమాంబికనుఁ బెండ్లియాడె న
వ్వీరవిభుని నెన్న నేరి వశము. 37

సీ॥ తన శివావిర్భూతి దక్షభూసురమహా
ధ్వరముఖ్య కార్యవర్ధన మొనర్పఁ
దన మహాభ్యుదయ మెంతయు దంతిముఖ మహా
సేనాది సహజ ప్రసిద్ధి నెరపఁ
దనదు భద్రానువర్తనము ధర్మనిరూఢి
నఖిల విలాసయోగాప్తిఁ బెనుపఁ
దన శౌర్యమర్యాద యనివార్యచర్య సూ
ర్యాదితేజోభేద మావహింపఁ
దన బలస్ఫూర్తి సకలభూత ప్రపంచ
భైరవారూఢి ప్రతిరోధిబలము నణప

సాధుగణములు గణుతింప జగతి నలరె
వీరవిభుఁ దన దేశాయి వీరవిభుఁడు. ౩౯

కం॥ వీరప్రభునకుఁ దిమ్మాం
బారత్నమునందుఁ బొడమె బక్కాంబ సుధా
సారగుణాధార మహో
దార యగుచు వెలసెఁ బెద్దధరణిపు సతియై. ౪౦

సీ॥ తన కీర్తిపుత్రి దిగ్ధవముగ్ధలకు శుద్ధ
ధర్మపద్ధతి కుపాధ్యాయి గాఁగఁ
దన శాసనవినీతి యనుశాసనమురీతి
జనధీసమున్నతి ననునయింపఁ
దనదు వాగ్వైఖరి తనరు వాగ్వైఖరి
సకలవాక్యములకు జననిగాఁగఁ
దనదు సంతానంబు ననఘసంతాన మ
ట్లఖిల శుభాభ్యుదయములఁ బెనుప

నలరు బుధకల్పవల్లి యర్థులకుఁ దల్లి
శిష్టకాంతాజనమతల్లి ముష్టిపల్లి
యన్వయము పెద్దవిభుని యర్ధాంగలక్ష్మి
దిక్కలిత సద్గుణకదంబ బక్కమాంబ. ౪౧

ఉ॥ కందనవోలు ముఖ్యముగఁ గల్గిన సీమల నాదగొండు కీ
ర్తిందగి తుంగభద్రకును కృష్ణకు మధ్యమసీమ రాజ్యల
క్ష్మిందగి ముష్టిపల్లి కులసింహుఁడు పెద్దనభూవరుండు బే
రందె నిరూఢి వీరఘనునల్లుఁడు వైరిమృగాళి భిల్లుఁడై. ౪౨

గీ॥ పాకనాటి మేటి పరిపాటి కులకోటి
నేటి తండు పెద్ద నృపకిరీటి

గనియెఁ బెద్ద సోమఘను సిరిగాహ్వయు
నాత్మజులను బక్కమాంబయందు. ౪౩

సీ॥ అనురక్తి నుదయించినపుడ ప్రభావాప్తిఁ
గువలయపాలనప్రవణ మించి
మఱి నిజకృష్ణాంక మండలంబు వెలుంగ
నుదయాద్రి మొదలుగా నొాగి గ్రహించి
తుంగభద్రోన్నతి దొాడరి రా కందన
వోలి మిన్నగు దేశమేలఁబడిగ
కరకాండ విస్ఫూర్తి గల యవనాఘల
బలములఁ గడు భీతిఁ బాఱనణచి

తనరి విష్ణుపదాసక్తి దనకు నడియ
సత్పథముగాఁగఁ బ్రహ్లాదసరణి వెలసి
దిక్కులందెల్లఁ గీర్తి చంద్రికలు నించి
సోముఁ దలరారె శుభకళాస్తోముఁ డగుచు. ౪౪

సీ॥ పంకజోదరపాదభక్తిఁ బ్రహ్లాదుఁడె
శౌరికీర్తనమున నారదుండె
హరిసువ్రతముల రుక్మాంగదాధీశుఁడె
కృష్ణాభిరతి నంబరీషవిభుఁడె
విష్ణుగుణస్ఫూర్తి వినఁ బరీక్షిత్తుఁడె
నచ్యుతధ్యానచర్యను శుకుండె
మాధవబంధు సంపద ధర్మసూతియె
గరుడధ్వజాసక్తి నరుఁడెకాక

యతఁడు నృపమాత్రుఁడె దిగ్జయప్రభూత
భూరికేశవ సామ్రాజ్య పుణ్యగణ్య

విలసదిభవాజి విభవాది వివిధభాగ్య
ధీవిభుం డొప్పుఁ బెదసోమ భూవిభుండు. ౪౫

సీ॥ అమలిన దానధారామృత యుక్తిచే
భాగీరథీరీతిఁ బరిఢవించి
యవనశోణిత పూరితాసి సంక్షాళణ
నల సరస్వతిరీతి నతిశయించి
యరివధూటీ కజ్జలాశ్రు మిశ్రితలీల
యమునానదీరీతి నధిగమించి
యాత్మదేశంబున నలరెఁ గృష్ణానది
త్రివిధవర్ణముల సుస్థితి వహించి
యహహ పెదసోమ భూపాలుఁ డాహవముల
యవనుల జయించి భువనవిఖ్యాతిఁ గాంచి
యార్యజనములఁ బ్రోచి తద్వ్యాప్తి నెఱప
నతని దేశ మార్యావర్త మగుటఁజేసి. ౪౬

మ॥ గురు భూమీసుర మౌళికిం దన మహాగోత్రైకసామ్రాజ్యమిం
పరయన్ భార్గవుఁ డిచ్చినట్లు పెదసోమాధీశుఁ డౌరా యనన్
గురుభూమీసురమౌళికిం దన మహాగోత్రైకసామ్రాజ్యమిం
పరయన్ దానమొనర్చె నిట్టి నృపుఁ డాహా కల్గఁగా నేర్చునే. ౪౭

వ॥ వెండియుం దత్సోమ భూమండలాఖండలుండు హరిచరణ పరతంత్ర చర్యుండును, హరిపదాయత్త సామ్రాజ్య ధుర్యుండును, హరిగృహ సమ్మార్జన కరదీపికారోపణ వ్యజనాతపత్ర పల్యంకికా వహనాది కైంకర్యాలంకృత హర్ష పులకాంకుర సకలాంగుండును, నిరంతర క్రియమాణ మహాధ్వర దీక్షాదక్ష కమలాక్ష కరుణాకటాక్ష వీక్షణ కల్పిత దక్షిణాది ఫలోత్కృష్ట మృష్టాన్నసత్ర సంతుష్ట విశిష్టజన బహు సహస్రాశీర్వాదాపాదిత మహాభ్యుదయుండును, శరచ్ఛిశిర

పూర్ణిమా మహోత్సవ సముత్సాహ దిగంత విక్రాంత విశ్రాణన ప్రీతా
సేతు కాశీతల పర్యంత భూతలాగత విద్వత్కవిగాయకాద్యర్థి సంతా
నుండును, చండతరదండయాత్రా సముద్దండ మండలాగ్ర ఖండితా
నేక ఖండనాగత యవన మహీనాథ సేనామండలుండును నగుచుం
బేరయ్యె నయ్యెడ. ౪౮

గీ॥ అట్టి పెదసోమభూజాని హర్షమూని
ప్రబలు గద్వాల యను మహారాజధాని
నతిశయించి ప్రతిష్ఠించి యందు మించి
ప్రేమఁ బూడూరి కేశవస్వామి నిలిపె. ౪౯

శా॥ సద్వర్త్యోపల రమ్య హర్మ్య పటలీ సంక్రీడనాసక్త భా
స్వద్వామా కచబంధ బంధుర సుమస్రగ్గంధ సంబంధ సం
పద్వాంఛాగత కల్పపుష్ప మధులిట్పాళీ సముద్వేలతన్
గద్వాలాఖ్య పురంబు భాసిలు రమాకాంతా వరావాసమై. ౫౦

క॥ ఆ పురమున నత్యున్నత
గోపురమున సాలరూప గురుతర ధరణీ
నూపురమున నధిపతియై
ప్రాపు రమావిభుఁడు కేశవస్వామి దగున్. ౫౧

సీ॥ శ్రీ ధారుణీ సతుల్ జెలఁగి పత్నులు గాఁగ
పరమేష్ఠి దగు మంత్రివరుఁడు గాఁగ
బ్రహ్మాండ భాండవర్గములు రాష్ట్రంబుగా
జత మహాదేవుండు సఖుఁడు గాఁగ
గాంచన శైలాదికంబు కోశంబుగా
వైకుంఠదుర్గ మావాసముగను
పరఁగ నింద్రాది దిక్పతులు బలంబుగా
పంచభూతములు ప్రకృతులుగను

సకలరాజ్యాంగములఁ బ్రోచు చక్రధరుఁడు
రక్షకుండును దేవుండు రాజునగుచు
నచటి సోమాన్వయుల దాస్యమాదరించి
చేరి గద్వాల కేశవశౌరి వెలయు. ౨౨

కం॥ ఆ దేవుఁడు చేదోడున్
వాదోడుగ ముష్టిపల్లి వరపెద సోమ
క్ష్మాదయితుఁడు వర్ధిల్లెన్
మేదిని సామ్రాజ్యజయ సమృద్ధి సెలంగన్. ౨౩

కం॥ సిరిగాధిపుఁడిల వెలసెన్
సిరిగా పెదసోమ నృపతిసింహు నను౯ుఁడై
సరిగారే నృపు లతనికి
సరిగాపులఁజేసెఁ దనకు యవనాధిపులన్. ౨౪

గీ॥ అందుఁ బెదసోమభూమీశుఁ దమ్మమాంబఁ
బెక్కి లింగాంబ రామాంబఁ బెండ్లియాడె
నందు లింగాంబ సకలగుణావలంబ
కలిమి జగదంబ యన బేరుకలిమి నలరె. ౨౫

సీ॥ సంపూర్ణ సంపత్పరంపరావిస్ఫూర్తి
నిందిరాసుందరి నెఱుఁగఁజెసె
నిరతాన్నదాన మానిత సత్రవిఖ్యాతి
నిల నన్నపూర్ణాంబ నెఱుఁగఁజేసె
నమలిన బహువిధ వ్యవహార చాతురి
నెసఁగు సరస్వతి నెఱుఁగఁజేసెఁ
బ్రాజ్యసామ్రాజ్య వైభవ శుభావిర్భూతి
నింద్రచంద్రానన నెఱుఁగఁజేసెఁ

దనదు కోనేట నమృతఖేలన మొనర్చు
హరికిఁ గలశాబ్ధి సుఖకేళి నెఱుఁగఁజేసె
లీలఁ బెదసోమవిభుభార్య లింగమాంబ
తనకు లింగాంబ పేరు సార్థంబుగాఁగ. ౨౬

గీ॥ అట్టి పెదసోమనృపతి లింగాంబవలనఁ
బ్రేమఁ దిరుమలరాయలు రామరాయ
లను సుతులఁ గాంచె భూమిజయందు రాముఁ
డలరఁ గుశలవులను గాంచు ననువు మీఱ. ౨౭

కం॥ ఆందగ్రజుండు జగతి ను
తిం దగియెను సోమనృపుని తిరుమలరాయం
డిందుధర కుంద శరద శర
దిందుదరస్ఫూర్తి కీర్తి హితవిభవుఁ డనన్. ౨౮

సీ॥ సత్యభాషా హరిశ్చంద్రుండు చంద్రుండు
సుకళాప్రపూర్తిని సుగుణవర్తి
మతి వివేకసనత్కుమారుండు మారుండు
రూపవిస్ఫూర్తిని రుచిరమూర్తి
తతవైభవాప్తి సుత్రాముండు రాముండు
గురుభక్తియుక్తిని సరసకీర్తి
భవ్యప్రభాచిత్రభానుండు భానుండు
పరతమోపహృతినిఁ బరుషహేతి

యతఁడు దగు కేశవప్రభావానుభూత
భూతలాధీశతాజాత పుణ్యజాత
గణ్య సౌభాగ్య సంతాన కౌశలాభి
రామశుభపాళి తిరుమలరాయమౌళి. ౨౯

సీ॥ అరిదరకర విశేషారూఢిని వహించి
ద్విజరాజ పక్షసుస్థితినిఁ గాంచి
యూర్జితాహీనగోత్రోన్నతి వర్తించి
జనులకు నభయహస్తము ఘటించి
యమల భాస్వత్సత్ప్రియాలోకత గ్రహించి
విజయ సాంగత్యంబు విస్తరించి
యనఘ మంగాఖ్యా ప్రియఖ్యాతి రాణించి
శ్రీనివాస సమాఖ్యచేత మించి

రమణ నీతఁడె తిరుమలరాయశౌరి
యనఁగ నుతిమీఱి వెలసె దయావిహారి
ముష్టిపల్లి కులోద్ధారి ముఖ్యకారి
రమ్యగుణహారి తిరుమలరాయశౌరి. ౬౦

గీ॥ అట్టి తిరుమలరాయేంద్రుననుజుఁడైన
రామరాయఁడుపేంద్రుని రహి నెసంగి
విక్రమస్ఫూర్తి స్వాధీన చక్రుఁడగుచు
నతని సామ్రాజ్యరక్షణం బాచరించె. ౬౧

సీ॥ కన నయోధ్యాంకమౌ దనపురి దగియంత
మహితనయోద్యోగ మహిమ నంది
ధృతిసహజప్రియాదృతిఁ జేరి యావన
వరయుక్తి దక్షిణాధ్వమున నరిగి
ఖరముఖావృత్తి నా ఖలులు వాజినడంగ
హరిముఖ్యసైన్య ప్రణుత్నమునను
పరవాహినీశాళిఁ బఱపి వచ్చి యనేక
ముఖమహోద్ధతి మాన్చి ముదము మించి

యవనిఁ బాలించె రామరాజ్యంబు గాఁగఁ
దన చరిత్ర రామాయణాదరత నెసఁగ
నసమధర్మాప్తిచే నగ్రగణ్యాన్వయావ
నాయతి విహారి దగు రామరాయశౌరి. ౬౨

ఉ॥ శ్రీమహనీయ ముష్టిపలిశేఖర రాజలలాముఁడైన యా
సోముని రామరాయనృపసోముని భోగము సత్యమున్ దృఢ
స్థేమము సత్త్వమున్ విజయశీలతయున్ హసియించు నందనా
రాముని రామునిం బరశురాముని రాము సుమాభిరామునిన్. ౬౩

వ॥ అందు ౬౪

క॥ శ్రీ తిరుమలరాయనికిన్
ఖ్యాతిగ లక్ష్మాంబ మంగమాంబయు ననఁగాఁ
జేతఃప్రియసతు లొలసిరి
శ్రీ తరుణియు భూతరుణియు శ్రీహరికి బలెన్. ౬౫

క॥ తిరుమలరాయల భామిని
మరు నమ్మన సిరుల వెలయు మంగాంబ దగున్
తిరుమలరాయల భామిని
మరునమ్మన సిరుల వెలయు మంగాంబ యనన్. ౬౬

సీ॥ తిరుమలరాయ భూవరుని సుందరి యౌట
ధర నహీనాచలస్థిరతఁ దనరి
భావింప లక్ష్మిసపత్నినా వెలయుట
సుస్థిరాంశసముద్భవస్థితిఁ దగి
వరుసతో సోమభూవరుతల్లి దానౌట
లసదనసూయాప్తి వెసనెసంగి
ప్రణుతపాతివ్రత్య గుణపవిత్రిత యౌటఁ
దులసీసహజలీల నలవరించి

యౌర చెలువందె రమణ క్షమాధిపాల
గర్భవారాశి రత్నవైఖరినిఁ గనుట
సుగుణనికురుంబ యన మించి శుభవిడంబ
మంజుల యశోవలంబ శ్రీమంగమాంబ. ౬౭

చ॥ రమణ సుఖప్రభూతి నల రంగకళానిధితోడఁ బుట్టి యీ
క్షమఁ గమలాకరస్థితినిఁగాంచి తనంత ననంతగోత్ర సౌ
ఖ్యమునను శ్రీయనాఁ దనరె నర్మిలిఁ దిర్మలరాయశౌరి గూ
ర్మిమహిషి మంగమాంబ యురరీకృత సంపదపద్మ పాణియై ౬౮

క॥ తిరుమలరాయ మహీవరుఁ
డరయన్ మంగాంబయందు ననురూపముగా
సరసీరుహాంబకాంచితు
స్మరసదృశుం బిన్నసోమజనవరుఁ గనియెన్. ౬౯

మ॥ హరికిన్ జాంబవతీసతీమణికి మున్నా సాంబుఁడై పుట్టి శం
కరుఁడీ తిర్మలరాయ శౌరికిని మంగానామక శ్రీకి నేఁ
డరయన్ సోమసమాఖ్యఁ గల్గె ననఘూర్థావృత్తి గాదేని యీ
శ్వరతావాప్తియు రాజశేఖరత సర్వజ్ఞత్వమున్ గల్గునే. ౭౦

## పంచరత్నాలు

సీ॥ తనమానసస్థితి తనమానసస్థితి
ఖ్యాతి శౌర్యాశ్రయప్రతిభఁ గాంచఁ
దన సమాఖ్యారూఢి తన సమాఖ్యారూఢి
యటుల సోమస్ఫూర్తి నతిశయించఁ
దనదు నాహవలీల తనదు నాహవలీల
నానావనీపకానంద మూన్పఁ
దనదు జన్యాయతి తనదు జన్యాయతి
రీతి శాంతనవప్రతీతి నించ

నమరు కరిగిరి కిరిహరి కమఠభరణ
కరణలంఘుతా విధాయి దోఃకలితధరణి
వహన మహనీయతా కృతావార్య శౌర్య
పటువిజయశాలి సోమభూపాలమౌళి ౨౦

సీ॥ మతినీతి నల బృహస్పతి సమంబౌనె కా
యఖిలవిద్య లెఱుంగ నతనిసమమె
హరిభక్తి నారదుఁడన సమంబౌనె కా
యసమగాన రసాప్తి నతని సమమె
శౌర్యచర్యను ధనంజయు సమబౌనె కా
యాకారరేఖచే నతనిసనుమె
గురునిష్ఠ రాఘవేశ్వరు సమంబౌనె కా
యతుల ప్రభుత్వాప్తి నతనిసమమె
కాక యితరుల సమమెన్నఁగాఁదరంబె
యతులితాంధ్రక్షమా మండలాంతరాళ
హృద్యగద్వాల పట్టణ శ్రీవిభాసి
పుణ్యవిఖ్యాతికిఁ జినసోమ భూమిపతికి. ౨౧

సీ॥ తన రథ్యహయచయంబును బట్టెనని భక్తి
ననురక్తి నా హరిహయముఁ బట్టి
తన కీర్తి వెలయించెననుచు నా హరికీర్తి
వెలయించుగతిఁ జుట్టు విరులఁ జల్లి
తన శౌర్య మలరించెననుచు నా హరిశౌర్య
మవని నించెటిలీల దివిటి బూని
తనకు రాజ్యం బిచ్చెనవి యాత్మసామ్రాజ్య
రమకెల్ల నా హరి రాజుఁజేసి

నరుఁడు నరుఁడయి గద్వాల తిరుమలేంద్రు
సోమభూవరుఁ డనఁ బొల్చి ప్రేమ నిల్పి
హరికిఁ బరిచర్య లొనరింప హరియు మెచ్చి
యతని నరపతిఁ గావించె నతిశయముగ	౭౩

సీ॥ సుకవుల కొకరొక్కరి కొసంగె నే ఘనుం
డలరి వేనూటపదార్లు గాఁగ
బహుభక్ష్య సత్రముల్ బరగించె నే దాత
ద్విజుల కర్థము పదివేలుగాఁగ
మాఘకార్తిక పూర్ణిమల నిచ్చె నేరాజు
విప్రకోటికి బహువేలుగాఁగ
నాగిఁ గేశవస్వామి కొనరించె నే మేటి
లలితభూషాదులు లక్షగాఁగ

నతఁడు సామాన్యుఁడే యనేకాగ్రహార
భూసురాశీర్వచస్స్పార భూరిపూరి
తాయురారోగ్య భోగభాగ్యాత్మజాది
బహువిభవపాళి సోమభూపాలమౌళి.	౭४

సీ॥ దయ బర్వ లీలచేఁ దనరి విద్వన్మండ
లమునకుఁ జంద్రహారము లొసంగె
శ్రుతి హితస్థితి సుదృక్తతికి రసికతాప్తి
మణికుండలాది భూషణము లిడియె
మతి మెచ్చి వరదుఁడై హితపండితాళికి
భూరికాంచీయుక్తి బొసఁగఁజేసె
సవరించెఁ దగునభిజ్ఞత సత్కృతి స్ఫూర్తి
కవిగాయకుల కలంకారపుష్టి

హిత వొనర్చిన రాజునకేనిఁ దమిని
వసువులును తారహారాదు లొసఁగఁజాలు
తత్తదుచితార్థ సంధానతాధురీణ
బహుగుణవిహారి సోమభూపాలశౌరి ౭౫

మ॥ ఘటియించెం గటిసూత్రముల్ కటకముల్ కంటీలు నొంటీ మ్రణి
చ్ఛటలున్ హేమపటాళికీర్తి మహిళా సంధాన విస్ఫూర్తి కొ
క్కట నానాకవిపండితాళుల కిలన్ గద్వాల సోమేంద్రుఁ డ
క్కట తత్కీర్తివధూటి కెంతయొసఁగంగా నెంచినాడో కదా ! ౭౬

చ॥ తిరుమలరాయ సోమనరదేవ శిఖామణిరీతి భావసు
స్థిరత విభూషణాంబర విశేషధనాదులు భక్ష్యభోజ్యముల్
పెరదొర లియ్యలేరెకద పేర్మినతండొకనాఁడె యింత యీ
వరిది యొసంగెనా యనకనందున మెచ్చినఁజాలు నెంతయున్. ౭౭

చ॥ వరకరుణాభిరామత నవార్య కళావిభవాను భావతన్
గురుతరశౌర్య ధుర్యత నకుంఠితభాగ్య సమగ్ర సంగతిం
దిరుమలరాయ సోమనరదేవ శిఖామణు లీడువత్తురొ
తిరుమలరాయ సోమనరదేవ శిఖామణికిం గ్రమంబునన్. ౭౮

ఉ॥ దాత దయావిశిష్టుఁడు స్వతంత్రుఁడు శాంతుఁ డనేక భాగ్య సం
ధాత యొకప్పుడున్ వెగటు దట్టని నిండుమనంబువాఁడు వా
క్చాతురి నీతియుం గలుగు జాణ భళీ హితగోష్ఠినుండు రా
జేతటి ముష్టిపల్లి ధరణీంద్రుఁడు సోముఁడె యెంచి చూచినన్. ౭౯

సీ॥ ఆదివిష్ణునకు శ్రీమేదినుల్ దగుమాడ్కి
నసురక్తి భక్తిచే నతిశయించి

శౌరికి రుక్మిణీ సత్యాంగనల లీల
సత్కళాభ్యున్నతి సంతసించి
రాజీవశరునకు రతిరుక్మవతులట్ల
యనురూపవైఖరి ఘనత గాంచి
శశికిని రోహిణీస్వాతీ సతులరీతి
సుప్రభావాప్తి విస్ఫూర్తి మించి
పూర్ణభాగ్యక్షమాశీల భోగరూప
ధనవిభాగుణరత్న సంతతులఁ దనరి
సోమవిభునకు భామినుల్ ప్రేమ వెలసి
రీ మహిని వెంకమాంబయు రామమాంబ. ౧౦

ఉ॥ దక్షత భర్త సోముఁడని తాను సతీస్థితి నొందియున్ దయా
వీక్షుఁడు పూరుషోత్తముఁ డధీశ్వరుఁ డంచు నిజాఖ్య వేంకటా
ధ్యక్షునిఁ జేసి ప్రాణవిభుఁ దా నలమేలు విధంబు గాంచె నౌ
నీక్షితి వేంకమాంబ హృదయేశ్వరు భవ్యగుణానువర్తనన్. ౧౧

శా॥ శ్రీరామామణిరీతి నాథహృదయశ్రీ రంజిలం గూర్చుచున్
భూరామామణిలీల వర్తిలుచు సంపూర్ణక్షమారూఢిచే
నా రామాంగనవైఖరిన్ జనకవంశానంద సంధానతన్
శ్రీరామాంబ దనర్చు సోమనృపతి ప్రేమాభిరామాకృతిన్. ౧౨

క॥ ఆ మానవతీమణు లిటు
ప్రేమాయతిచే భజింప శ్రీమద్విపలీ
సోమాధిపుఁ డలరె గుణ
స్తోమాధికుఁడగుచుఁ దనదు శుభసంతతితోన్. ౧౩

క॥ సోమునకునుఁ దిరుమలనృప
సోమునకును రామునకును సోమునకొసఁగెన్

భూమీసామ్రాజ్యము హరి
యామేటికి సోమకులనరావన మరుదే. ౧౪

శా॥ భూదారుండును చక్రి పద్మియును నాభూభృత్తునై శౌరి యీ
భూదేవిన్ ధరియించి సోమకులులన్ బూనించినన్ వారలున్
భూదారత్వము చక్రిపద్మితల నా భూభృత్త్వముం గాంచ లో
భూదారంబును చక్రిపద్మలును నా భూభృత్తులున్ నిల్పవే. ౧౫

వ॥ ఇవ్విధంబున ౧౬

కం॥ ఈ ముష్టిపల్లి సోమ
క్ష్మామండలనాథ విభవ సంరక్షణచే
శ్రీమంతుఁ డగుచు లక్ష్మీ
వామాదృతి కామికేశవస్వామి దగున్. ౧౭

సీ॥ సిరిగుఱించినయాలు నరిధరించినకేలు
నరి హరించినవాలు నమరుసామి
నుడుగునేలినచూలు నడుగుదేలినజాలు
వడుగుబోలినమేలు నడరుసామి
నీటనింపగుప్రోలు హాటకంబగుశాలు
నాటకంబగుచాలు నడుపుసామి
సగము ప్రోచినవ్రేలు జగము బ్రోచినదీలు
ఖగముదాచినడాలు దగినసామి
వారినిధిఁజారి గిరిదూరి వసుధఁ జేరి
వైరిఁ దెగఁజీరి ధరగోరి వరకుఠారి
దారికుముదారి కులుపేరిసీరి నెనరు
మీఱి హయధారి కేశవశౌరి వెలయు. ౧౮

సీ॥ సురలువేఁడఁగ నాలదొరలు గూడ వనాలఁ
దరులజాడఁ జరించి తగమెరించి
సతుల వేలకుమించి యతులలీల వరించి
సుతులఁ జాలఁగఁగాంచి శుభము మించి
పలువిధంబుల దానవులవధంబుల మాన
వుల పదంబులఁ గాడ యిలనుఁ బ్రోచి
నరునిచేత సుభక్తవరునిచేత విముక్త
శరునిచేతన యుక్తవరుల నణచి

భారతరణంబునను ధరాభారతరణ
మావహించి జయోత్సాహ మావహించి
యా విరించి ముఖార్థనం బాదరించి
శ్రీ రహించిన కేశవశౌరి వెలయు. ౮౯

సీ॥ కరిశిరోర్పిత హేమఘటపయః స్నానంబు
హాటకాంబర భూషణాంచలంబు
చందనకుసుమోపచారాది రచనంబు
వివిధమృష్టాన్న నివేదనంబు
బ్రాహ్మణోత్తమ వేదపఠనాది ఘోషంబు
వారాంగనానాట్య వైభవంబు
భేరీపటహఘంటికారవాకలనంబు
పంచమహావాద్య పరికరంబు

భోరు కలుగంగఁ జెలగంగ భూరిమహిమ
ప్రతిదివసవాసరక్షపాపక్షమాస
వత్సరోత్సవముఖ్యోత్సవముల సిరుల
మీఱి గద్వాలకేశవశౌరి వెలయు. ౯౦

## షష్ఠ్యంతాలు

కం॥ ఏతాదృశగుణ జాత
ఖ్యాతాలంకరణునకును గరిశరణునకున్
పూతభవాబ్జాత భవా
నీత నవాపచితి ఖచిత నిజచరణునకున్. ౬౧

కం॥ శరణాగత రక్షునకున్
శరణాయిత విమలకమల సఖవక్షునకున్
కరుణారస పరిణాహస
దరుణాభ సమీక్షణాంతికాలక్షునకున్. ౬౨

కం॥ హేళీసుతాకేళికృతా
జ్ఞాళివృతాభరణునకు దయాభరణునకున్
నీలాముఖ బాలాసుఖ
హేలాదిక యోగభోగ హితకరణునకున్. ౬౩

కం॥ ఆలోలక నీలాలక
జాలాళిక ఫలకరుచివిశాలునకును గ
ద్వాలపురీ శ్రీలహరీ
పాలనరీతి ప్రమోదపరిఖేలునకున్. ౬౪

కం॥ శ్రీమహిళా శ్రీమదిలా
ప్రేమకళాలోలరతికి శ్రీముష్టిపలీ
సోమాధిప సామోద
క్షేమాదరమతికిఁ జెన్నకేశవపతికిన్. ౬౫

వ॥ అభ్యుదయ పరంపరాభివృద్ధిగా నా సమర్పింపం బూనిన భద్రా పరిణ యోల్లాసంబగు ముకుందవిలాసంబను మహాప్రబంధంబునకుఁ గథా క్రమం బెట్టిదనిన. ౬౬

చ॥ అనఘ విదేహదేశ వసుధాధిపుఁడై మిథిలాపురంబునన్
మనుజనక క్షమాధవుని మాధవునిన్ భజియింపుచుం గనుం
గొన నిగమాగమా గమశుకుండు శుకుండరుదేఱ వేఁడెఁ బూ
జన మొనరించి మౌని మహిజాని మురారి వివాహసత్కథల్. ౯౭

వ॥ ఇట్లమ్మహీభుజుండు శుభసంప్రశ్నంబొనరించిన ౯౮

కం॥ ఒకపరి రుక్మిణి మొదలగు
సకియలకార్గురికి పెండ్లిసవరణ వినఁబొం
దికపఱచి యవలిసతికథ
శుకముని యా జనకనృపతిసోమున కనియెన్. ౯౯

ఉ॥ శ్రీరమణీయమై సరసశీతకరోపల సౌధవీథికా
వారిచరద్వధూమధుర వాక్కలనాకలనాద సంకుల
స్వైరకుల స్వరభ్రమదశా వివశత్రిదశద్రు కీరమై
ద్వారవతీపురంబు దనరారు ధరారుచిరావతంసమై. ౧౦౦

మ॥ తనలోనుండు ముకుందుఁ డందు నిలువందానంటునందోన ని
ల్చిన చండద్యుతి మండలంబొ యన నక్షీణప్రతాపోగ్రమున్
జనదృక్చిత్రకరం బనంతమణియుం జంచత్ప్రభాపూర్ణమై
యనువొందుం బురి రత్నహేమవరణం బభ్రంకషప్రౌఢిమన్. ౧౦౧

కం॥ హరిధర్మాశ్రయము గదా
కరవాసము సకలనందకము శంఖనిధి
స్ఫురితంబగుటనుఁ దత్పురి
వరణంబున్ జక్రిరీతి వర్తిలుటరుదే. ౧౦౨

కం॥ నూత్నముగఁ బరిఘ యొప్పెఁ బ్ర
యత్నముగా నచటఁ దటయుగాబద్ధ మహా

రత్నాకర ఘనసంపద
రత్నాకరమనఁ గభీరరచితాంతరమై. ౧౦౩

చ॥ అనిమిషకోటి దైత్యవధ మాత్మను మర్వకయుండఁ దెల్పఁగా
వెనుకొని కోటతంతియల వెంబడిగా డిగివచ్చి నందనం
దనుఁ గనునన్నచోఁ బిదప దాని సమున్నతిఁ జెప్పనేటికిం
దనర నగర్త వారిధియె దాని గభీరతఁ జెప్పనేటికిన్. ౧౦౪

సీ॥ ఏ వీధిఁ జూచిన శ్రీవిష్ణుకల్యాణ
కల్యాణవైభవాకర్ణనములు
నే సీమఁ జూచినఁ బ్రాసాద శృంగార
శృంగారలీలా నిరీక్షణములు
నే వాడఁ జూచిన నావాసకల్హార
కల్హార సుమరసాఘ్రాణనములు
నే నాటఁ జూచిన నానారసారాల
సారాలసానిల స్పర్శనములు
ఎందుఁ జూచిన సంతతానందజాత
నంద జాతగుణాస్వాదనములు గలిగి
యారఁ సకలేంద్రియప్రీతి నావహించు
కాపురంబున నా ద్వారకాపురంబు ౧౦౫

గీ॥ రాజహంసల సద్విహారములు గలిగి
యశ్వముఖ భావితస్ఫూర్తి నతిశయిల్లి
వివిధ ఘనమార్గములచేత విస్తరిల్లి
యల నగరి సోమసూర్యవీథులు దనర్చు ౧౦౬

కం॥ ఆ పురి పరిసరసీమలఁ
బ్రాపిత కరినికర ఘంటికా రావములన్

దీపించుట వీథులు ఘం
టాపథనామముల నెసఁగె నాటంగోలెన్. ౧౦౭

గీ॥ చంద్రశాలల యున్నతి సంఘటించు
చంద్రశాలలయున్నతి శౌరినగరి
నింద్రశాలల సంపద లెసఁగు నప్పు
రీంద్రశాలల సంపదలింపు నింప. ౧౦౮

కం॥ అందలరు మేరురోహణ
కందరములనాఁ దనర్చు గాంగేయమణీ
మందిరములు తత్తద్రుచి
సుందరములునగుచు దము వసుంధరనెన్నన్. ౧౦౯

ఉ॥ అందుల హర్మ్యబృందము తమందిలి కుందనపుందళంబులిం
పొందంగఁ జందురుండొరయ నొందిన సాంద్రతరంబుగా సుధా
స్యందముఁ జింద నందునను సౌధము లయ్యెను గాకయున్న నా
చందురుశాల లేమిటికి సౌధసమాఖ్యలుగాంచు నెంచఁగన్. ౧౧౦

ఉ॥ చందురు రేకడంచు నిడఁజాలియు తారలతారహారపుం
జందముగాఁగఁగ్రైకొనియు సౌరములంచును మేఘబృందముం
బొందికఁ గొప్పులందురుమఁ బూనియుఁ బొధలు మాన్పనుందురొ
ముందుగ సౌధవీథులను ముగ్ధవధూటులు రాజధానికన్. ౧౧౧

ఉ॥ పూటలఁ బూటల న్నగరిబోటుక లాటలు నేర్పు జాళువా
నాటకశాలలం బొడపునం బొడకట్టెడి కూటవాటముల్
హాటకశైలకూటములటం జని యచ్చట వచ్చు నచ్చరల్
చీటికిమాటి కచ్చెరువుచేఁ గననౌ ననిమేషభావముల్. ౧౧౨

చ॥ ముడిచిన ద్వారబంధముల ముత్తెపుఁజాలు మెఱుంగురంగులుం
గడపలఁ బచ్చరాసిరులు గప్పి పరస్పర బింబితంబులై
ముడిగొను పచ్చతోరణము ముచ్చట ముంగిటిముగ్గునిగ్గులై
గడువడి నిచ్చ మంగళముగాఁ గనుపట్టును పట్టణంబునన్. ౧౧౩

ఉ॥ ముత్తెపు పాలగచ్చునునుపుల్ జిగికెంపుమెఱుంగుటోరులుం
గ్రొత్తగు కప్రపుంజికిలి ముగ్గులు నిగ్గులుదేరు భావపుం
జిత్తరువ్రాతలుం గలికిచెక్కడపున్ మగఱాల తావులుం
బుత్తడియిండ్ల తీర్పులును బొందులవిందులొనర్పు నప్పురిన్. ౧౧౪

చ॥ విలసితహర్మ్య వాటికల వేల్పుమిటారులఁ బేరటాండ్రఁగాఁ
బిలిచిన వచ్చి బాలికలు బెట్టిన గుజ్జనబువ్వపున్రుచిన్
వలచుచు నందె నిల్వఁగని వారిప్రియుల్ సరిప్రొద్దుగాఁ దమిన్
సొలసి తదాగమం బెదురుచూతురు స్వర్గపుటూరవాకిటన్. ౧౧౫

కం॥ అప్పురిఁ గల యుప్పరిగల
నెప్పరులగు మగువలెక్కి నిక్కి తమ నెఱిం
గొప్పులఁ గల కల్పకముల
గొప్పసుమము లేరికోరి కోయుదు రదనన్. ౧౧౬

ఉ॥ ఆటలు పాటలుం గలుగు నందపుగందపుఁ గూటవాటముల్
కోటలు పేటలుం బసిఁడిగోడలు మేడలు గల్గవిందు రా
చోటుల నీటులం గులుకు చుక్కను చుక్కను నిండుఁ జెల్వపుం
బోటుల మేటులం దగిన పొన్నలు చెన్నలుపొందు వీటిలోన్. ౧౧౭

సీ॥ శ్రుతిపదక్రమలీలఁ జూపనేరదటంచు
శేషుని క్రిందుగాఁ జేయఁగలరు

కావ్యసంపద నించుకయు నెఱుంగదటంచు
గురు నాదివికృతిగా నెఱపఁగలరు
పంచశిరోమణిప్రౌఢిఁ జాలఁదటంచు
బ్రహ్మను మాటలోఁ బట్టఁగలరు
కడుప్రభాకరయుక్తిగని యదంగునటంచు
ద్విజరాజునొకటఁ గుందింపఁగలరు
సాంగవేదంబు సాహితీ సంగతియును
తర్కమీమాంసలెల్ల సాంతముగఁ దెలిసి
వెలయుదురు కల్పతరుపరిమళము మీఱఁగి
భూమిసురలన నవ్వీటిభూమిసురులు. ౧౧౮

ఉ॥ శత్రుబలచ్ఛిదాచణులు శౌర్యవరప్రభవత్వ భూతికిం
బాత్రులు దివ్యకల్పులు సమగ్రమహాహవ భాగసద్యముల్
మిత్రశుభోదయాశయ సమీహితసుస్థితిచేఁ బవిత్ర స
ద్గోత్రులు దూరితాహితభయకోటులు బొల్తు రిలేంద్రులప్పురిన్. ౧౧౯

ఉ॥ ము న్నిజపూర్వ లాకులలముల్ దిసియుండఁగ నొక్కదిక్కుగా
నెన్నిక కొన్ని తానెఘటియించియ విన్నవతం ఘటించనై
యున్నఁ గుబేరుఁబేరు కొన రూర నవాధికలాభసిద్ధి మా
ద్యన్నిధి మద్విహారులు బెహారులు ముత్తరముందిరంబుగన్. ౧౨౦

సీ॥ హరి పదావిర్భూతి నావహించుటఁజేసి
హరిపదావిర్భూతి నావహించి
హలధరారూఢిచే నతిశయించుటఁజేసి
హలధరారూఢిచే నతిశయించి
ప్రద్యుమ్న విస్ఫూర్తి పరిభవించుటఁ జేసి
ప్రద్యుమ్న విస్ఫూర్తి పరిభవించి

సఫలతుర్యోదయాంశత గ్రహించుటఁజేసి
సఫలతుర్యోదయాంశత గ్రహించి

అమరసింధువు తోడుగా నలరి మనుట
నమరసింధువు తోడుగా నలరి మనుచుఁ
దనరు వర్ణత్రయప్రీతిఁ గనుచు దాన
సార్థవిఖ్యాతి నచటఁ జతుర్థజాతి. ౧-౨౧

మ॥ తగు శృంగంబులఁ జిత్రగైరిక ముఖోత్కర్షంబులం గుంజర
త్వగతిం బద్మకవృత్తి గండఫలకోద్యద్వైఖరిన్ మేఘయు
క్తిగణింపంబడి యున్నతోన్నతములై కృష్ణప్రభావాప్తిచే
నగముల్ మున్నగ వృద్ధిగాంచి నగరిన్ నాగంబులయ్యెంగడున్ ౧-౨౨

శా॥ ధారారీతి సమీరపంచకము పాదశ్రేణికం బట్టగా
నారాచంబులునోడి పార్శ్వముల నంటంగొల్వఁగా నాత్మవే
గారూఢింగనుతేవ దేవమణి మాద్యత్కాంత ఘూషాద్యలం
కారంబుల్ బిరుదుల్ ధరించి పురిలోఁ గన్పట్టు ఘోట్టాణముల్. ౧-౨౩

ఉ॥ దారున రత్నకుట్టిమశతంబులు దోప శతాంగరీతులన్
హారిమణీ శిరోగృహములందు ఫలింప విమానలీలలన్
హీరపురాలజారి చనవిచ్చఁ దనంతట స్యందనస్థితిన్
దీరులుమీఱ నూరఁ దగుఁ దేరులు పేరులు సార్థకంబుగన్. ౧-౨౪

కం॥ తోరంబున సారంబున
బీరంబున నోడిపార చేతీడ్డైనా
నూర నటులు సారభటులు
పీరభటులు గలరు వేనవేలకు మీఱన్. ౧-౨౫

కం॥ రతి వలచు నచటి పురుషుల
నతనుండే వలచు నచటి యతివల నౌరా
క్షితినెంతనఁ బురిఁ బురుషుల
చతురవిలాసములు సతుల సౌందర్యంబుల్. ౧౨౬

గీ॥ కులుకుఁజెక్కులు పసిఁడియాకుల దిసింప
చిన్నికుచములు పోఁకల చెన్నుమీఱ
కలికిలేనవ్వు సుధఁగూడఁ గన్నె లాట
పాటలను జాటుదురు మేటిపీటిసిరుల ౧౨౭

సీ॥ ఏ రాజవరునేని యీ తారకానళి
భ్రమియింపఁజేయదే తమి ఘటించి
యే మహాఘనునేని యీ చంచలాఖాంగి
కళలఁ దేలింపదే క్షణములోనె
యే ధనేశకుమారునేని యీ రంభోరు
వాలసి లోఁజేయదే యుత్తరమున
నే పురుషోత్తమునేని యీ పద్మాస్య
మదిఁ గరగింపదే యెద వసించి

యెట్టి చతురాస్యునేని మోహించుకొనదె
మాటలోననె కూడి యీ మధురవాణి
యని తము గణింపఁబోల్దురు హావభావ
వైభవోన్నతు లయ్యూర వారసతులు. ౧౨౮

మ॥ చెలి యీబంతులు రెండు వ్రట్టువలు మాచేగూర్పు నీవిచ్చినా
వెలఁబొందింపుము పొన్నపూవురుచి తీవిన్మించు బంధూకమీ
గలవే యాననటన్ విటాళి దమివేడ్కంగూడఁ గైకొందు రా
ణులు మీరల్ వసువీరె యంచు సొలయించున్ బుష్పలావీతతుల్. ౧౨౯

క॥ చెంగలువతమ్మికొలనులు
చెంగట రాజనపుచేలు చెఱకుందోటల్
బొంగారు విరులతోటలు
శృంగారమొనర్ప నప్పురిం దిలకింపన్. ౧౩౦

ఉ॥ అందుల నందమౌ నుపవనాళి సమున్నతి సూనబృందని
ష్యందమరందధార నదనందఁ బురందరు వీటితోట నిం
పొందఁగ సాకి వీకఁ దమయొంటుల నంటులనాటి యెప్పుడున్
నందనునట్లు పెంచుటను నందనసంజ్ఞ ఘటిల్లె దానికిన్ ౧౩౧

చ॥ సిరుల గభీరభావముల శీతలతాలలితాశయంబులం
బరమవినిర్మలస్థితుల భవ్యవయశ్శుభరూపలీలలన్
వరసుమనస్సమృద్ధి తమవారిల సద్గుణరీతి నెంచుచున్
సరసులచాలు బొల్చునట సారసరాగముఖాద్యలంకృతిన్. ౧౩౨

సీ॥ మల్లికావల్లీమతల్లికాశ్రేణితోఁ
దటసి దండాదండిఁ దఱుములాడి
శీతలతరవాహినీతరంగములతో
నెనసి హోరాహోరిఁ బెనఁగులాడి
గురువధూవక్షోజ కుసుమగుచ్ఛములతోఁ
గుమిసి బాహాబాహిఁ గుమ్ములాడి
రసవద్వనాంతర ప్రసవ సంఘములతో
వెరసి ముష్టాముష్టి వ్రేటులాడి
కేళికాసారనాళీకపాళితోడఁ
బోక నొరసి కచాకచిఁ బీకులాడి

శౌరి చనవరినాసరా సరిఁ జరించు
నందు చందనశైలమందానిలంబు ౧౩౩

క॥ అందుల వీరును వారన
కందఱు కులశేఖరులు మహాత్ములు సరసుల్
సుందరకవిముఖ్యులు గో
విందపదారాధనమున వెలసినకతనన్. ౧౩౪

సీ॥ వసుదేవచిరభాగ్యవాసనాసారంబు
దేవకీకృత పుణ్యజీవనంబు
నందయశోదాజననసంచితఫలంబు
బలదేవసుకృత సంబంధసీమ
రమ్యబృందావనా రామకేళిపికంబు
కంసాదిఖలతమఃఖరమరీచి
రుక్మిణీముఖవయోరూప సరోహంస
శుకవాక్యమాణిక్యసూత్రసరణి
యా నగరమేలు మేలున యానగరము
భూజనమునకు బహుసౌఖ్యభాజనముగ
మదనశతమూర్తి వల్లవీమానవస్తు
చౌర్యవిస్ఫూర్తి యదువంశచక్రవర్తి. ౧౩౫

సీ॥ అపరంజివన్నె చొక్కపు రెక్కపులుగు రా
బలుగురాని వయాళి బఱపువాఁడు
వనజగేహకు మోహవనరాశి బొంగార
సింగారమొలయు మైచెలువువాఁడు

తెలిదీవి నమృతలీలల దీవివాడలో
మేడలో సుఖకేళి మెలఁగువాఁడు
తొలుపల్కుకొనల పొందులు గాంచి గడిదేలు
జడదారు లెన్నఁగా నడరువాఁడు
జాళువాళాలువాఁ డెల్లజగము నేలఁ
జాలువాఁ డంఘ్రిగననైన జాలువాఁడు
నమరవరుల పూజనమించి యమరుశౌరి
యవని జన్మించి విహరించె యదుకులమున. ౧౩౬

కం॥ నళినదళాక్షుని నిచ్చలు
గొలుచుచు హితబంధురాజగురుభావనలన్
దలఁచుచు భక్తి నొనర్చిరి
యిలలో యాదవుల భాగ్య మేమనవచ్చున్. ౧౩౭

ఉ॥ గొల్లమిటారిగుబ్బెతల కోర్కెలపంట తదీయమానముల్
గొల్లలుబెట్టు దంటమరుకూరిమి గాంచినమేటి రాధికా
పల్లవపాణిభాగ్యపరిపాకము నందుని ముద్దు నిందిరా
వల్లభుఁడైన శౌరిచెలువంబు లవంబు గణింప శక్యమే. ౧౩౮

చ॥ సిరికి వరుండు భాగ్యమునఁ జెల్వమునన్ మరుఁగన్నమేటి ధీ
సరణి విరించికిన్ గురుఁడు శౌర్యమునం బురభేది నోటమిం
బఱపినయట్టి జోదు శితభానుని వియ్యము సత్కళాప్తి సు
స్థిరకృప శౌరి యే మతి నుతింపఁగ శక్యమె తద్గుణావళుల్. ౧౩౯

సీ॥ అతిరమ్యత నెసంగు హరినీలకాంతులు
హరినీలకాంతుల నతిశయించు

నామోదగతిసించు హరిసమ్ముఖస్థితి
హరిసమ్ముఖస్థితి నతిశయించు
నరిఘనోద్ధతి మాన్చు హరివేగవిస్ఫూర్తి
హరివేగవిస్ఫూర్తి నతిశయించు
నాహవోద్యతి మించు హరిపరాక్రమలీల
హరిపరాక్రమలీల నతిశయించు
నహహ యెంతన హరివచోవిహృతి రీతి
హరివచోవిహృతుల రీతి నతిశయించు
హరిప్రభావాప్తి హరిధర్మ సరణియుక్తి
హరిహరి గణించి చూడనే హరికిఁ గలదు. ౧౪౦

గీ॥ కేశవుండగు నా హృషీకేశుఁ డలరుఁ
గొనలు నిగుడ గుడాకేశుఁడను నిరూఢి
కేళినొక నరుమరి గుడాకేశుఁజేయు
నీశునొందదె తాదృశకౌశలంబు. ౧౪౧

కం॥ హృదయమున మును జనించితి
నదనన్ ద్విజరాజునయ్యు నది గాదని యం
దుదయించు చంద్రుఁడో యన
వదనము దనరారు వికచవనజాక్షునకున్. ౧౪౨

గీ॥ అలర సన్మిత్రతను సుధామాప్తి నెసఁగు
హరివిలోచనములు కమలానుకృతియు
కువలయాదృతి గాంచెను నవని నటుల
యౌటరుదె శ్రీమహీభర్తయగు విభునకు. ౧౪౩

కం॥ వనజము వదనంబగుటను
మునుకొని రదనములు కుందముకుళములగుటన్
నునునగవు జాజులగుటను
కనకసుమము నాసయయ్యెఁ గమలాక్షునకున్. ౧౪౪

కం॥ హరి కులుకు తళుకుఁ జెక్కులు
హరినీలపు దర్పణములై యవుఁ దెలిసెను నం
దరియున్ దరముందోచిన
నరయం దద్రేఖలందు రార్యు లెఱుఁగమిన్. ౧౪౫

కం॥ మధురిపు నధరముఁ గనుఁగొని
సుధరమ విధురిమము గాంచె శుచిరుచికదమై
మధురమ యప్పుడఁబడి చెడె
మధురిమ సద్వంశరతికి మాఱెవ్వరిలన్. ౧౪౬

కం॥ కంఠమునకు మధురరవో
త్కంఠమునకు సమముగాక దరగతిచే వై
కుంఠునకుఁ జిక్కె శంఖము
కుంఠతచేఁజిక్కె రేల కూతల మాఱల్. ౧౪౭

ఉ॥ ఆ నెలయందుఁగల్గు పదియాఱుకళల్ మఱిరెండు హెచ్చుగా
నాననసీమఁ గల్గు కళ లా హరికిం బదునెన్మిదంచుఁ దా
మాని మఱుంగుగా గుఱుతులుంచె విరించియు లేక రెండుగా
వీనులపేరి తొమ్మిదులు వేడ్కఁ ఘటించునె పార్శ్వసీమలన్. ౧౪౮

మ॥ సరి రాకన్ హరిదానరేఖ కమితైశ్వర్య ప్రదంబౌటచే
సురశాఖల్ సురలోకవాసమున కచ్చో నొక్కటిన్ నిల్పి త

త్కరశాఖాకృతిఁబొల్చె నిల్చి వచతుష్కంబుం దళశ్రీలచే
మటిగాకన్ సుమనఃప్రియస్థితుల నేమంబొప్పనీ జాలునే. ౧౪౯

కం॥ శ్రీకాంత కొలువుకూటము
పాకాంతకుభీతి డాఁగు పటునీలగిరి
శ్రీకాంతసానువో నా
శ్రీకాంతు నురఃస్థలంబు సెలఁగు వితతమై ౧౫౦

కం॥ సరసిజయుతమగు నాభీ
సరసియు నందొదవు నూర్మికై వాలములై
తరులును రోమావళియును
నిరవగు నుదరప్రదేశ మిరవగు హరికిన్. ౧౫౧

కం॥ నరహరి రూపముఁ దాలిచి
హరి యాకృతిదాల్చె ముఖము నందట తిరుగా
హరినరరూపము దాలిచి
హరియాకృతిఁ దాల్చె కౌఁదియై మధ్యమునన్. ౧౫౨

కం॥ కదళీలలగద లీలలఁ
బొదలీలలి నూరుకటులు బొదలీ జంఘల్
పదలీలలు కిసలయసం
పదలీ యదులోకపతికి భవ్యాకృతికిన్. ౧౫౩

సీ॥ ఇవిగదా దుక్కకై దువ సంకురవతమ్మి
కంటివాల్గెరల బొక్కసములయ్యె
నివిగదా మువ్వేల్పుటిక్కనౌ కరెవాక
ధరిరేకరంగ పాత్రంబులయ్యె

నివిగదా నాలనెల్ఁతవర రాజవరాంధ్ర
గడుసుగుబ్బలకుఁ గెందొడవులయ్యె
నివిగదా తెలిమావురవుతు సంతుపిసాళి
దొడసజ్జుఁ బవళించు నొడయలయ్యె
నివిగదా యంటి తెలుఁగంటి యింటవింటి
దంటదలనంటి పలిగుంటి గెంటుమింటి
జల్లులకుఁ దల్లులుగ నుల్లసిల్లెఁ దొల్లి
యనఁగనగు శౌరి చిన్నారియడుగు లమరు ౧౩౪

చ॥ హరికరపాదశేఖరనఖాళులు తారలసప్తవింశతిన్
మఱి యభిజిత్తునున్ శుచిసమన్వితులౌట సురార్యశుక్రులం
దిరము సమస్థితిన్ గనఁగఁ ద్రింశతియై కనుపట్టె నౌఁగదా
సరియె రమేశునంగముల సంగతిచే ననురక్తి మించుచున్. ౧౩౫

ఉ॥ ఆ హరిదేహరోచులకు నా హరినీలము లోడుటం దృణ
గ్రాహులుగాఁగఁ గాంచి సమరంబులనోడి విరోధులుం దృణ
గ్రాహులునై గుణగ్రహణకౌశల మందిరి యౌఁగదా గుణ
గ్రాహుల గారె చిక్కినను కాలగతిం బ్రతిపక్షు లెంతయున్. ౧౩౬

కం॥ దానవమానవతీబృం
దానవ మానవదురోజహారిమకరికా
దానవిధి విహితమే కద
దానవదళనునకు మకరదళనుండగుటన్. ౧౩౭

కం॥ రాజుల సమస్తదేశవి
రాజుల నింద్రాదిదిగధిరాజుల నతిఘో

రాజుల గెలిచె నతులుగా
రాజిల హరి యీవిభుండె రాజిలనన(గన్, ౧౪౮

సీ॥ తను దేవతాభావమున( గొల్వ వాంఛించు
భూపాలు ధర్మస్వరూపి(జేసి
తను నెల్లవేళ మిత్రత(గూడి వర్తించు
విమలశీలుని సదావిజయు(జేసి
తను భక్తితో(డ వేడిన దీను నైశ్వర్య
మెనయించి ధరణీసురేంద్రు(జేసి
తను నాత్మమూర్తిగా మనసున నీక్షించు
విజ్ఞాననిధి మహావిదుర( జేసి
యాశ్రితశ్రీ సముద్వహనాప్తి నెఱప(
గంకణముగట్టి ఖలజిహ్మగ ప్రశస్తి(
జెఱుప ధ్వజమెత్తి ద్వారకాపురి వసించి
యేలె జగముల హరిలీల లెన్న(దరమె, ౧౪౯

కం॥ ఈరీతి నీతిదైతే
యారాతిని రీతిగా జనావనభూతిన్
మీఱి సుఖస్థితి నొకనా(
డారూఢప్రీతిమతి సమాదృతి నెఱయన్. ౧౫౦

కం॥ ఇంద్రప్రస్థపురంబున
కింద్రప్రస్తరనిభు(డు పేంద్రు(డు కరుణా
సాంద్రత నింద్రతనయు ని
స్తంద్రనయున్ విజయు(జేయ( దా( జనువాంఛన్. ౧౫౧

సీ॥ తన చిత్తమునఁ గ్రొత్తననలెత్త నెనరొత్త
ధర్మజాదులఁజూడఁ దలఁపుదలఁచి
తన సొంపుఁదనమింపుగను పెంపునొనరింపు
గతినంగరాగ శృంగార మెనసి
తన డాలుననడాలుగొనఁజాలు ననఁజాలు
లలితభూషాంబరావళులు దొడఁగి
తన కేల ననుకూలతన క్రేల ఘనలీల
నరిదరాసిశరాసనాదు లూని
యూరడించినవారల నూఱడించి
యలవరించిన చెలులదోనలవరించి
వీటివారాది యుడిగెముల్ వీటివారు
శూరకులులంటిరాగ నా శూరకులుఁడు. ౧౬౨

మ॥ ప్రమదోద్యద్బలమైన సైన్యమును ధారారూఢి నుల్లంఘితా
క్రమముగాఁబొల్చు బలాహకంబు మఱియున్ రమ్యోర్మికావర్తసం
భ్రమలీలందగు మేఘపుష్పమభిరామస్ఫూర్తినొ సూర్యతే
జము సుగ్రీవమునాఁ దనర్చు హయరాజశ్రీలఁ బెంపొందుచున్. ౧౬౩

కం॥ మాతంబూఁతగ నాతటి
నేతెంచెను సుధకు నేటి కేటికని సురల్
భీతిల భుజగారాతిని
కేతనముగఁ దనరు తనదు కేతనము దగన్. ౧౬౪

సీ॥ హీరసారసరాగ పూరితద్యుతితమో
నుదములౌ చక్రసంపదలు దిరుగ

భూరిమహాచలస్ఫూర్తి నఖిలభార
ధరణాఢ్యమైన కూబరము దెలుఁ
దన మణిప్రభలనెంతయు ననంతవిభూతి
మెఱుఁగొప్పగొప్ప చప్పరము దొఱయ
శ్రుతిహిత సంఖ్యాత గతిపదక్రమసిద్ధ
హరులును ఖగవృషభాంక మలర
చారుతారూఢి విపులాప్తి మీఱు సౌరు
దేరు గడిదేరు వడిదేరు తేరుదేర
ననఘువిధి దారకుండు దా ననుపమగతి
నలరెనచటఁ బురారినా నమ్మురారి. ౧౬౫

కం॥ ఈరీతిఁ దేరు జేరి ము
రారాతి సనన్ హృతామరారాతి యటా
తారాతి యూరిదారిన్
భేరులు భోరుకొనె రిపులు భీరులు గాఁగన్. ౧౬౬

మ॥ పురముల్ గోపురముల్ సరఃబులు ఝురఃబుల్ ప్రాంతరంబుల్ వనాం
తరముల్ ఘోషములాత్తఘోషములు గానల్గోనలున్ రత్నసుం
దరముల్ కందరముల్ నదుల్ నిధులు గొందల్ దండలందత్తదా
కరమార్గంబులు దుర్గముల్ గనుచు మార్గశ్రీలలో శౌరియున్. ౧౬౭

కం॥ కానుక లేనిక లాదిగఁ
బూనుక మానక యనేకభూనాథులు రా
వానిఁ గటాక్షింపుచుఁ బ్రభు
వాని కటాక్షణపదవి నరుగుచుఁ బదవిన్. ౧౬౮

చ॥ యమున నఘవ్యపాయమున నభ్రగమోచిత వీచికానికా
యమున వినీలతోయమున నాతతపత్త్రి కులావళీకులా
యమునఁ దటీసహాయమున నంబునిమజ్జనసిద్ధముక్త్యుపా
యమున నెసంగుదానిఁ గని యానదిఁ జేరె మురారి యంతటన్. ౧౬౯

కం॥ ఆ కాళిందీపతి దా
నా కాళిందీపయోవిహారస్నాన
స్వీకృతి దానికిఁ బ్రతిభా
శ్రీకృతి నతిశయముగాఁగఁజేసి చని యటన్. ౧౭౦

కం॥ ఇంద్రప్రస్థ పురస్థలి
నింద్రప్రస్థితి వసించి శ్రీశుఁ డలరిచెం
జంద్రాగతిబలెఁ దన శుభ
సాంద్రాగతిఁబొంగు బంధుజనసింధువులన్. ౧౭౧

వ॥ అంత ౧౭౨

సీ॥ తన గౌరవావృత్తిననురక్తి దగుటచేఁ
గుంతి నార్యాదృతిఁ గొంత నెఱపి
తన వీక్షణముల సంతతికిఁ బాత్రంబౌట
ధర్మజు రాజవర్తనలఁ గాంచి
తన గుణఖ్యాతికి ననుమోదపరుఁడౌట
భీము సదాగతి ప్రేమఁ సేసి
తన సహజావ్రత దనరారి యుండుట
నర్జును సంబంధతాప్తిఁ గలసి

తనదు నాసత్యగతి నెన్నఁదలపు గనుటఁ
గవల నియమస్థితికిఁ జాల గారవించి
తనదుపేరన గణియింపఁ దనరియుంట
నపుడు కృష్ణుండు ద్రౌపది నాదరించి ౧౭౩

కం॥ హితులఁ బురోహితుల ధరా
పతుల సుతుల నతులగతులఁ బతిదేవతలన్
సతుల గుణవతులఁ దగుసం
స్తుతులఁ నతులఁ దేల్చె బహుమతుల బహుమతులన్. ౧౭౪

చ॥ సనయ తనంతవారలు వెసం దనువిందను ప్రీతి నిల్పగా
నెనరునఁ గొన్నినాళ్ళచటనే హరి దా వసియింప నొక్కనాఁ
డనలుఁడు నొక్కచో హరియు నర్జునుఁడుండఁగఁ గాంచి వారలం
దన కమరేంద్రు ఖాండవ వనంబును నాహుతివేఁడు వేడుకన్. ౧౭౫

సీ॥ అసమప్రభావృత్తి నలరి సప్తవ్యాప్తి
విততమై తగు శిఖావితతితోడ
మూడుమూర్తులు జోడుగూడి వచ్చినలీల
బహువేదిరీతి రూపంబుతోడ
పటుసదాగతిమైత్రిఁ బ్రబలి పంకవనాళి
బొరినేర్చు నిజతపఃస్ఫురణతోడ
నటఁ బూర్వమెన్న రెండవదేవుఁడో యనఁ
బొలుపుమీఱు మహావిభూతితోడ
నధ్వరముల విహారయోగ్యప్రసిద్ధి
యాజకులకెల్ల ముఖ్యపూజ్యత వహించి

స్రుక్స్రువవ్యజనాదులు చే గ్రహించి
వెలయు శుచిమూర్తి శుచిమూర్తి విప్రుఁడగుచు. ౧౭౬

కం॥ ఆ కృష్ణులఁ బ్రార్థించి ని
జాకాంక్షిత మెఱుఁగఁజేయ నా సుశ్లోకుల్
లోకనుత జాతవేద
స్వీకృతవాంఛాప్రదాన సిద్ధాశయులై. ౧౭౭

చ॥ కరుణ సహాయమూన్ప హరి గాండివి ఖాండవ మప్పురందరుం
దురమున లెక్కఁగాఁగొనక దుర్జయుఁడై హుతభోక్తకాహుతిం
బఱపఁగ నవ్వనిన్మయుఁడు పావకదాహము నోర్వకెంతయే
భరమున వేడఁబ్రోచె మయుఁ బార్థుఁడు శౌరి యనుజ్ఞనంతటన్. ౧౭౮

కం॥ నియతి ధనంజయుఁడు ధనం
జయునకుఁ దగువస్తువొసఁగి జనహృతదహనా
మయుఁడగు మయుఁ దన్నరునకు
మయసభ యనుపేరి దివ్యమయసభ నిచ్చెన్. ౧౭౯

కం॥ అంతఁ దనంత మురాంతకుఁ
డంతకసుతుఁడనుప ననుపమైశ్వర్యముతో
నెంతయు నిజనగరికిఁ జన
నంతట నమ్మయుఁడు చింతితాంతరుఁడగుచున్. ౧౮౦

కం॥ నరుఁడుండ నేమి వైశ్వా
నరుఁడుండఁగ నేమి మీద నను బ్రోచుటకా
హరికరుణాపరిణాహ
స్ఫురణాదరణాప్తి గాదె సూచకమనుచున్. ౧౮౧

ఉ॥ చేరి మయుండు వేఱెయొక చిత్రసభన్ హరికిచ్చుబుద్ధిచే
ద్వారకకేగి యందు దనుజాంతకు నొక్క సభాంతరంబునం
దారయఁజొచ్చి యచ్చట మహాద్భుతసూత్రవిహారి శౌరి మా
యారచిత్రప్రభావమున నాత్మగమాగమదుర్గమస్థితిన్. ౧౮౨

సీ॥ ఒకయోరఁ గాసారనికరారచనఁ గాన
కూరక చని వాని వారి దడియు
నొకజాడ నతిగూఢనికటగాఢాగ్ర భి
త్తిక ద్వారమని దూరుమొకము గాడ
నొకచెంతఁ దెలివింతటికి వింత యని కొంతఁ
జొచ్చి చీకటి హెచ్చ తిచ్చనుండు
నొకచోట బహుకవాటకవాటమని దాట
గమకించి తెరు వెఱుంగక భ్రమించు
నొకటఁ గనిపించు జనమంచు నొగిఁ జలించు
నంచుఁ బాంచాలికలఁగాంచు ననుసరించు
తన సభ నొరుండు భ్రమియించు దారిదిరుగు
హరిసభను విభ్రమముగప్పి యసురశిల్పి ౧౮౩

వ॥ ఇవ్విధంబున నివ్వెఱం జరింపుచు మఱియును ౧౮౪

చ॥ వెదలుతెఱుంగెఱుంగ కతివిస్మయమునీ భయమంది సిగ్గు పెం
పదర మయుండు విశ్వమయుఁ డచ్యుతుఁ డవ్విభుమాయ బ్రహ్మయుం
గడవఁగలేఁడు మాదృశులకా కనఁబోలుట యంచు నెంతయేఁ
దడవుచుఁ దాను దేఁదలచు తత్సభమాటయ పీడి యంతటన్. ౧౮౫

కం॥ ఒకదిన మా నభలోఁ దన
కొకయేఁడై తనర వనరుహోదరుఁ గరుణా

మకరాలయు హరి నయ్యహి
మకరాలయునెన్న నతని మన్నన గలుగన్. ౧౮౬

క॥ ఆ దివ్యసఖాంతరమున
శ్రీదయితునిఁగాంచి దనుజశిల్పి యనల్పా
మోదరమ నిట్టులను దా
మోదరునకు వినుతిసంభ్రమోదయమతియై. ౧౮౭

క॥ నేనేమి యొసఁగఁదలచిన
నానాచిత్రతఁ గనుంగొనఁగ నవియెల్లన్
నీనగరిఁ గలిగియున్నవి
దాన న్నేనొసఁగు చేది దానవభేదీ ! ౧౮౮

క॥ పావకశిఖ ననుఁ బ్రోచితి
కావున నే మీకు భక్తిగావించెద నీ
రైవతకాచలసానుత
లావని నొక కేళివని దయారత్నఖనీ. ౧౮౯

గీ॥ అనుచు విజయసఖుని యనుమతి గైకొని
ద్వారకాసమీపధరణియందు
హరికిఁ గేళిశైలమగునట్టి రైవత
శిఖరిశిఖరసానుసీమఁ జేరి ౧౯౦

సీ॥ సుమనస్స్థితి నభీష్టసుఫలపూర్తి నెసంగు
సురసాలపాళి భాసురమునగుచుఁ
గిన్నరప్రముఖవిశ్వోన్నతక్రీడలఁ
బటుశివామోద సాఫల్యమగుచుఁ

గమలాకరవిభూతికలితపయస్సింధు
వృతనగాంచితరీతి వితతమగుచు
నజరతాహేతుభవ్యామృతరసయుక్త
వస్తుసంగతి దివ్యవసతియగుచు
శక్రునందన మర్త్యేశు చైత్రరథము
వరుణు ఋతుమంతమును దేవ వనచయంబు
సమముగ నొనర్చె రైవతశైలసీమ
నంచితారామమొక్కటి హరికి మయుఁడు. ౧౬౧

సీ॥ రతిమనోహరకేళిరచనానుకూలమై
దట్టంపుఁదమి నింపు దంపతులకు
సకలేంద్రియానందసంధానహేతువై
యపుడ తాపముఁబాపు నధ్వగులకు
బహుదివ్యపరిపక్వఫలపుష్పసులభమై
వలయుకోర్కెలు గూర్చు వాంఛకులకుఁ
జిత్రరమ్యనికుంజసీమాభిరామమై
లీల ముచ్చటలిచ్చు ఖేలకులకుఁ
గనకకమలము రత్నసైకతము రజత
కైరవము దివ్యహంసమై కనినమాత్రఁ
దృప్తినొసఁగు నా సుధాసరోదేశములను
నంద మొనరించు జనమున కవ్వనంబు. ౧౬౨

కం॥ చలువయు వేడిమి తమముం
దెలివియు దలఁచినవె కలుగు దివ్యతరులతా

వశిమహిమ వెలుఁగుచుం గన
నలరుం దద్వనము సుఖవహనజీవనమై. ౧౯౩

కం॥ ఆ వనరాజోదరమున
కా వనజోదరుఁడు దక్క నన్యులు జేరం
గా వెఱతురు భయగతులై
దేవవితతులైన వాసుదేవుని యాజ్ఞన్. ౧౯౪

వ॥ ఇట్లతివిస్మయంబుగా మయుండయ్యుపవనంబు నిర్మించి చనుటయు. ౧౯౫

ఉ॥ అంత బలారి ఖాండవవనావనదక్షుఁడు గాఁక నాకలో
కాంతరసీమఁజేరి మునుపవ్వననిర్మితివేళ గాంచి తా
నెంతయు విశ్వకర్మ శిఖి కివ్వనజాక్షుఁ డిచ్చుఁ గా
లాంతరమైన నంచుఁ దనకప్పుడె చెప్పుట లోఁదలంచుచున్. ౧౯౬

కం॥ అపరాధినైతి హరికే
నపరాధముబుద్ధి నకట యని సురపతి నా
కుపకారి శౌరి యతనికిఁ
గృప రా నుపహార మిచ్చి హెచ్చెద ననుచున్ ౧౯౭

కం॥ తనకుఁగల దివ్యవస్తువు
లనేకములు వింతవింత లగునవి భువిలోఁ
గనుఁగొన నెయ్యెడ లేనివి
గొని యనిమిషభర్త నరసఖునిఁ గనుఁగొనఁగన్. ౧౯౮

గీ॥ ద్వారకప్రవేశ మొనరించి తత్పురంబు
నందు నిండింటఁ దాఁ దెచ్చినట్టి వస్తు

చయములన్నియుఁ గాంచి విస్మయముఁ బెంచి
శౌరిశుద్ధాంత మటుఁ జేరి శైలవైరి. ౧౯౯

కం॥ హరినగరివస్తువితతికి
నరయ సహస్రాంశమైన యాత్మార్థంబుల్
సరిగామి నగారియు మది
సురగాధిపశయనుమహిమ కోహో యనుచున్. ౨౦౦

ఉ॥ అన్నియు మాని దేవపతి యచ్యుతుఁగాంచి తదంఘ్రిపాళికిన్
వెన్నసురాన మ్రొక్కి హరి ! నేనపరాధిని ఖాండవంబు మీ
రు న్నరుఁడున్ హుతాశనున కాహుతి గూర్పగ దర్పమూని నేఁ
బన్నిన దుష్టచేష్ట నగు పాపముఁబాపు కృపాపయోనిధీ ! ౨౦౧

గీ॥ అనుచు విన్నప మొనరించి యనుసరించి
సన్నుతించినఁ జాలఁ బ్రసన్నుఁడగుచు
నముచిదమనున కనియె నా నందసూతి
సముచితమృదూక్తిమాధురి సాధురీతి. ౨౦౨

కం॥ సోదరుఁడవు భయభక్తిర
సోదరుఁడవు నీవటంచు నురుకరుణ విలా
సోదరుఁడగుచునుఁ దామర
సోదరుఁ దవ్వ్రజి హర్షయుతుఁజేసి తగన్. ౨౦౩

కం॥ నీ కోరిక నే నెఱుగుదుఁ
బాకారిక కొదవయే యుపాయనములకున్
నాకమునఁగల పదార్థ మ
నేకము గలదిచట నివియు నీయవి గావే ! ౨౦౪

వ॥ అనిన నింద్రుం డుపేంద్రునకుఁ బునఃప్రణామం బాచరించి స్వామీ ! నే మీకు సభక్తికంబుగా యథోచితోపచారం బొనరించెద ననుగ్రహిం పవే యని యిట్లనియె. ౨౦౫

కం॥ మయవిరచితవనమున వి
స్మయకరములుగాఁగ దివ్యమయములగు లతా
చయముల నునిచెదనని ఫణి
శయనుని వేఁడుకొని యతని సమ్మతి నంతన్. ౨౦౬

కం॥ నందనవనమునఁగల హరి
చందనముఖనిఖిలవస్తుసమితి యశోదా
నందను క్రీడారామము
నం దనరిచి నగరి కపుడ నగరిపుఁ దరిగెన్. ౨౦౭

వ॥ అంత నవ్వనాంతరంబు దొంటికంటె నాహ్లాదప్రదం బగుటయు. ౨౦౮

గీ॥ అది మొదలుగాఁ దనంత మురాంతకుండు
ప్రియవధూటులు వెంటరా రెంట మూట
వచ్చిపోవుచు నయ్యుపవనమునందు
నుచితకేళి సుఖింపుచు నుండునంత. ౨౦౯

గీ॥ అప్పుడొకనాఁడు వసుదేవుఁ డాత్మభగిని
యైన శ్రుతకీర్తి సాత్వతి నరయుటకునుఁ
గేకయుని పట్టణంబున కేకతమునఁ
బ్రియకుమారుని గదునిఁ బంపిన నతండు. ౨౧౦

కం॥ ఆ యూరం గాంచనమణి
కేయూరాంచితుని దృష్టకేతుని జనతా

గేయునిఁ గైకేయుని శుభ
కాయుని గుణమణినికాయుఁ గనుఁగొని యంతన్. ౨౧౧

మ॥ తమ మేనత్తను నత్తఱిన్ విమలచిత్తన్ సాత్వతిం గేకయో
త్తమభూభృత్తమమత్తకాశిని నుదాత్తం జూచి తా వచ్చి వే
గమ రత్నాంగదుఁ దగ్గదుం దచటి వేడ్కల్ దండ్రికింజెప్పి య
క్కమలాక్షుం గని యేకతంబు తగు యోగక్షేమముల్ సెప్పుచున్ ౨౧౨

కం॥ ఆ కైకయపురమునఁ గల
లోకైకవిలాసవతులలో నృపతనయా
లోకములోపలఁ దనయా
లోకమునకు నతివిచిత్రలోలత దోపన్. ౨౧౩

గీ॥ భద్రనాగగమన భద్రనాలగమన
మేనయత్తతనయ భూనుతనయ
కేకయేంద్రుకన్నె కే కన్నియలు సాటి
కోటివారు భువనకోటివారు. ౨౧౪

పంచచామరము :— వినంగనంగ భద్రకు న్నవీనమైన మేని తీ
వి నంగనం గణింపలేరు వేఱుగాఁగ మాఱుదే
వినంగ రంగదుజ్జ్వలాప్తిపీడు జేతురేమొ తె
ల్వి నంగరంగవైభవాప్తి విద్వదాళి దా వినన్. ౨౧౫

కం॥ అమ్మమ్మ తావి యమ్మరు
నమ్మమ్మగఁజాలు మోవి యమ్మధురసపా
కమ్ము వెడబలుకుతీవి ఁబి
కమ్ము కురుల సిరులు తేటికమ్ము గణింపన్. ౨౧౬

గీ॥ మిన్నుచెన్నుఁ దన్ను నన్నువసతికొను
మించుమించు మించు మెలఁత మేను
తూపురూపుఁబాపు నేపునఁ జెలిచూపు
మావిమోవిఠీవి మగువమోవి. ౨౧౭

కం॥ అమ్మలకుం జెలిచూపు చ
యమ్మలకుం జలిమివాడి యందమ్మలకుం
దమ్మలకుఁ దమ్మలకుం
దమ్మలకదరదపదములు తరుణీమణికిన్. ౨౧౮

కం॥ ఒకయేటఁ జిక్కె మీనము
నొకనెలచేఁ జిక్కెఁ బద్మమొకపగటింటన్
వికలతఁ జిక్కెం గుముదము
సకి నయనసమంబులగునె జడగతు లెపుడున్. ౨౧౯

కం॥ పలుకులు సిలుకల నేలుం
గలకలమను నవ్వుమోముకళ లద్దంపుం
దళుకుల నేలుం గపురపు
పలుకుల నేలుం గపోలఫలకము లహహా! ౨౨౦

చ॥ కలికికి పొంబసింబెసరి గాయలు వ్రేళ్ళు మిటారిగుబ్బలా
చెలువగు నిమ్మపండ్లు రుచిఁజిక్కెడు వాతెర దొండపండు మె
చ్చుల చుబుకంబుడంబు నునుసొంపుల మామిడిపండు పల్కులా
యలరెడి తేనెపండ్లగుట నంగము కల్పకవల్లి గావలెన్. ౨౨౧

కం॥ దాని సొగసునడకలు నల

దానిజిగిఁ జూపు సిరిగల
దాని జిగింజూపు జిలుకు తళుకుం గలిమిన్. ౨౨౨

కం॥ చతురాస్యపంచభూతా
యతసృష్టిన్ మేలుజూడ నాద్యంతము లా
సతి కటిమధ్యములే కద
సతత మనంతానుభావ సంగతిఁ గనుటన్. ౨౨౩

శా॥ సారంగంబు హసించు మేచకకచాంచచ్చాకచక్యంబునన్
సారంగంబు హసించు నీక్షణరుచాసౌభాగ్యభాగ్యంబునన్
సారంగంబు హసించుఁ గంఠనినదస్వారస్యవిస్ఫూర్తులన్
సారంగంబు హసించు యానగరిమం జంద్రాస్య సాంద్రస్థితిన్. ౨౨౪

మ॥ గతి మత్తేభము నాస చంపకమొగిం గ్రైశ్యంబు కందంబు సం
గతవాక్యంబులు మత్తకోకిలలు దృక్పాండిత్య మయ్యుత్పల
ద్యుతి మో మంబురుహంబు దేహరుచి విద్యున్మాలిగా మానినీ
తతవృత్తస్థితు లెన్నఁగాఁ దరమె తద్వాగ్జానికైనం దగన్. ౨౨౫

గీ॥ కుంభకుచ మీనలోచన గోనితంబ
యబ్జధామాస్య హరిమధ్య యళిశిరోజ
చాపసుభ్రూయుగళ నక్రజంఘ యతుల
కన్య సరసక్రియలరాశి గాదె జగతి. ౨౨౬

కం॥ లక్షణముల శుభరోహిణి
యక్షీణస్వాతిభూతి హస్తాంబుజ ధీ
లక్షితచిత్త సదుత్తర
నక్షత్రపుమొలక గాదె నాతి విభాప్తిన్. ౨౨౭

వ॥ మఱియును ౨౨౮

చ॥ ఆళిరుచికొప్పుఁ గొప్పు శశియందురమందిర మోము మోము చం
చలసమమేను మేను లకుచమ్ములలీలకుచమ్ములింపు సొం
పలరెడుమోవి మోవిగడునన్నువ మిన్నువ గౌనుగౌను నా
వెలఁదికయారె యారెదగు వేమఱు నా మరుచేతిహేతిగన్. ౨౨౯

కం॥ రతనాలదొంతి వింతగు
రతినాయకుదంతి కడునెఱాకుందనపుం
బ్రతిమే కద కాంతి భళీ
యతివలమేల్బంతి యింతి యభివర్ణింపన్. ౨౩౦

వ॥ కావున ౨౩౧

కం॥ మేనత్త కన్నె మించున
మేనత్తగఁజాలువన్నె మీకది చెలియై
మేనత్తం గాఁజాలిన
మేనత్తంగాని వానిమేకొను గెలువన్. ౨౩౨

గీ॥ పద్మదృశ నీలకచ మహాపద్మవదన
శంఖగళ కుందరదన కచ్ఛపపదాగ్ర
వరమకరజంఘ జెందనీసిరి ముకుంద
యట నవస్ఫూర్తి నిధిలాభ మందినటుల. ౨౩౩

గీ॥ వసుధ శృంగారసారప్రవాహసరణి
నతను తుంగాయతశ్రీల నధిగమించి
వెలయునది భద్ర యా కృష్ణవేణిఁ గలయఁ
గలుఁగు నీకు విలాససాగరత శౌరి. ౨౩౪

కం॥ అని చూపి చూపి చెప్పిన
యనుజుని వచనములు విని గదాగ్రజుఁ డా జి
ష్ణుని నెపుడు జూడఁగలుగునొ
యని యుస్సురుసురు లూరుచుండె నా సమయమునన్. ౨౩౫

సీ॥ సురసాలసమశీల సురసాల తరుజాల
సరసాలవాలపరిసరంబు
మలయాగతటభాగనిలయాగమాభోగ
వలయాగతసదాగతిలసితంబు
వనితాజనసమాజజనితాజరమనోజ
జనతాజయవిరాజదనునయంబు
సురతాంత సునితాంత పరితాంత సదుదంత
భరితాంతరసకాంతవరచయంబు
గహనసహచర సహచరావహిత మహిత
పికచరుచికుల విచికల సకలవకుళ
విసరమధురస మధురసదసమకుసుమ
సముదయము బొల్చె మధుమాససముదయంబు. ౨౩౬

సీ॥ పరపర్వవిస్ఫూర్తి వనరాసు లుప్పొంగె
దగువిధిఁ జంద్రుఁ డుత్కర్ష మించె
ధర్మాశఁ గనె జగత్ప్రాణధారారూఢి
యతనువైభవలీల లతిశయించె
సుమనస్సమూహముల్ సొంపుచే నింపారె
జగతి సాఫల్యంబు సంగ్రహించె
శుకముఖద్విజరాజసూక్తులు విలసిల్లె
సారసస్థితి హంసచయము లమరె

యోగవితతికి నానంద ముదయమందె
వేడ్క దనుజాతి హరణప్రవృత్తి యనుచు
సకలజగములు గణుతింప సరసరీతి
భూరిగతిఁ బొల్చు మాధవాభ్యుదయమహిమ. ౨౩౭

శా॥ శ్యామాళుల్ పురుషవ్రజంబు సుమనోవ్యాప్తిన్ ఫలశ్రీలచే
నామోదింపఁగ నమ్మహావనివిభుండై మాధవుండొప్పె నౌ
శ్యామాళుల్ పురుషవ్రజంబు సుమనోవ్యాప్తిన్ ఫలశ్రీలచే
నామోదింపఁగ నమ్మహావని విభుండై మాధవుం డొప్పడే! ౨౩౮

కం॥ పేరు వహించి వసంతుఁడు
సౌరభ్యము గాంచఁ దత్ప్రసవసంతతియున్
సౌరభ్యము గాంచెను భళి
యారయ సత్పురుషకులము లట్టివె కావే! ౨౩౯

సీ॥ కలరవంబుల రకంబులఁ బికంబులు గేరె
రమణఁ గీరములు బేరములు బారె
పొదలు పూఁబొదలు సంపదల సొంపలరారె
జాతభీతిని జాతిరీతిదారె
పొలుపొంద సుమబృందముల మరందము లూరెఁ
దద్బిందువుల మిళిందములు సేరె
మరు హేతి విరహిమర్మములు బిమ్మర దూఱె
శమనదిగ్వాతపోతములు వాఱె
రవి రవళిదేరె పథికధైర్యములు జాఱెఁ
దాప మేపారె జనము శీతలము గోరె
సుమరజము గూరె వనవిహారములు మీఱె
మాఱె శిశిరంబు బెంపారె మధుదినంబు. ౨౪౦

ఉ॥ చందనశైలసానువుల సందులఁ జల్లని మల్లికాలతా
మందిరసీమలన్ రతిసుమాళములం బయికొన్న దేవతా
మందమరాళగామినుల మైవలపుంజెమటల్ హరింపఁగాఁ
బొందుగ వీచు వీవనలఁ బోల్చి చరించె సమీర మత్తఱిన్. ౨౪౧

కం॥ హెచ్చిన కూర్మి వసంతుఁడు
నెచ్చెలియై రా బిరాన నెమ్మి నకీబుల్
హెచ్చరికఁ దెలుప మదనుఁడు
వచ్చెం జయమంద విరహవచ్చయమందన్. ౨౪౨

కం॥ మాకంద మాకరందర
సాకరసీకరపరంపరామోదపరీ
పాకవశోన్మదమధుకర
పాకము లమ్మరుని నల్ల బజయనఁ దిరిగెన్. ౨౪౩

కం॥ నెఱితెక్కకొనలు మొనలుగ
సరదళకులకములు నాయసపు ముఖకులుగా
శరముల సరులగు విరులన్
మరుతూణములనఁగఁ దనరె మధుదినవనముల్. ౨౪౪

కం॥ ఆ వనములఁ గీరావళి
యావళితగతిన్ భ్రమించునందం బలరెం
గావా తిరిగెడు మారుని
మావా లన నపుడు వికటమండలగతులన్. ౨౪౫

కం॥ ఆ విరులు గళ్లెములుగాఁ
బావనచలనంబు గమనభావముగాఁ బ
త్త్రావళి పల్యాణములుగ
మావు లమరె నపుడు మరుని మావులలీలన్. ౨౪౬

సీ॥ పద్మిను లాసవపరిపూర్తిచే మించి
మధుపాళికేళికై మలయుచుండ
ఘనతరుల్ విటపసంగతులఁ జాల నెసంగి
పరలతాతనుయుక్తిఁ బరిఢవిల్ల
బహుసుమనస్తతుల్ పల్లవావళిఁ గూడి
గడకై నకొమ్మలఁ గలసిమెలఁగఁ
గూత పంచమవృత్తి గొని వనప్రియరాజి
గణికాప్తి పత్రభంగము లొనర్పఁ

గృతరజోవ్యాప్తి మంచి వారినిఁ గలంచి
జాతిహీనతఁ బెంచి కుజాతి నించి
యతిశయించి తపఃస్ఫూర్తి నపహరించి
మధువిభుం డాత్మవిభవైకమహిమఁ దెలిపె. ౨౪౭

సీ॥ నిండుచల్వలుదేఱు పండువెన్నెలనీరు
చండాంశురుచితీరు సంఘటించెఁ
గలయ మెల్లనఁ బాఱు మలయానిలము సౌరు
విలయానలముతీరు వెగటునించె
కలకలమ్ములఁజేరు నళికులమ్ముల చేరు
చిలుకుటమ్ములు తీరుగఁ డక మించె
మిసమిసమ్ములమీఱు కిసలయమ్ములమారు
నసిచయమ్ములతీరు నావహించె

సంతతామోదలహరీ నిశాంతమగు వ
సంతము దురంతకల్పాంతసమయమయ్యె
నంత రతికాంతలతికాంత కాంతకుంత
తాంతహృదయాంతలై యున్న కాంతలకును, ౨౪౮

పారిజాతహరణశ్లేష :—

చ॥ ధర మధుహారిలీలగొనఁ దా సురసాలముపై మరుద్వరుం
డురుసుమనోదళోద్గతుల నూన్పఁగఁ గృష్ణశిలీముఖావళుల్
మెఱసె దివిం దదీయజవలీల సనంగ నపూర్వవైఖరిం
బురిగొని వచ్చి తత్తరువుబూన్చె నటం బ్రమదాలయంబునన్. ౨౪౯

అక్షరద్వయ కందము :-

కం॥ కోకిల కలకలలీలలఁ
గేకుల కేకలఁగులాళికిలకిలలకళా
కాకలికేళాకూళుల
లోకాళులు కేళికళికె లోలాకులలై. ౨౫౦

కం॥ సవములు భూసురులకు నా
సవములు నళివిసరములకు సరసవసంతో
త్సవములు జనులకు సతతో
త్సవములుగా నమరెఁ గుసుమసమయముల మహిన్. ౨౫౧

కం॥ ఆ మధుదినమున నొకనాఁ
డా మధుకులనేత ప్రాతరారంభమునన్
నేమంబు దీర్చి యిష్ట
స్తోమంబులతో భుజించి సుఖమున నంతన్. ౨౫౨

సీ॥ పసిఁడితాయెతల సొంపెసఁగ రుక్మిణి బూన్చు
సిగదండ విరిదండ సొగసుబాఱ
ముద్దుమోమునఁజొక్కముగ సత్య మునిగోటఁ
దీర్చిన కస్తూరితిలక మమరఁ

జనుదోయి పస పంటుకొని ఘుమ్మురన జాంబ
వతి సవర్చిన వల్లెవాటు మెఱయ
వలఁతిగాఁ గాళింది యలఁదిన పచ్చక
ప్పురపుగందము మేనఁ బరిమళింప

గందవొడి సొంపుగా మిత్రవింద పూయ
గళమున సుదంత హారసంఘములు గూర్ప
రాధ చేదండఁ జుట్టఁ బైరమణులెల్ల
నింపు సవరింప హరి యలంకృతుఁడు నగుచు. ౨౫౩

వ॥ మఱియును ౨౫౪

సీ॥ చిన్నారి చెలువంపు చికిలియొంటీల పొం
కము తీఁగా భుజాగ్రముల నెరయఁ
గొఁదమచుక్కల సిగ్గుగొను ముత్తెములు కంఠ
సరణి బంగరుగుండ్లసరుల దొరయ
నుదయారుణద్యుతు లుప్పొంగ నురమునఁ
గౌస్తుభమణిపతకంబు మెఱయ
రాజ్యభారధురంధరంబౌ కరంబున
నమితరత్నాంగుళీయకము లొరయ

రాజకోటీర రత్న నీరాజితాంఘ్రి
కళలు దులకించు పరభయంకరశుభాంక
గండపెండెరదాకచక్యములు బెరయ
ధారుణి మహేంద్రుఁడన మీఱి దానవారి. ౨౫౫

గీ॥ చలువ చెలువారు నెలరాల చప్పరాలఁ
గుప్పఁగారాలఁ గ్రొవ్విరుల్ కుసుమశరుని

తగిన కూటంబనాఁ బొల్చు నగరితోట
లోపలిహజారమునఁ గొల్వుఁ జూపె శౌరి ౨౫౬

వ॥ అయ్యవసరంబున ౨౫౭

కం॥ వనమాలికడకు రైవత
వనపాలురు వచ్చి ప్రీతి వచియించిరి త
ద్వనపాళీసునగాళీ
ఘనకేళీమేళనేచ్ఛ గలుగఁగ నిటులన్, ౨౫౮

కం॥ దైవతవరదైవతగిరి
భావితమయరచితమగుచు భాసిలురుచి నిం
పావనగతి పావనగతి
పావనవృతి నలరు జగతి ప్రాణపదముగాన్. ౨౫౯

ఉ॥ అచ్చటి మాధవోద్గమము లచ్చటి హంసగమప్రవర్తనం
బచ్చటి నీలకంఠగతి యచ్చటి పుష్పవదాగమోచ్ఛ్రయం
బచ్చటి శక్రయక్షవరుణాదిక దివ్యతరుల్ వసించుటల్
నిచ్చలు నే వనిం గలవు నీదు మహావనలీల దక్కఁగన్. ౨౬౦

కం॥ మహితరసంబుల సుమనో
వహితరజంబులనుఁ గాలువలు గనిమలుగా
విహితగతి నెఱపి మాకున్
సహచరములు నయ్యె నచటి సహచరచయముల్. ౨౬౧

కం॥ అలివేణులఁ బికవాణులఁ
బులినశ్రోణులఁ బ్రవాళపుటపాణుల న
య్యలరుంబోణుల మాధవ
యలరున్ వనరమ భవత్సమాగమవాంఛన్. ౨౬౨

సీ॥ బహువిహితాభీష్టఫలపాళిఁ నీఁజాలి
యది మధూదయముల ముదముఁ జేయు
సుమనోవిశేషాత్తహిమవారిపూరమై
యవి వేసవులఁ బ్రేమ నలవరించు
బలునింపుగల జొంపములు మేఘలై కూడ
నది తొల్కరుల హర్ష మావహించు
లలితాగ్నిశిఖలయం దలరువేడిమితోడ
నది శీతులనుఁ బ్రీతు లతిశయించు

నెరయు నురుకుంజములఁ బగ లిరులొనర్చు
వెలయు జ్యోతిర్లతల రేలఁ దెలివిగూర్చుఁ
దలఁచుకోర్కెలొసంగు వింతల నెసంగు
నగమసంతానసంగతి నా వనంబు. ౨౬౩

కం॥ ఈ విధి వివిధవినోద
శ్రీవిధమున రక్తిగనుటచే నెన్నంగా
నేవారి వశము మాధవ
నీవె తగుదు విలఁ దద్వనిశ్రీలఁ గనన్. ౨౬౪

గీ॥ అనుచు వనపాలకులు పల్క నెనరు జిల్కఁ
దన వనశ్రీల దర్శింప దయ జనింప
మెచ్చువగఁ గట్టి సారథి దెచ్చినట్టి
రథముపైఁ జేరి మురవైరి రయము మీఱి. ౨౬౫

కం॥ తన దివ్యచిత్త మెట్టిదొ
యనుగతి నొక వనజనయననయినం బిలువన్
బనుచక వనజేక్షణుఁ డా
వనవీక్షణవాంఛ నపుడు వనపాలురతోన్. ౨౬౬

చ॥ అటఁ జని కాంచెఁ గృష్ణుఁడు నభోంతరటత్తటకూటవాటికా
చటులవనాటినీ ఘటితసౌరనగర్యుపకారికామరీ
పటలపటుభ్రమీభ్రమదుపాంత విమానమరుత్సమాజమున్
రటదళిసీవలత్సుమధరాజము రైవతకాద్రిరాజమున్. ౨౬౭

గీ॥ ఆ నగవిశేషలీల లిట్లరసి ప్రేమ
నా నగవిశేషలీలలనలరు నలిన
నాభు వనపాలకులు సూచి యతులగతుల
నా భువనపాలకునితోడ ననిరి భక్తి. ౨౬౮

కం॥ స్వామీ ! యీ మీ కేళీ
భూమీధర మెన్నఁదరమె భువనస్తవన
శ్రీ మీఱు దైవతంబని
సామోదరసాప్తిఁ దత్ప్రశంసాపరులై. ౨౬౯

సీ॥ చమరీనికరవాల సమరీతిరతిఖేల
దమరీగళితవాలసమితిలీల
మతికాంతమణికూట తతికాంతి కృతఖేట
గతికాంతరుచి ఝూటగగనవాట
మబరీణఘనభవ్యశబరీఘటితనవ్య
కబరీభరితదివ్యకాద్యభావ్య
మసమానసురగానరసమానసుసమాన
లసమానతరుసూన రసదళీన
మలఘుతరశీతకర శిలాఫలకఫలిత
కలితపరిసర శశికరావళితలలిత
తతబిసాశయ నానటత్తటతటాక
జాలజాలపదాళి యీ శైలమౌళి. ౨౭౦

కం॥ అన్నియు నారోహణగతు
లన్నియును గిరీశవసతులన్నియు సురవా
సోన్నతు లిన్నగ శృంగము
లన్నియు మణిరజతకాంచనాద్రులు సుమ్మీ ౨౭౧

గీ॥ కలితరుచి నిందురాజితగ్రావసీమ
లందుఁ దగు నీలకంఠ నృత్యంబులమరుఁ
గలితరుచి నిందురాజిత గ్రావసీమ
లందుఁ దగు నీలకంఠనృత్యంబులరుదే. ౨౭౨

కం॥ అంచన నంచ నటించఁగ
నంచితచతురాస్యగతుల నలరుచు నచటం
గాంచనఘనశిల గననగు
కాంచనగర్భునివిధమునఁ గమలజజనకా! ౨౭౩

కం॥ చంచత్సహస్ర శిఖరా
భ్యంచితమగుచున్ సుపర్వవంశావృతమై
కాంచనగు నీ నగంబా
కాంచననగవసతి యనఁగఁ గాంచనవసనా! ౨౭౪

కం॥ హరి యీ గిరులన్విరులం
దరులం గురులంబమానతరులం దరులన్
హరులన్ హరులంగిరులం
గరులం గల సిరులదొరల గనుమని మఱియున్. ౨౭౫

సీ॥ ఈ దారిఁ బోరాదు కేదారకోదార
శాదారతముః వేఱె చనగవలయు

నీ సారువులసారెసా సారకాసార
భూసారతటగతుల్ బూనవలయు
నీ వాకలో వీఁక హేవాకయావాక
నావాకలనలెక్క పోవవలయు
నీకేరినిటఁజేరి శ్రీకారికోకారి
పాకారిశిలలెల్లఁ బ్రాకవలయు
కేళినగమిది పళితకంగేళినగము
కూటపాళిక యిది రత్నకూటపాళి
యనుచు ననుచరు లెఱిగించిరపుడు హరికిఁ
గేళివనపాళిమార్గాళిహాళి దేలి. ౨౭౬

అంత నయ్యాదవేంద్రుఁ డత్యంతవిభవ
సాంద్రుఁడై సురసాలని స్తంద్రమైన
నందనవనంబుఁ జేరి యానందపూరి
తముగ నేత్రసహస్రపత్రములఁ గాంచి. ౨౭౭

కం॥ హృద్యానవద్యచరణల
సద్యానములొలయఁజొచ్చి చని తనదు విలా
సోద్యానము మనమునఁ గడు
సోద్యానంబొదలి దనుజసూదనుఁడచటన్. ౨౭౮

సీ॥ ఇవి పారిజాతంబులివి వారిజాతంబు
లివి శారజాతంబు లిందువదన
యివి కుంజభాగంబులివి వంజులాగంబు
లివి మంజునాగంబు లిభశరణ్య

ప్రథమాశ్వాసము

యివి మాతులుంగంబులివి జాతిలుంగంబు
లివి జాతిరంగంబు లీశ్వరేశ
యివి గంధసారంబులివి సింధువారంబు
లివి కుందవారంబు లీడితాంగ
యివి విశాలరసాలంబు లీశమిత్ర
యివి సరాగసురాగంబు లింద్రవిభవ
యివి కదంబకదంబంబు లినసమాన
యనుచు వనపాలకులు దెల్ప నరిగి శౌరి.

కం॥ అందొక యిందుమణీతట
సందీప్తవసుధాంబుసరసి సరసంజలావల్
చిందు నొక ద్రాక్షపందిటి
క్రింద ముకుందుఁడు వసించి కృతవిశ్రముఁడై.

కం॥ ఆ సవఫలభోక్త విభుం
డాసవఫలభోక్తయయ్యె నంత నచటఁ దా
నాసవఫలదుండగు హరి
యాసవఫలదుఁడయి హితుల కభిహితరీతిన్.

సీ॥ అట దేవవల్లభుండరసెఁ గేసరములఁ
బొన్నల విహరించెఁ బురుషవరుఁడు
తిలకించెఁ దిలకపంక్తులను శ్రీమంతుండు
మన్నించె వాసంతి మాధవుండు
కాంచనవాసముల్ గాంచెఁ గాంచనవాసుఁ
డల కృష్ణమూర్తి శ్యామాళి నెనసెఁ
దనరె గంధవిశేషతరుల ముకుందుండు
సరస గోరంట శ్రీసహచరుండు

సాధుసంతానములలోన సంచరించె
సాధుసంతాన మీరీతి సరసభాతి
నా వనంబునఁ గ్రీడించె నాదిత్రిభువ
నావనంబునఁ గ్రీడించు నఖిలభర్త. ౨౮

శా॥ ఆమోదాన్వితపల్లవైకగణికాశ్యామాంకముం బ్రస్ఫుర
ద్దామోద్యద్దళముం బ్రఫుల్లకురువింద ప్రోజ్జ్వలత్సాల జా
లామేయోన్నతమున్ శ్రుతిప్రియదశద్దాంచద్ద్విజంబున్ వర
శ్రీమంతంబుగ శౌరికవ్వనము వొల్చెన్ బట్టణశ్రీ యనన్. ౨౮

ఉ॥ పూవులతీవులం జెలఁగు పొన్నలగున్నల నెన్నికైన పెన్
మావుల మోవులంగలసి మల్లికలల్లిన గొప్పకప్రపుం
దీవుల తావులం జలువతెమ్మెర గ్రమ్మ రహించు సమ్మద
శ్రీవలమానమానసముచే హరి యవ్వనకేళి సల్పుచున్. ౨౮౪

ఉ॥ పుష్పొడితావులన్ వలచు పూవులనుం బొదరిండ్లదారులం
గప్పురపుంబిడారులనఁ గమ్మని క్రొన్ననతేనెసోనలం
జొప్పగు చల్వసోనలను జొచ్చి ముదంబు హృదంబుజంబునం
దుప్పతిలంగఁ జూచె వనజోదరుఁ డెంతయు సాదరంబుగన్. ౨౮౫

కం॥ చిలుకల కంఠములను రా
చిలుకల కంఠముల నింపుఁజిలుకు పలుకులం
గలకలరవముల సొంపగు
గలకలరవములఁ బ్రియంబు గని హరి మఱియున్. ౨౮౬

సీ॥ పొదలు దూరఁగ మేనఁ బొదలు పుప్పొడిరంగు
పసనెసంగు నలుంగుపసపు గాఁగఁ

దిరుగుచో శిరముపై నొఱయు సంపెగగుంపు
సుకరంపు శిఖికంపు సొంపు గాఁగ
విరుల నంటిన నంటు గురుమరందరసంబు
కరపంకజమునఁ గంకణము గాఁగఁ
బరిపక్వమై రాలు ప్రసవంపుగమి చాలు
బటువులౌ ముత్తేల ప్రాలు గాఁగ

గుత్తులై యున్న కిసలయకుట్మలములు
రతనములఁ గూర్చి తివియు హారతులు గాఁగ
నపుడు వనలక్ష్మి నెనయు పీతాంబరుండు
క్రొత్త పెండ్లికుమారుని కొమరు దెలిపె. ౨౮౭

క॥ సప్తదశీఘనసార
వ్యాప్తతనుండగుచు నలుగు నలఁదినగతిచే
నాప్తులకుఁ దెలిపె యదుపతి
సప్తమమహిషీవివాహ సంభ్రమలీలల్. ౨౮౮

వ॥ అంత ౨౮౯

క॥ ఈలీల నచట బాళిం
గేళీసమానలీలఁ గీలించి శర
న్నాళీకాక్షుఁడు మఱియు వ
నాళీపాళీవిలోకనాదృతి నుండెన్. ౨౯౦

### కందద్వయగర్భితచంపకమాలికావృత్త శేషబంధచిత్రము

అతివిమలా యనంతసుకరా కమనీయ యశోవిహారక
ల్పితసుమహారరీతిక నవీనమిలజ్జయతావధాని నం
ద్యతరవిభాతమాతత సదాసవవద్వరధామ జాలసం
గతనవనాయ జాతవరగౌరవరక్షిత సోమభూవరా ! ౨౬౧

### గర్భగత ప్రథమకందము

విమలా యనంతసుకరా
కమనీయయశోవిహార కల్పితసుమహా
సుమహారరీతికనవీ
నమిలజ్జయతావధాని నంద్యతరవిభా ! ౨౬౨

### ద్వితీయకందము

రవిభాతమాతతనదా
సవవద్వరధామజాల సంగతనవనా
నవనాయజాత వరగౌ
రవరక్షితసోమభూవరా యతివిమలా ! ౨౬౩

### ఆశ్వాసపూర్ణ నియతశైలబంధ చిత్రకందము

శ్రీశా గరుడాంచద్వా
హా ! శివసఖ ! లలితశీలి ! యాదృతకేళీ
దాశరథీ ! కనకరశన ! ద
యాశరధి శ్రితాంబుజభవ యంచితవిభవా ! ౨౬౪

పుష్పగుచ్ఛ బంధచిత్ర పంచచామరవృత్తము

నరాదరా ! సురవనా ! సనాతనా ! ఘనాకృతీ
వరావరా ! కరాహృతాశ్రితపాదపా! కృపామతీ
ధరామరాత్మరాజితా ! సదాప్రదా ! చిదాదృతీ
స్మరాభిరామ ! రాధికాసమాగమా ! రమాపతీ ౨౬౫

గద్య॥ ఇది శ్రీమదుభయకవితా నిస్సహాయది
సాహితీవిహార కాణాదాన్వయ తిమ్మనార్య
కుమార వినయగుణధుర్య పెద్దనార్య
ప్రణీతంబైన భద్రాపరిణయోల్లా
సంబగు ముకుందవిలాసంబను
మహాప్రబంధంబునందు
ప్రథమాశ్వాసము
సమాప్తము.

—o—

# ముకుందవిలాసము

## ద్వితీయాశ్వాసము

కం॥ శ్రీముష్టిపల్లిసోమ
క్ష్మామండలనాథ హృదయసారసవర్తీ
శ్రీమయగద్వాలపుర
క్షేమంకరకీర్తి చెన్నకేశవమూర్తీ !

గీ॥ అవధరింపుము హరికథాశ్రవణవిభవ
లోలుఁడగునట్టి జనకభూపాలునకును
శ్రీహరిస్తవనామృత శ్రీవిశేష
హితరచనయోగి శుకయోగి యిట్టులనియె.

కం॥ ఈ చందంబున నవ్వన
వైచిత్రిం గనుచు యాదవప్రభు వొకచో
లోచనచకోరసమ్మద
సూచనమగు నిందుకాంతసుందరవేదిన్.

చ॥ సుకృతరసోదయాధిగతసుస్థిర దివ్యఫలాతివేలమున్
సుకరమరుత్కిశోరపరిశోభితకేళి సుధాలవాలముం
బ్రకటితభూరిశైలవన భాసితశీలమునై విశాలమౌ
నొక సురసాలముం గని యదూత్తముఁ డత్తరురాజశాఖికన్.

సీ॥ అపరంజి మెఱుఁగుటందపు ముఖద్యుతినంచు
జలజరాగచ్ఛాయ నెలవు సేయఁ
గలికి చిన్నారి చొక్కపురెక్కల బెడంగు
మరకతాళిచ్ఛాయ నెఱుక సే
నాకంఠహృదయ పర్యంత కాంతిచ్ఛటల్
పుష్యరాగచ్ఛాయపొందు సేయ
నలుదిక్కులీక్షించి నయనమరీచికల్
శక్రనీలచ్ఛాయ చనువు సేయ
దివ్యమణిమయమోయనాఁ దేజరిల్లు
సుందరస్ఫూర్తి గనుగొన్నఁ జూచువార
లౌననంగ జగన్మోహనాంగమైన
యొక్క రాచిల్కఁ గనియె దామోదరుండు. ౫

ఉ॥ కాంచి వ్రజాంగనాహృదయ గౌరవచౌర్యధురీణమౌ కటా
క్షాంచలపాళి జాలిఁబడి యా శుకలోకశిఖామణిన్ విమ
ర్శించి యపూర్వవిస్మయవిశేషము చిత్తమునందు సంభ్రమో
దంచితమై పెనంగ హరి దాని విలాసమునెంచి యిట్లనున్. ౬

కం॥ ఇది యెయ్యదియో దీనికి
సదనం బెయ్యదియొ దీని జననస్థలమె
య్యదియో హృదయోత్సవగతి
నిది వింతకు వింత యగుచు నింపు ఘటించెన్. ౭

కం॥ ఎన్నడు రామో పోమో
యిన్నగవనరాజపాళికి కీరంబుం
గన్నారమె మున్నొకచో
విన్నారమె దీనివంటి విహగమునెందున్. ౮

సీ॥ రమణీయ మణిపంజరములతోఁ బౌలోమి
చెలువుఁ డిచ్చిన జాతిచిలుకలైన
ద్వీపాంతరములలోఁ దెప్పించి జలనిధీ
శ్వరుఁడు దెచ్చిన శుకోత్కరములైనఁ
గనకాంగదాది శృంగారంబులిడి రాజ
రాజు పంచిన కీరరాజియైన
మును విశ్వకర్మ తీవిని వినిర్మించిన
పురముచక్కరతిండిపులుగులైన

మఱియుఁ దగురాజులెందఱే మత్రిప్రియార్థ
మెలమి నొసఁగిన కలికిరాచిలుకలైన
నీ శుకముతోడ సరియౌనె యాశుకలిత
లలితవాచాలలీలావిలాసములను. ౯

కం॥ భారతి చేఁగల శుకమో
యా రతిచేఁగల శుకంబొ యన్యమునకుఁ దా
నీ రుచి యీ శుచి యీయుచి
తారచితవచోవిచిత్రితాకృతి గలదే ? ౧౦

వ॥ అదియునుంగాక ౧౧

సీ॥ వైకుంఠనగరోపవన నికుంజములలో
వేడ్క సల్పుచునుండు విహగమొక్కొ
సత్యలోకోద్యాన సంతానపంక్తిలోఁ
గ్రీడ సేయుచునుండు కీరమొక్కొ
కైలాసశైల సంగత వృక్షవాటిలో
నిలిచి వినోదించు చిలుక యొక్కొ

పాలావారాశిలోపలి తెల్లదీవిలో
సతతమామోదించు పతగమొక్కఁ
డేక భూలోకమునకల్ల లేఖశాఖి
విడిచి వచ్చి మదారామవిటపిసీమఁ
గానఁబడినట్టి యమరశుకంబొ కాక
మనుజఖగమాత్రమున కిట్టి మహిమ గలదె ! ౧౨

ఉ॥ మారుని ఘోటకంబగుట మాటికిఁ గూర్చి ఖలీనవై ఖరిం
బేరు శుకోన్నతిం దగుట బెంపుగఁ గాంచి సదాగమాంత స
త్కారము పక్షమల్ల హరితత్త్వము నందుట రామసంస్కృతిం
దారిచి కీర మీ సుముఖతాస్థితి మాకనురక్తిఁదెల్పెడిన్. ౧౩

గీ॥ అనుచుఁ బ్రీతి వొడమ నా విహంగమమున్న
చిన్ని మావిగుములు సేర నరిగి
వెసఁ దదీయవదన విగళిత ఫలరసం
బాని సొక్కి యిట్లు లనియెఁ జక్రి. ౧౪

కం॥ ఈ చిలుక ఫలముఖంబున
సూచింపంబోలు మనకు శోభనఫలలా
భాచరణమునని కరశా
ఖాచతురిమఁ బూని దానిఁ గైకొనువాఁడై ౧౫

సీ॥ ఘనదివ్యమంగళాంగము గానఁబడకుండఁ
బొదల మాటు నొకింత యొదిగి యొదిగి
చరణాంబుజయుగంబు చప్పుడు గాకుండఁ
బొంచి పొంచి యొకింత పోయి పోయి

యొరగా భుజపీఠిఁ జాఱు బంగరుశాటి
వలెవాటుగ నొకింత వైచి వైచి
యివురు లద్దము గాఁగ నింతంతటికి డాయ
సారె శ్రీహస్తంబు సాచి దాచి
కన్నుసన్నల నందఱఁ గదల నుంచి
మౌనముద్ర వహించి యంతైనఁ దొలఁగఁ
దివురునో యని దానిపై దృష్టిఁ బూన్చి
ప్రమదమునఁ గేరి కీరంబుఁ బట్టె శౌరి. ౧౬

కం॥ అదియును హరిఁ గనవచ్చిన
యది గావున జాతిచేష్ట కట్టిటు ఱెక్కల్
విదిలింపుచుఁ గొంత తడవు
బెదరినయట్లుండి నిలిచి ప్రీతాంతరమై. ౧౭

సీ॥ కరకల్పశాఖానుగత సుఖానుభవంబు
నెంతయేఁ జింతించుఁ గొంతతడవు
సొగసువిసాళివాల్జూపుఁదేనియసోనఁ
గ్రోలి యువ్విళులూరుఁ గొంతదడవు
చిలుకు తీయనిపల్కుచీని చక్కెరలాని
గ్రుక్కగ్రుక్కకు సొక్కుఁ గొంతతడవు
వదనచంద్రామృతాస్వాద ప్రసాదంబు
గూర్చి నివ్వెఱ నుండుఁ గొంతతడవు
కాంతదేహ ప్రభానంత గాహనమునఁ
గోర్కె లీదేరఁ గ్రీడించుఁ గొంతతడవు
దివ్యకీరంబు హరిగుణాధీనమగుచు
నాంతర నితాంత సంతృప్తి నంతనంత. ౧౮

ఉ॥ ఆ జలజాతసంభవునకైనఁ గనుంగొనఁగాని యమ్మహా
తేజుని మూర్తి గాంచియుఁ దదీయసమాదృతి నంది తత్కరాం
భోజమునన్ వసించె హరి పూర్ణదయారస దృష్టిఁజూడఁగా
రాజశుకంబు తత్కృతపురాతన భాగ్యమహత్త్వ మెట్టిదో! ౧౯

వ॥ అంత నక్రూరపురందరంబు గోవిందకరారవిందంబునం జెంది సనంద నాదులకు నందరాని పరమానందంబునుం బొంది తదీయ స్వరూప దర్శనదివ్య సుఖావేశంబునం బరవశంబగు నెమ్మనంబు నెట్టకేలకుం గ్రమ్మఱ మఱలించి యమ్మహానుభావునకు నిజానుభావంబుఁ దెలుపం దలచి యతండు వెఱఁగంద నమృతస్యందంబుగా శ్రవణభూషణంబు లగు మనుజభాషణంబుల నిట్లనియె. ౨౦

సీ॥ సనకాదియోగీంద్ర జనమనః కంజాత
కలితనిత్యధ్యాన కారణము
కలశాబ్ధికన్యకా కమనీయకుచకుంభ
కుంకుమపంకారుణాంకితములు
బ్రహ్మేంద్రముఖ్యగీర్వాణ కోటికిరీట
లలితరత్న ప్రభాలాంఛితములు
సముదగ్రకైవల్య సౌధాంతరాళవి
న్యాససౌఖ్యవిశేష భాసురములు
దివ్యలక్షణసౌందర్య దీపితములు
నైన భవదీయ శ్రీచరణారవింద
ములనుఁ గనుగొంటిఁ జిరపుణ్య మొలయఁ గంటి
భక్తరక్షణకృతదీక్ష! పంకజాక్ష! ౨౧

వ॥ అని మఱియు నక్రూరోత్తమంబు మదీయవృత్తాంతంబు విన నవధరింపు మని యిట్లనియె. ౨౨

సీ॥ అపునరావృత్తి నిత్యానంద కందమై
చను సితద్వీపంబు జననసీమ
యక్రాంత సత్యవ్రతాశ్రమస్థానమా
మేరుశృంగంబు విహారభూమి
సుకృతిగమ్యము విరించికులాంగనాపాణి
పంకజాతవరంబు టెంకిపట్టు
చిరజరామరణవర్జితమైన మందార
ఫలరసామృతధార పారణంబు
పంకజాక్షపితామహ శంకరాల
యాదికంబులు గమనయోగ్యస్థలములు
సహచరులు దివ్యమౌనులు సహజగోష్ఠి
హరికథావళి మాకు శ్రీకైకనాథ ! ౨౩

కం॥ ఏకదినంబ చతుర్దశ
లోకంబులు దిరిగి సత్యలోకము జేరం
బ్రాకుదు నాలోకింపని
లోకంబులు లేవు నాకు లోకాధీశా ! ౨౪

సీ॥ ఒకవేళ నుర్విపై నుండి చివ్వనఁ బ్రాఁకి
తారకాలోకంబుఁ జేరఁ జనుదు
నొకవేళ వాయుమార్గోపాత్తవృత్తినై
సూర్యచంద్రులజాడఁ జొచ్చి పోదు
నొకవేళఁ గాలచక్రోపరిస్థలినుండి
చక్రవాళముఁ జుట్టి సంచరింతు
నొకవేళ నవలీల నుదయశైల శిఖాగ్ర
ముననుండి యస్తాగమున వసింతు

నొక్కవేళల బ్రహ్మాదియోగ్యమైన
దివ్యలోక విశేషప్రదేశముల వి
హారములు సల్పి చయ్యన మేరుశిఖర
వాసినై యుందు నీయాన వాసుదేవ ! ౨౫

గీ॥ ఇది మదీయవిధము విదితంబుగా మీకు
విన్నవింపఁగంటి వినుము నాకు
దివ్యబోధలబ్ధి దేవ తావకమైన
మహిమ గొంత యెఱుకమాత్ర గలదు. ౨౬

తోటకము :- మదయుక్తుల నిమ్మహిమండలమున్
వదలింపఁగ యాదవవంశమునం
దుదయించిన విష్ణుఁడవో కమలా
హృదయేశ్వర శౌరి పరేశ హరి ! ౨౭

దశావతార కందములు

కం॥ తొలిమినుకుల నల దనుకులుఁ
దలుకనుఁ గొన వానిఁ దునిమి యవి సేర్చి విధిన్
వలగొను కృప నల మను నృప
తిలకున కుపదేశ మీవె తిమివై కృష్ణా ! ౨౮

కం॥ తామేటి దొరందరువన
దామేటి సుపర్వకోటి తద్గిరిభరముం
దామేటి కనుచుఁ బూనవె
దామేటివ యగుచు నూటి దైవకిరీటీ ! ౨౯

కం॥ నా కార్యాహృతిఁజేయఁగ
నా కార్యాదృతికి జగములన్నియుఁ బ్రీతిన్

సౌకర్యస్ఫూర్తి గనన్
సౌకర్యస్ఫూర్తి గనవె జగతి మురారీ ! ౩౦

కం॥ లోకావనమును దితిసుత
పాకావనమును ఘటించి పౌరుషగతినౌ
నీకేసరి చిత్రాకృతి
నీకేసరిశౌరి దనుజనికరవిదారీ ! ౩౧

కం॥ నాకజనీనైకధునీ
శ్రీకి జనిస్థానమైన శ్రీపదిమది ర
త్నాకరునకుఁ గూకుదముగ
వీఁకఁ దగంజేయవే త్రివిక్రమమూర్తీ ! ౩౨

కం॥ నిజశౌర్యానలరసనా
వ్రజతృప్తిఁ ద్రిశుద్ధి నెఱపు వై ఖరి సరిగా
భజియింపవె యాహవముల
ద్విజరాజాకృతిని భృగువతిస్థితి శ్రీశా ! ౩౩

కం॥ లోకవులనేర్చు రక్షో
లోకవులందునిమి మనుజలోకవులీలన్
నాకవులఁ బ్రోవవే ము
న్నాకవులం గూడి రాఘవాకృతిశార్ఙ్గీ ! ౩౪

కం॥ సీరమునను యమునానది
నీరమునను భేదపఱచి నిరతిశయతనూ
సారమున నసితవసనా
కారమునను వెలయు యదునికరకుశలకరా ! ౩౫

కం॥ ఆగమ ఖాగమతంబుల
నాగమతం బొలయ విలసదసురీచేత
స్వాగతహరణముఁ బూనవె
సౌగతత నుభరణమునను సర్వేశ హరీ ! ౩౬

కం॥ సాదివిహారత నిల హిం
సాదివిహారకులఁ దునుమనలరి గెలుచు నా
సాదివిదారి దిరుగుతర
సాదివిదారివి గదా గదారిదరాంకా ! ౩౭

వ॥ కావున ౩౮

సీ॥ శుభమైన విధి నుండు శ్రుతిహితస్థితి వీవ
క్షితిఁ బూను శ్రీకూర్మపతివి నీవ
జగతి నీడేర్చిన సౌకర్యగతి వీవ
యరుదైన పురుషసింహంబ వీవ
బలి దైన్యహృతికైన పటుతరాకృతి వీవ
గురుహితంబూన్చు ధైర్యరతి వీవ
హరిసూను నేలినయట్టి రాజవు నీవ
యదువంశమునఁ బుట్టినయ్య వీవ

యనఘ సర్వజ్ఞమూర్తి వౌ ఘనుఁడ వీవ
పరుషజనహారివగు ఖడ్గపాణి వీవ
నేఁడు వసుదేవునింట జన్మించినట్టి
కీర్తినిధి వీవ కంసారి కృష్ణ శౌరి ! ౩౯

గీ॥ స్వామి మీ దర్శనంబెట్లు సంఘటించు
ననుచు వచ్చితి నేఁ జేయునట్టి పూర్వ

భాగ్యవశమునఁ దనయంతఁ బ్రాప్త మయ్యె
సులభమున నాకు నిదె శుభసూచకంబు ౪౦

కం॥ ఏ నొక తిర్యగ్జంతువ
నైనను నాపయి దయారసామృత దృష్టిం
బూనితి కావున నీ కిదె
దీనావన యొక హితోపదేశ మొనర్తున్. ౪౧

గీ॥ అదియు నల్పమైన నధికంబ యైననుఁ
గృప వహించి చిత్తగింపవలయు
నఖిలలోకభర్తవైన నీకెందున
నుపకరింతు భక్తి యొకటె కాక ౪౨

వ॥ అని శుకవతంసంబు దనవచ్చిన ప్రయోజనంబుఁ బ్రశంసించునదియై కంసభేది కిట్లనియె. ౪౩

ఉ॥ శ్రీకృతసన్నివేశము పరీవహదిక్షుమతీనదీయురా
స్తోకసరోజహారచయశోభన భాగుపకంఠదేశముం
బ్రాకటనైజవస్తుగతి భాసితసర్వదిశావకాశమో
కేకయదేశ మింపెసఁగుఁగీర్తిఁ దదీయధరిత్రి నెంతయున్. ౪౪

సీ॥ శ్రీకరంబు రమావశీకరంబు శుభప్ర
జాకరంబనఁగఁ బెంపావహించి
సుందరంబు సువర్ణమందిరంబు శుభాద్రి
కందరంబనఁగఁ బ్రఖ్యాతి గాంచి
పావనంబు మహార్థభావనంబు జనాళి
జీవనంబనఁగఁ బ్రసిద్ధి మించి

భాసురంబు విశిష్టభూసురంబు హృతాబ్జి
నీసరంబనఁగ వన్నియ ఘటించి
వీఁక నతిలోకహృత పాకవిభవ పాక
నైకనృపలోకసుశ్రీకసౌకరీక
శాకలితనాక సమసంపదాకరంబు
కైకయపురంబు దనరు భోగైకపరము. ౪౫

కం॥ ఆ కేకయపురిఁ బుణ్య
శ్లోకయుతుఁడు సకలసుజనలోకనుతుఁడు సు
శ్రీకలితుఁడగుచు సుమతిం
గేకయపతి యలరు దృష్టకేతుఁ డనంగన్. ౪౬

గీ॥ ఆద్రు తేక్షుమాధుర్యమై యా నదియును
నతిశుభప్రశ్నగణితమై యా పురంబు
నభిహితశుభాంకభావ్యుఁడై యా విభుండు
నలరె నన్వర్థనామవిఖ్యాతి జగతి. ౪౭

గీ॥ ఆ నరేంద్రుఁడు దనకు సంతానమునకు
సాధనముగా రమాసమారాధనంబు
సేయుచుండునేవేళ నజేయుఁ డాతఁ
డీగతి ఘటింపుచు విశేషహితమనీషా ! ౪౮

కం॥ పద్మనిలయ నిజచేతః
పద్మనిలయ గాఁగఁ దలఁచి పద్మనయనుతో
సద్మమునం దొక కాంచన
పద్మమునం జేసి యునిచి భక్తిస్ఫూర్తిన్. ౪౯

కం॥ లక్ష్మీహృదయాదికముల
లక్ష్మీధవహృదయపుటితలలిత జపార్చల్

లక్ష్మీసతికినిఁ ద్రిజగ
ల్లక్ష్మీవసతికి నొనర్చు లక్షణములచేన్. ౨౦

సీ॥ హరివత్సరతికి ధ్యానావాహనంబులు
పీఠంబు హేమాబ్జపీఠగతకుఁ
బాద్యార్ఘ్యములు తీర్థపాదుని దేవికి
స్నానంబు క్షీరాబ్ధిసంభవకును
అంబరంబాద్య విద్యాడంబరకు దివ్య
మంగళాకారకు మండనములు
గంధధూపములు సుగంధికి సురభికి
దీపంబు విజ్ఞానదీపకళకు

నఖిలభోక్త్రికి మృష్టాన్న మాచమనము
నమృతకరకునుఁ దాంబూల మా సుపర్ణ
గమనకుశలకు నీరాజనములు దైన్య
తిమిరహృతికిఁ బ్రద్మకు మంత్రసుమము లొసఁగి. ౨౧

సంస్కృతవిభక్తికందము

కమలాయై నిలయీకృత
కమలాయై కరగృహీతకమలాయై తే
విమలాయై చ నమో నత
విమలాయై సవిభవేనవిభవే యనుచున్. ౨౨

కం॥ ఆ జననికి రాజు నిటులఁ
బూజనములు సోపచారములు విప్రయుగీ
భోజనములు తత్కరుణా
భాజనములు గాఁగ నిడు సభాజన మెన్నన్. ౨౩

కం॥ ఈ రీతి నాతఁడా హరి
నారీతిలకంబు గూర్చి నయభక్తిసుధా
ధారాధనార్పణముల స
దారాధనఁ జేయ మెచ్చి యంతఁ దనంతన్. ౨౪

గీ॥ ఒక శుభదినంబునందు నా సుకృతనిధికి
జలజవాసిని కరుణ సాక్షాత్కరించి
యొక కుమారుని సద్గుణయుతు నిజాంశ
నుదితయగునట్టి యొక కూఁతు నొసఁగి చనిన. ౨౫

కం॥ శ్రీవిభునిదేవి దయ వసు
దేవునిసోదరి నృపాలుదేవి దగియె గ
ర్భావేశవశత శశిగ
ర్భావేశత నెనఁగు నుదయయగు దిశ యనఁగన్. ౨౬

వ॥ అంత ౨౭

కం॥ శ్రుతకీర్తిపేరఁ దగు వి
శ్రుతకీర్తి తదీయమహిషి శుభలగ్నమునన్
వితతనయు నొక్క తనయున్
గుతనువిలాసయుత నొక్క సుతనుం గనియెన్. ౨౮

గీ॥ అపుడు ద్విరాజకృతశుభమైన వసతి
భూరిమతి బొల్చె గురుకవిబుధులరీతి
తోన లోకేంద్రహిత సముత్తుంగగతులు
దారిచె నను గ్రహాస్థితి తదుదయమున. ౨౯

కం॥ సుముఖత శుభవీక్షణతం
గమలకుముద విహితగతివికాసము లెసఁగన్

రమణి కపుడు కనుతారక
లమరెం గోరుగతి సంపదనుగతి నంతన్. ౬౦

గీ॥ ఆ కుమారుని సంతర్దనాఖ్యుఁ జేసి
యా రమాంశను గన్న కుమారికను
భద్రగుణలక్షణములు సూపట్టుకతన
భద్ర యను నామమొసఁగె భూపాలమౌళి. ౬౧

వ॥ అయ్యెడ నియ్యెడకు మదీయాగమనవిధంబు వివరించెద నవధ
రింపుము. ౬౨

ఉ॥ ఆ సమయంబునందొక శుభావసరంబున వాణి వైనతే
యాసనురాణి యున్నయెడ కంచినచో నను నా సరోరుహా
ధ్యాసినిఁ జూచి కీరమ ! మదంశనుఁ గేకయరాజపుత్రియై
భాసురగాత్రి యొక్కతె విభాసిలు నాసతి యున్నధాత్రికిన్. ౬౩

వ॥ నీవునుంజని యక్కీరవాణిం దత్తత్కాలోపదేశంబులం బ్రవీణం
గావింపుమనిన మహాప్రసాదంబని తదీయప్రాసాదంబు గదలి మదీయ
స్వామినియగు కమలభవభామిని యనుజ్ఞఁ బడసి యెడసేయక నాక
లోకనికాశంబగు కేకయనగరనివేశంబుఁ బ్రవేశించి సుమనస్సమాదర
ణీయ గుణారాముఁడగు నా రాజలలాము నొక్క విప్రవర ముఖంబునం
గనిపించుకొని తత్సంతానంబగు నక్కుమారి కావతంసంబునకు నుచిత
ప్రశంస లొనరింపుచుంటి నయ్యవసరంబున. ౬౪

కం॥ కానక కన్న కుమారిక
గానం బై నా రమాంశఁ గనినకతన న
మ్మానిని తలిదండ్రులు దయఁ
బూని దినము వింతవింత ప్రోది యొనర్పన్. ౬౫

శా॥ జోలల్ వాడుదు నేను సొంపు గన నించుంబోటికిన్ డోలికాం
దోళక్రీడ ఘటింతు వింతలను బ్రొద్దుల్ బుత్తు నాడింతుఁ గేల్
గేలంబూని యొకింత చిన్నినడకం గీలింతు నత్తత్త నాఁ
జాలంజేయుదు ముద్దుమాటల సుధాస్యందంబుగా బాలికన్.

సీ॥ శ్రుతకీర్తిసుత గాన సుదతులు పాడేటి
తనమీది పాటలు వినఁగడంగు
దృష్టకేతుని కుమారిక గాన దృక్పాళి
కేళికావృతుల నీక్షింపఁదొడఁగు
భద్రాఖ్యయగుఁ గాన బాలికాతతితోడ
సమముగా మందయానములు నెఱపు
నిందిరాంశజ గాన యందంద సుకృతశో
లనులఁ గటాక్షించి చనఁదలంచు
నయపదోన్నతిఁ గేకయాన్వయజ గాన
సర్వముఖ్యాప్తగణవిశేషప్రసక్తి
నెలఁగ బహువచనస్ఫూర్తిఁ బలుకఁ దివురు
ప్రథమశైశవవేళ నబ్బాల కృష్ణ ।

గీ॥ నాటఁ బెంచెటిదాని నేపూటఁ బెంచి
తల్లిదండ్రులు పోషింపఁ దత్కుమారి
యఖిలజనమున కానంద మావహిల్లఁ
బ్రీతి నల్లారుముద్దుగాఁ బెరుగుచుండ.

కం॥ ఒసపరి మొలకై తళుకై
పసిమొగ్గై నిగ్గు బొదమి బటువై యటపై
రససౌరభములు గననగు
కుసుమమువలెఁ దోచె నపుడు కోమలి కృష్ణా ।

చ॥ ఒనరుముఖంబునన్ శశిసహోదరభావము దెల్పఁ బాణులన్
వనరుహలక్ష్మిఁ దెల్పఁ జెలువంపు వచోరచనన్ సుధానువ
ర్తన జననంబుఁ దెల్పఁ గని తద్రమణీమణి యిందిరాంశ జే
యని మది నిశ్చయించితి సుమా కుసుమాయుధజన్మకారణా. ౨౦

వ॥ అంత నయ్యింతి ప్రతిదినప్రవర్ధమానయై ౨౧

సీ॥ తిలకించి తల్లిదండ్రుల నేమి సూచనో
తలయెత్తి చూడదన్యుల నెవరిని
భ్రాతతోనైన మేరకు మేరయే కాని
లాలించినా పెక్కు పేలదెపుడు
ఋంఘలఁగన్న మున్పడఁ బ్రియోక్తియ కాని
తమకైన కలిమి గర్వమనలేదు
చెలి తోడరాకున్న నిలిచి పిల్చుచె కాని
మఱచైనఁ బల్లంతమాట యనదు

నవ్వు నాతోడనైన మందస్మితంబె
కాని ప్రహసించు టేవేళనైనఁ గాన
నాటప్రాయంబునాఁడె యయ్యంబుజాక్షి
తద్గుణంబులు వర్ణింపఁ దరమె కృష్ణ ! ౨౨

కం॥ ఈ లీల సకలగుణముల
పాలికయగు నా తృతీయవరదినశశిబిం
బాశిక బాలిక కేశిం
బాశికలిమి కెదుగఁదగిన ప్రాయం బనుచున్. ౨౩

గీ॥ ఏను తిర్యక్కులీన విద్యానిరూఢ
నగుట శుద్ధాంతమున కేగ నర్హ మనుచు

సకలవిద్యలఁ బ్రౌఢగాఁ జలుపు మనుచు
నప్పుడఁతితండ్రి తనయ నా కప్పగింప. ౨౪

శా॥ తూచా తప్పక యుండ నేర్పితిని హిందోళాదిరాగావళీ
వైచిత్ర్యంబును నాట్యకౌశలముఁ గావ్యప్రౌఢియున్ నాటక
ప్రాచుర్యంబు నలంకృతిప్రతిభ శబ్దజ్ఞానముం దర్కవి
ద్యాచాతుర్యము సత్కవిత్వరచనాధౌరంధరీరేఖయున్. ౨౫

కం॥ ఈ విధిని వయోవిద్యా
భావంబులు రా విలాసభావంబులు సం
భావింపఁగ భావంబున
భావజకళ యనఁదనర్చె భామిని యంతన్. ౨౬

సీ॥ ఇనుఁడు వచ్చునటన్న మునుమున్న కుముదంబు
గా నుండు కనుదోయి కమలమయ్యెఁ
బ్రాణనాథస్పర్శ యన గ్రహింపని వీను
లాగుణశ్రుతిహితశ్రీ గణించె
సత్ప్రియుండని యన్న చట్టుఁబావలె నుండు
కలికిడెందము చంద్రకాంతమయ్యె
వరజాతి యన్న నివ్వెఱ లజ్జఁగను భావ
మట సుమనస్స్ఫూర్తి నతిశయించెఁ
బురుషసంగతి యన్నను పొన్నలరయుఁ
గన్నె పున్నాగయోగంబు గాఁగఁ దెలిసె
శైశవముఁ బాసి సుమశరావేశ మెనయు
మధ్యభావఁబునను వధూమణి రమేశ ! ౨౭

కం॥ మురభంజన హృదయాం
తరరంజన యగుచుఁ జిన్నఁదనముననే చూ

పలుకులకు పరిపరివిధముగ
నరుదొనరించంగఁ గంటి నా కలకంఠిన్. ౭౮

కం॥ సొగమెఱుంగు కనుంగవ
రాగలవంబులకుఁ బెంపు రాగల సొంపుం
బాఁగు గల మోవి బంగరుఁ
దీఁగె మిటారించు మేను తెలిపకుఁ బొల్చున్. ౭౯

కం॥ మధురసము మీఱు పలుకుల
మధురిమమును రుచిలవంబు మధుకరములకున్
మధుకరమిడు చికురములన్
మధురాధరయందె కలదు మధుమదమథనా! ౮౦

కం॥ చిరురాకు జిగిపరాకుం
దెగడుఁ గడున్ మృదువులైన తిన్ననిపదముల్
మగఱాల నగు సరాలన్
నగుఁబోతగఁబొల్చు నఖరనఖరమ చెలికిన్. ౮౧

కం॥ సరియెకద పిఱుఁదుబలువునఁ
దరుణినడక మందమగుట తరువాత మఱి
మఱి విఱ్ఱవీఁగు కుచకచ
భరమునఁ జెలి దాళియుంట ప్రౌఢిమమె కదా! ౮౨

గీ॥ అతివ మున్ను నాశిక్షచే నాక్షణమున
నతనుశాస్త్రానుభావాప్తి నధిగమించె
నిపుడు నిజభావదీక్షచే నీక్షణమున
నతనుశాస్త్రానుభావాప్తి నతిశయించె ౮౩

వ॥ అయ్యెడ ౧౪

సీ॥ కటితటుల్ గమనసంఘటిత చక్రములుగాఁ
దగు నూరుయుగళంబు నొగలు గాఁగ
లలితబాహులు ప్రవాళ స్తంభయుగముగాఁ
గంఠంబు విజయశంఖంబు గాఁగఁ
గలికిపాలిండ్లు చొక్కపుగుండుగిండ్లు గాఁ
బసిడిమైసిరి పట్టుపఱపుగాఁగ
నేత్రమీనములు వన్నెలటెక్కియములుగా
నెఱిగొప్ప నీలిచప్పరము గాఁగఁ

ప్రవచనశుకాశ్వములు ప్రేమపాశములును
కాటుక గుణంబు బొమవిల్లు కళుకుచూపు
తూపుగా నాత్మరథముగా నేపుఁజూపు
చెలువతనువున రథికుఁడై వెలసె మరుఁడు. ౧౫

కం॥ ఈరీతినిఁ దారుణ్య
శ్రీరమ్యతఁ జెట్టుగట్టి శృంగారఫల
స్వారస్యములం గనుపడె
నా రామ మదీయదృష్టి కామని యగుచున్. ౧౬

కం॥ ఆటలఁ బాటల సొగసుం
దేటల రూపవిభవమునఁ ద్రిభువనములలో
బోటులలోపల నీచెలి
బోఁటులు లేరనుచుఁ దోచెఁ బురుషవరేణ్యా ! ౧౭

వ॥ అదియునుంగాక ౧౧

సీ॥ నలు పెక్కు దట్టమై నెలకొను చికురముల్
వీడఁ గ్రొమ్ముడి కందరాకమున్న
యమృతంబుఁ జిల్కెడు నధరభాగమునకు
రాగవైఖరి కొంత రాకమున్న
కుదురేరుపడి పాడుకొను కుచాంకూరముల్
పోఁకలతో దీటురాకమున్న
దినదినమొకట వర్ధిలు నితంబమునకు
వ్రేకఁదనం బింత రాకమున్న

చూపులందునుఁ జారువచోనిరూఢిఁ
బ్రౌఢభావ మొకించుక రాకమున్న
చెలువచెలువంబు వచియింప నలవికాదు
నేఁడు వచియింప శక్యమౌనే ముకుంద! ౮౯

కం॥ ఐనను నా నేర్చినగతి
మానిని తగువృత్తరూపమహిమ వచింతుం
గాన విన నవధరింపుము
నేనిట్లా యువతిమైత్రి నెఱపఁగనంతన్. ౯౦

సీ॥ నెఱిమీఱు నధరశోణిమ ముక్కున నత్తు చొ
క్కపుము త్తెముల కెంపుకళ లొసంగె
నింపారు నయనపాండిమ తళుక్కనిచెక్కు
వ్రాత కస్తురికప్పురంబుఁ దెలిపె
భ్రమయు ముంగురుల నీలిమకుంకుమపురావి
రేకకస్తురిచుక్కరేక నెఱపె
రుచులీను కరతలారుణిమకేళీకిఁ బ్రదిప్ప
తెలిదమ్మి కెందమ్మి చెలువొసంగె

నౌర తనకాంతతనుకాంతి యా స్వకాంతి
కాంతరనిశాంతముల హాటకాంతరముల
నెంతయేఁ జేయు సిరికిది వింతయేమి
యనఁగ నింతికిఁ బ్రాయంపుటంద మొదవె. ౯౧

వ॥ అంత ౯౨

సీ॥ నవనవస్యందసుందర మందహాసంబు
నయనపాండిమతోడ నవ్వులాడఁ
బ్రకటమనోహరభ్రుకుటి కౌటిల్యంబు
నికటకటాక్షముల్ నేర్చుకొనఁగ
నరుణతారుచిమైత్రి నధరబింబమునకుఁ
గరపల్లవము వీటికల నొసంగ
నేకాశ్రయములొట నాకటీతటి సాటి
కుచవాటియును వృద్ధికోటి గాఁగ
ముంగురులరంగు చెలిమి మీఱంగ రంగ
దళిసమాపాంగ వీక్షాంగకళ లెసంగ
నంగనామణి కలరెఁ బూర్ణాధికార
యౌవనశ్రీవిహార మయ్యవసరమున. ౯౩

కం॥ ఆ కలికి సకలతనురే
ఖాకలన వచింపలేరెకా శేషుఁడు వా
ల్మీకియును శక్తులా లల
నాకచబంధము గభీరనాభి నుతింపన్. ౯౪

చం॥ అమృతరసంబులో మిసిమి యాఱని మీఁగడఁ దీసి దానిలో
సమముగ జాళువామెఱుఁగు సన్నరవల్ సమకూర్చి వెన్నెలం

గమిచి మెఱుంగునన్ మెడిచి కాంచనసూనపరాగపాళిఁజి
త్రమముగ మేళవించి యొనరింపఁగఁబోలు విధాత యా సనతిన్. ౯౫

చ॥ సుమముల కేను వోవుటలు చుల్కన యంచుఁ ద్విరేఫముల్ నగా
గ్రముల వ్రతస్థితిం గనుటఁ గాంతశిరోరుహ పంక్తియై ద్విరే
ఫములగుచున్ సుమాశ్రయవిధిం గనె నౌ ఘనశేఖరాదృతిం
దము భజియింపరారె మును దాము భజించినవారలందఱున్. ౯౬

కం॥ అడుగుల మీఱిన నిడుపుం
బిడౌజమణిమీఱునిగ్గు ప్రియసఖి సొగసున్
వెడసందిటఁ గ్రిక్కిఱిసెడు
కడు తఱుచుంగురుల సిరులు గలుగుం జెలికిన్. ౯౭

మ॥ అనువై నెన్నుదురొంటుగా పదునౌకండ్లై కన్బొమల్ జంటగా
ఘనతం బోల్పఁగ రెండు తొమ్ముదులునై కర్ణద్వయం బొప్పగా
గనపూర్ణస్థితి బర్వలీల నెసఁగంగా నింతయుంగూడ దా
దినసంఖ్యం దిలకింప నిండునెలగా దీపించు మోమింతికిన్ ౯౮

కం॥ అల విదియనాటి చంద్రుఁడు
నెలఁత నుదుటి కెనయె వారుణీసంగతిచేఁ
దలఁచినమాత్రనె దాకొ
మ్ములు వెళ్ళినవాడె మిన్నుముట్టిన హెచ్చే ! ౯౯

గీ॥ విదియచందురుఁ డతికృశాస్పదతనుండు
చవితిచంద్రుఁడు గడుదోషసంగతాత్ముఁ
డష్టమీశశి శ్రుతికయోగ్యవృత్తి
చెలియ ఫాలంబునకు దీటు సేయుటెట్లు. ౧౦౦

ఉ॥ పంకభవాప్తిమోడ్చెఁ దమిపద్మములున్ మఱియున్ సదారుణా
తంకమునంది కుందెఁ గుముదస్థితి నుత్పలముల్ గడున్విసా
రాంకములై సభంగగతి నవ్వలఁ జిక్కఁగసాగె మీనముల్
సాంకవగంధినేత్రముల సామ్యము నొందఁగలేమి వేమఱున్. ౧౦౧

గీ॥ బెళుకుఁదళుకులు గలుగుట బేడిసలగు
నినునిఁ గన వికసించుట వనజములగు
రెంటి సరసమార్గస్థితిఁ గంటదగుట
నతివ రాజీవలోచన యనుట మేలు ౧౦౨

గీ॥ విధి లిఖించి నవద్వయద్వీపభర్త
యీ లలనభర్త యని బాల ఫాలసీమ
నందుకై కురులాన్చె మర్మాప్తిననఁగ
శ్రవణనవరేఖ లిరుదెసనువిద కలరు. ౧౦౩

చ॥ తిలకుసుమంబు మంగళగతిన్ శుభగంధములందు నాసచేఁ
జిలుకలకొల్కి నాస యయి చెందె ననేక సుగంధ యుక్తిఁ బై
మలినతయుం దొలంగి యసమాన సువర్ణసమృద్ధి గాంచె ని
చ్చలు శుభావాసనాన్వితుల సంగతి సౌఖ్య మొసంగునే కదా! ౧౦౪

గీ॥ భువనజాతంబు గెలిచి యీ యువిదమోము
తన కెనగ వచ్చె నీదని కినిసి రెండు
భాగములఁ జేయ భీతిఁ దత్పూర్వ్వములనుఁ
గొలుచు నెలతునక లనఁగఁ జెక్కులు సెలంగు. ౧౦౫

సీ॥ అమృత మీఁదందమా యట రుచి సరివచ్చుఁ
గాని కాంతిని సరిగాక నిలిచెఁ
బగడ మీఁదందమా ప్రతిభచే సరివచ్చుఁ
గాని యారుచి సరిగాక నిలిచెఁ

గెంపు నీడందమా సొంపుచే సరివచ్చుఁ
గాని మెత్తన సరిగాక నిలిచె
బింబ మీడందమా దంబున సరివచ్చుఁ
గాని బుద్ధిని సరిగాక నిలిచె
ప్రుక్కిచను ద్రాక్షగడుపులు సెక్కుతేనె
చక్కెరయు ఖండమగుగంట్ల జిక్కు చెఱకు
నగునె తగుదీటు జిగిబిగిసొగసు మృదువు
మధురమునునైన యా చాన యధరమునకు. ౧౦౬

కం॥ మానిని వాతెరలతపై
నానిన పరిపక్వబింబమని శుకములు రా
నేను మదీయకులోక్తుల
వానికిఁ దెలియంగఁ జెప్పి వారింతు హరీ! ౧౦౭

కం॥ రదనంబులు ముత్తెపుఁ జ
క్కఁదనంబులతోడఁ జేయుఁ గదనమ్ములొగిన్
సుధనైనంగేరు విధుం
తుదవేణి మృదూక్తి సరణిఁదుద వేమాఱున్. ౧౦౮

చ॥ ప్రయతి నగాగ్రవాసతఁ దపఃస్థితి మీఱి రసాలసత్ఫలం
బయగతి నా లతాంగి చుబుకాకృతియై సుముఖాప్తి నంతటం
బ్రియకరయోగ్యవృత్తిఁ దలపింపుచు ముచ్చట లిచ్చె నెచ్చటం
బ్రియకరయోగ్యవృత్తిఁ దలపింపవె సత్సహకారసంపదల్. ౧౦౯

చ॥ అరయఁ బసిండికట్లు మొదలౌ బిరుదుల్ ఘటియించి దోర్యుగో
పరితలరమ్యపీఠి నిడి భవ్యసుగంధములందలంద నౌ
మరు విజయాంకశంఖమగు మానినికంఠము గాకయున్న చో
సురవకళల్ సువృత్తతయు శోభనరేఖలు గల్గియుండునే. ౧౧౦

కం॥ ఆ రామ విలాసకర
శ్రీరమ్యశుభాంగ మది హరిప్రియమగు నం
చారసి విధి పూన్చిన త
త్సారకుసుమమంజరులు గదా భుజలతికల్. ౧౧౧

సీ॥ ఘనవయఃస్ఫురణంబు గలిగియుండుటఁజేసి
జక్కవకవ కొంత సాటివచ్చుఁ
బ్రియపుణ్యఫలలీలఁ బెంపు మీఱుటఁజేసి
జంబీరములు కొంత సవతు వచ్చు
నతివ వక్షఃస్థితి నందమొందుటఁజేసి
వీణెకాయలు కొంత నీడువచ్చుఁ
గంచుకావరణసంగతులు గాంచుటఁజేసి
ద్రాక్షగుత్తులు కొంత ప్రతినవచ్చుఁ
గాక వృత్తిస్థితిని సరిగావు సిరుల
నెఱసి ప్రక్కల నొరసి క్రిక్కిఱిసి గిరుల
దొరసి మొగమునకెగసి సొంపరసి మెఱసి
తగిన మృగనేత్ర వక్షోజయుగమునకును ౧౧౨

కం॥ తరుణీతనురుచి పటముగ
హరినీలపుకేతుయష్టి నారుగ నాభీ
సరణి నిదె మరుఁడు లేకే
కరణినటం దుదలఁ దగు మకరలేఖనముల్ ౧౧౩

గీ॥ అర్ధమేర్పడ వళియు రోమాళినిడఁపుఁ
బడగరేఖాయుగళి హంసపాది వ్రాసె
లేని నడుమునకొక శంకగా నజుండు
జనము లెందున్నదో యని సంశయింప. ౧౧౪

క॥ చంచ్చంచల కాంచన
కాంచీసంఛన్నఘంటికాళద్గుణ
ప్రాంచితమై చంచలదృళ
కాంచీదేశంబు దగియె గగనంబనఁగన్. ౧౧౫

క॥ తనకన్న వెనుక వచ్చిన
వనితాకుచయుగము చక్రవైఖరి గాంచన్
విన నెన్నికగా నతిఖా
వనతనితంబమున చక్రవైఖరిఁ గాంచెన్. ౧౧౬

క॥ సరి రాక నడకు కరి గిరి
తరుణీసాయుజ్యకాంక్షఁ దపమొనరింపన్
శిరము కటిఁ గలసెఁ గలనెం
గరమూరున గమనమునవె గమనము గలసెన్. ౧౧౭

క॥ పిఱుఁదుందీవి జనించిన
యరఁటులుబో యూరుయుగళ మటఁ దన్మకుళ
స్ఫురణంగనుఁబో జంఘలు
వరవర్ణినికిన్ సువర్ణవరవర్ణినికన్. ౧౧౮

క॥ మఱి జానువులడుగులుగా
మరు నమ్ములపొదులు సుమ్మ మగువకుఁ బిక్కల్
చరణములాయోగంబున
నరయన్నాళీకసమత నందునె కాకన్. ౧౧౯

క॥ తమ్ములు లేఁజివురుల మొ
త్తమ్ములఁ జెలి నయనపాణితలములు దరమం
దమ్ములవేఁదఁ బదాబ్జా
తమ్ములు రాగరమగలవె తమలోఁ గొనియెన్. ౧౨౦

కం॥ చెలి నఖములు సితతారా
వళిసఖములు గాకయున్న వానింబలెనే
యిలఁ బుష్కరపదసంగతి
కలనన్ సత్కాంతి నొందఁగారణమేమో ! ౧౨౧

కం॥ ఈ మాడ్కి వెలయు లేమన్
వేమాఖులు గొలిచి యామె విభవ మజహరి
స్త్రీమణులకుఁ దెలుపఁజనుదు
వేమఖు నావేళ నొక్క వింత వినఁగదే ! ౧౨౨

సీ॥ ముఖవైఖరికి మోడె మొదలనే శశిరేఖ
యధరంపురుచికి లోనయ్యె సుధయు
నాసకు సరిరాక నలిగెఁదిలోత్తమ
లోచనద్యుతులకు లోగె హరిణి
హాసలీల భ్రమించె నభినవకౌముది
యసదయ్యెఁ గుచవృద్ధి కద్రికయును
ఊరుద్వయస్ఫూర్తి కొదిగి రంభ చలించె
నట గోరునకుఁ బోలదయ్యెఁ దార

యొర తనుకాంతికినిఁ దక్కువయ్యె హేమ
చిత్రరేఖలఁ గొదవయ్యెఁ జిత్రరేఖ
యేనొకట నాకమునకేగి యీ శుభాంగి
యంగరమలెన్న నప్సరలందు శౌరి ! ౧౨౩

కం॥ చిన్నారి చూడ్కి వేలుపుఁ
గన్నెల సొబగు నగు భోగికన్నెల నవ్వున్

మున్నారు తీరులిలఁగల
కన్నెల సరిబోల్పి సిగ్గుగాదే కృష్ణా ! ౧౨౪

ఉ॥ బేడిసమీలు ముద్దుకనుబెళ్కులు చెక్కులు తళ్కులద్దపు
న్నీడల నేలు గుబ్బగవనిగ్గు లనంగుని గుండు బంగరున్
మేడలఁబోలు నీ చెలువ మేదినిఁ గల్గిన చిన్నికన్నెరా
చేడెల మేలుబాల నుతిసేయఁగ నా తరమా రమాధవా ! ౧౨౫

సీ॥ కృష్ణప్రభావాప్తి కేశవేశంబున
విధువిలాసము ముఖావేశమునను
గమలోదరవికాసకలన నేత్రంబుల
మధుజిత్త్వ మధరబింబంబునందు
శంఖసుకరలీల సరసకంఠంబున
రుచిరాచ్యుతస్ఫూర్తి కుచసమృద్ధి
హరిభావసంపద యవలగ్నసీమనుఁ
గనదనంతారూఢి కటితటమునఁ

గాంచనాంశుకసౌభాగ్యగరిమ నెల్ల
నతులతను కాంతిఁ దెలిపె నీ యతివగాన
రూఢి నీ పేరునకు సమరూపముగను
దొరయ నిది సకలాంగవైఖరి మురారి. ౧౨౬

కం॥ ఈ యందంబీ చందం
బేయందునుఁ గానఁ గాన నీ యిందుముఖిన్
నీయందఁ జెందఁజేకొను
శ్రీయందనరాదు దీని చెలువము శ్రీశా ! ౧౨౭

వ॥ అదియునుంగాక ౧౨౮

చ॥ గళమున శంఖరేఖయు ముఖంబునఁ గన్నులఁ జేతులం బద
స్థలములఁ బద్మరేఖలును చారుకుచంబులఁ జక్రరేఖలుం
గలుగుట చిత్రవైఖరి దగంగఁ గనుంగొని యో శుభాంగ యీ
సులలితగాత్రి కెట్టి సరసుండగునో విభుఁడంచు నెంచుచున్. ౧౨౯

మ॥ వినుమో మాధవ తన్నుఁ దానెఱుఁగకావిర్భూత సంపూర్ణయౌ
వనగర్వోన్నతి గన్న మత్ప్రియసఖిన్ భద్రన్నిరీక్షించి నే
నమవందన్ ధరఁ గల్గు పట్టణములందం దున్విలోకింపుచున్
వినువీధిం దగునట్టి సుందరవరాన్వేషార్థినై వచ్చుచున్. ౧౩౦

కం॥ ఎల్లెడఁ బేర్కొను నగరమ
తల్లులలోఁ గలుగు రాజతనయులలోనం
దెల్ల సరిలేమి మదిఁ జిం
తిల్లుచు నొకచో రహస్యదేశము గాఁగన్. ౧౩౧

కం॥ ఆకడ నేనొక యుద్యా
నాకరమున నూహ సేయునటఁ గనకసుమ
శ్రీకాంతాలోకమునా
శ్రీకాంతాలోక మెఱుకజేసిన దానన్. ౧౩౨

కం॥ శ్రీరమణి మదంశజ యని
యా రమణిన్ మున్ను చెప్పినది మదిఁ దోఁపన్
మీరున్నకతన నే నీ
ద్వారకమార్గంబు బట్టి వచ్చి రమేశా ! ౧౩౩

కం॥ ఈ రైవతకాద్రిపయిం
జేరి మిముం గంటిఁ గార్యసిద్ధియుఁ గనఁజే

కూరెను మీవలన బుధా
ధార ! సుధాధారవంటి దయ నేఁ గంటిన్. ౧౩౪

కం॥ మీ రేఖాసౌభాగ్యము
మీరేకాసురలకైన మేదిని లేదే
మీరేకాని మఱెవ్వరు
మా రాకాబ్జముఖి తుల్యమారాకొమరుల్. ౧౩౫

వ॥ దేవా ! యింతయుం జెప్పవలసి చెప్పితింగాని యింక నొక్క విన్న
పంబు గల దవధరింపుము. ౧౩౬

కం॥ జనకుఁడు భువిఁగల ప్రాయపు
జనపతులం బటములందు సవరిచి యనుగుం
దనయకడ కనుప నితరము
గననొల్లదు నీ పటంబె కాని మురారీ ! ౧౩౭

చం॥ విను మొకవింత తండ్రికడ వేడుక వందిజనంబులెల్ల రా
జనుతు లొనర్పఁగా విన నసహ్యపడుస్ భవదీయసన్నుతుల్
వినినఁ గను న్వికాసరమ వేమఱు నా కమలాక్షి యక్షిరం
జనత ముఖాబ్జమొప్పఁ గుచచక్రములుబ్బ నినాన్వితస్థితిన్. ౧౩౮

గీ॥ ఏను ప్రొద్దుపోక కెల్లరాజతనూజ
కథలు కృతులొనర్చి గానసరణిఁ
బాడుచుండు నన్నుఁ బ్రార్థించు హరిచరి
త్రంబె పాడుమనుచు నంబుజాక్షి. ౧౩౯

కం॥ మీ చిత్రపటముతో సరి
దోచఁగ నద్దమిడి చూడఁదోచెఁ దన తనూ

వైచిత్రి మీకు సరిగాఁ
జూచుకొనెడి దాఁదిభువనసుందరి శౌరీ! ౧౪౦

వ॥ ఇవ్విధంబున ౧౪౧

కం॥ యుక్తులనన్నిట మీ యను
రక్తియొ తేటపడఁ జూచి రాజాననకున్
భక్తియొ మీపైఁ దమి నా
సక్తియొ యని నేను మది విచారంబొదవన్. ౧౪౨

కం॥ ఆ సూక్ష్మము దెలియుటకై
యా సతి మదిఁ గ్రుచ్చి క్రుచ్చి యడిగి రహస్యా
వాసంబున మీయందుల
నాసఁ గలుగుమాట గొంత యరసితి నీశా! ౧౪౩

సీ॥ ఉస్సని మదిలోన నుడుకుతాపాగ్నిచే
నొకకొంత వేడినిట్టూర్పుఁ బుచ్చు
నెలకొన్న కూర్మి మున్నీరుబ్బి పొంగారు
చెలువున సాత్త్వికస్వేద మూన్చు
మీ గుణామృతరుచిమీఁది చింతనఁజేసి
యఖిలపదార్థంబు లరుచిఁబూను
విరహంబు పేరిటి వేదురు పైకొన్న
నొకట నుండినచోట నుండకుండు

హృదయగోప్యార్థ మొకరి యధీనమైన
బైలుపుచ్చక లోఁగొన్న జాలి మాలి
జాగ్రతయ కాని నిద్దుర జాలియుండు
మిమ్ముఁ జింతించునప్పు డమ్మేలుఁత శౌరి. ౧౪౪

చ॥ విలిచిన నేమి వల్కదటచేర్చితటాన మిటారిక త్రియల్
నిలిచినఁ గూర్మిఁ జిల్క దగణేయమణీమయ భూషణాదులం
దలచిన (ప్రీతిఁ గుల్కదట దాన సదా నలినాక్షి మీపయిన్
వలచిన ప్రేమ దొల్క మరువంచనకల్క మరుల్గొనన్ హరీ! ౧౪౫

సీ॥ పనివారిపై నల్గి పజ్జ గొజ్జగినీట
మజ్జనంబాడదు మంజుచర్య
తను వంటవలదని తత్తజ్ఞులఁ బంచి
గుజ్జనల్ గూర్పదు కుంభిగమన
తగుననగాదని తలిరుబోణి లొసంగు
సుమముల నందదు శుభలతాంగి
యొకరీతి కినుకచే సకులపై ముడిబెట్టి
బొమ్మలాడించ దంభోజనయన
నిచ్చ చలువలు గోరదు నెఱివిరాళి
నిచ్చ చలువలు గోరు నమ్మచ్చెకంటి
సాపరాధీనగతినెంచు జగతి చెలుల
నీ పరాధీనయగునట్టి నెలఁత దేవ. ౧౪౬

కం॥ పాటలు నేర్పదు తేఁటుల
కాటలు గూర్పదఁట రాజహంసకు నలుగుం
బోటులఁ దేర్పదు పలుకుం
దేటలఁ జేర్ప దల శుకతతిన్ సతి సామీ। ౧౪౭

వ॥ మఱియును ౧౪౮

సీ॥ చెలువైన కీచకమ్ముల రవమ్ములు విన్న
మురళీస్వన మటంచు మోహముంచుఁ

దీఁగెయెమ్ముల నెమ్మిసోగ లింమకఁ గన్న
మౌళిపింఛ మటంచు మమతఁ బెంచు
సరసులఁ గమ్మ తమ్మిరజమ్ము తెరలున్న
స్వర్ణాంబర మటంచు సంభ్రమించుఁ
బలువింత చిఱుతమొగ్గలు చాలుకొనియున్న
వనమాలిక లటంచు వలపు నించు
మిమ్ము వినియుంట మీ స్వరూపమ్మె యనుచుఁ
గదియఁజనుఁ గానిచో వేఱె కప్పిపుచ్చుఁ
దలఁచుఁ దపియించుఁ జెలులతోఁ దాను నేను
వనవిహారం బొనర్చుచో వనిత కృష్ణ ! ౧౪౯

గీ॥ ఎవ్వరెఱుఁగనికతన నీ యిందువదన
కెన్నడును లేని యీ తాపమేలఁ గలిగె
ననుచుఁ జింతింప నా కాంతలటకుమున్న
కొమ్మ విధమంత నే నెఱుంగుదునె కాన ! ౧౫౦

కం॥ ఏమమ్మా మేమిట లే
మమ్మా చెప్పరానిదీమర్మమనే
నేమమ్మా పెఱవారల
మేమమ్మా మాకుఁ జెప్పవే మాయమ్మా ! ౧౫౧

కం॥ తగదమ్మా యిది యొక విం
త గదమ్మా నీవిటుండఁ దగనివిధమునన్
మృగరాజమధ్య నినుఁ గని
నగరా నగరాంతరమున నగరాజకుచల్. ౧౫౨

వ॥ అని యేకాంతంబునం బుజ్జగించినం జంచలాక్షి నిలువరించలేక నాకుం దన వాంఛితంబు వచియించునదియై యిట్లనియె. ౧౫౩

సీ॥ సురమణీహితలీల సురమణీహితలీల
వలఁపుఁదీవిని మోవి దెలుపుననుచు
ఘనకళాతిశయంబు ఘనకళాతిశయంబు
తనుభాతి ననుభూతి ననుపు ననుచు
భావభవస్ఫూర్తి భావభవస్ఫూర్తి
సొంపుననింపునఁ బెంపు ననుచు
సొగసుఁజూపున యాప్తి సొగసుఁజూపునయాప్తి
చెలువున నలువున మెలవుననుచుఁ
దమ్మిగుణ మోము మోము నదళులు నళులు
ననఁగ హాసంబు మీసంబుఁ బెనుచు ననుచు
మధురిపువిలాసములు సుధామధురిమముగ
విందు నేనెందు వీనులవిందుగాఁగ. ౧౩౪

గీ॥ ద్వారవతినుండి మా తలిదండ్రి కడకు
వచ్చువారలవలన శ్రీవరుని చెలువుఁ
బిన్నతనముననే నేను విన్నకతన
నాటియున్నది మదిలోన నాఁటనుండి. ౧౩౫

చం॥ పలికినఁ జాలు వీనులకుఁ బండువుగాఁగఁ గటాక్షలేశముల్
చిలికినఁజాలువానిదమిఁ జిప్పిలుఁ గూరిమిలోన నించుకం
దొలికినఁజాలు సౌఖ్యరసతోయధిఁ దేలుదు నంచు నెంచు నా
కలికి నిజాలుగా మఱియుఁ గామిని స్వామి నినున్ గణించుచున్. ౧౩౬

కం॥ నా కలలో వచ్చినగతి
నాకన్నులఁ గట్టినటుల నాటిన మదిలో
నాకుఁ బ్రియుం డతఁడే యని
శ్రీకృష్ణునియందు నాదు చిత్తము నిలిచెన్. ౧౩౭

సీ॥ ఏ దివ్యతరమూర్తి నీక్షింప వాంఛాప్తి
చూడ్కి సాఫల్యంపు సొంపు నింపు
నే దయాంబుధి గుణామృతకణాంశము గ్రోల
నెలమి వీనులు నిత్యతృప్తి నెసఁగు
నే ఘను సరససత్కృతి నందఁజాలిన
స్థిరమహాతాపశాంతిని ఘటించు
నే దేవవరుకల్కి నెనయు పుణ్యముగన్నఁ
జిరవైభవస్ఫూర్తిఁ జెందఁ దనరు

నే పురుషవర్యు తనుయోగ మించుకేనిఁ
దలఁపఁ బురుషాంతర భ్రాంతిఁ గలుగనీయ
దట్టి శౌరిదివ్యలీల నా యంతరంగ
పరమఖేలనమునకు నాస్పదము గాదె. ౧౫౦

గీ॥ అనుచుఁ జెప్పి కీరమా యారమాధీశుఁ
జేరి విన్నపంబు సేయు మనియె
మఱియు స్వామితోడ నెఱిఁ దన మాటగా
నామె యన్న మాట లవియు వినుము. ౧౫౧

సీ॥ మందారకుందారవిందారత మిళింద
బృందంబు సనునె కోరెందపొదకు
నా మానసామాన సీమానటదనూన
మానసౌకము వోనె వానపడకు
సహకారసహకార బహువారసుఖవార
కీరంబు గనునె దుత్తూరవిహృతి
నూతనద్యోతజీమూతనీతజలత
చాతకం బేగునే నూతికడకు

దేవ తావకసౌందర్యదివ్యమంగ
ళాంగశృంగారసార సుధాంబురాశి
నలముకొనియున్న నాదు చేతోంబుజాత
మిచ్ఛయించునె మఱి యన్య మిందిరేశ ! ౧౬౦

గీ॥ అతనుతాపానలజ్వాల నలము నన్నుఁ
జేరి శౌరిదయామృత సేచనమున
నలరఁ జేకొని మీ చరణాంబుజాత
కింకరీభావ మొసఁగి రక్షింపఁగదవె ! ౧౬౧

కం॥ అని మీతో నను మని యో
వనజాతోదర స్వకీయవాక్యముగ మఱిం
దన చేతోగతి వలపుల్
గన నాతో నిట్టులనియెఁ గామిని ప్రేమన్. ౧౬౨

కం॥ రమ్మనుమా తనకే భా
రమ్మనుమా మరుఁడు చెడుగరమ్మనుమా దూ
ర మ్మనుమానింపక పా
రమ్మనుమా విరహ మాదరమ్మున శౌరిన్. ౧౬౩

కం॥ మ్రొక్కితి నసుమా చక్రికిఁ
దక్కితి ననుమా తలంచి తన గుణములకున్
సొక్కితి ననుమా వలపులఁ
జిక్కితి ననుమా యటంచుఁజెప్పె వ్వినుమా. ౧౬౪

కం॥ నీ పదములె వినఁదలఁచున్
నీపదమున నుండఁదలఁచు నెలఁతగల తమిన్

నీ పదములె కనఁదలచున్
నీ పదపద్మముల యాన నీరజనయనా ! ౧౬౫

వ॥ కావున ౧౬౬

క॥ శ్రీకల్యాణోత్సవమున
మాకుఁ బ్రమోదం బిగుర్ప మాధవ ప్రీతిం
గై కొనుమా లతకూనన్
నీకా ప్రాయంపుటామనిం గ్రీడ దగున్. ౧౬౭

క॥ ఆ హరిణాక్షికి విద్యల్
సాహిత్యము గలుగఁ దెలుపఁ జాలనయితి నే
నోహరి నేటికి సద్య
స్సాహిత్యము గలుగ నీదు సంగతివలనన్. ౧౬౮

గీ॥ నేను సాంగశాస్త్రనిపుణగాఁ జేసియు
బాలమౌగ్ధ్య ముడుపఁజాలనైతి
నీ వనంగశాస్త్రనియతిని రతినైనఁ
జేరి శౌరి ప్రౌఢఁ జేయగలవు. ౧౬౯

చ॥ లలితముఖేందువుం గుచవిలాసనగం బధరామృతంబునుం
గళశుభశంఖమున్ విహితకైశ్యపయోదము నాభిసంభ్రమం
బలరుఁ బిఱుందుదీవియుఁ గరాంఘ్రిమహాంబుజమైన కామినీ
కలితవయస్సుధాంబునిధిఁ గల్గు విహారమొనర్పఁగా హరీ ! ౧౭౦

క॥ తరుణీలావణ్యాంబుధి
వళులు వళీవీచిరోమవల్లీఫణిపై
మఱి నీవు పవ్వళించిన
హరి తొల్లిటి భోగిశాయి వౌదువు సుమ్మీ ! ౧౭౧

సీ॥ ఆ గుణవతినిఁ జేనందఁగూర్చితివేని
నీ రమ్యగుణమణుల్ బేరుగాంచు
నా రామ మదిఁ బ్రేమ నలవరించితివేని
నీ యశోలతికలు నెఱయఁగలుగు
నా హంసగమనఁ గ్రీడార్థ్వఁ జేసితివేని
నీ మానసము రసోన్నిద్రమగును
నా రమాంశజ నొంది యతిశయించితివేని
నీ మహాభాగ్యంబు నింపు నింపుఁ

గాన సంపూర్ణసౌందర్యమానితార్థ
మదన సామ్రాజ్యసర్వస్వమహిమ యనఁగ
నందమగు నిందుముఖిఁ బెండ్లి యాడితేని
నీవు భద్రాన్వితుఁడ వౌదు శ్రీవరేణ్య ! ౧౭౨

కం॥ రమ్మా మా నగరికిఁ గై
కొమ్మా మా చిన్ని ముద్దుగుమ్మను రతియే
సుమ్మా రూపమ్మున లే
లెమ్మా వేగమ్మ యువతిలీలామదనా ! ౧౭౩

సీ॥ పలుమాఱు చలముచేఁ బడఁతి నేలకయున్నఁ
బలుమాఱు చలముచే బడలు సుమ్మ
సతి నిందుకళలంటి రతులఁ దేల్పకయున్న
బత నిందుకళలంటి బడియు సుమ్మ
కొమ్మపై నఱలేని కూర్మి నిల్పకయున్నఁ
గమ్మ పయ్యరనాని కందు సుమ్మ
మధురాధర మొసంగి మగువఁ బ్రోవకయున్న
మధురాధరచితాప్తి మసలు సుమ్మ

చెలువ బహుళపుఁదమి కాంతిఁజేయకున్న
విరహబహుళపుఁదమిఁ జిక్కి వెఱచు సుమ్ము
మీరు రాకున్నఁ బాపంబు మీఱు సుమ్ము
రమ్ము నకి కూరిమి దిరమ్ము సుమ్ము శౌరి. ౧౭౪

వ॥ అదియునుంగాక యింక నొక్క విశేషంబు వివరించెద. ౧౭౫

కం॥ నీ విందఱిఁ బెండ్లాడితి
తీవిం దగ నవియుఁ బెడ్లితేవలె వినుమో
గోవింద యందునందున్
నేవిఁదున్ ముందుఁ దగునె నీ పేరునకున్. ౧౭౬

ఉ॥ బంధువులొప్పి చైద్యునకు బాలిక నీయగఁబిల్వకేగియున్
బంధువులఁ దోలి రుక్మిణిని బైటనె తెచ్చితి ప్రముచ్చిలించి యో
బంధురశీల నీ మొదలిభార్య గదా యది యవ్వివాహ మ
బ్బాంధవసమ్మతంబె తగుపాడియె దేవర! వారెఱుంగరే! ౧౭౭

కం॥ ముందా శమంతకమణీ
సందాహృతికొఱకు నరుగ నీ వొకగుహలో
నందా భల్లుక మొసఁగదె
వందారుని గతినింజాంబవతి నది సమమే. ౧౭౮

ఉ॥ ఆ జనవార్తమానమణి నంపిన మీపయి లేనిమాట దా
నోజ ఘటించితంచు నొకయూరనె మిమ్ము భజించియుండ స
త్రాజితుఁ డిచ్చె సత్య నుదరస్థితి వేఱొక రా జొసంగెనో
రాజులఁ గెల్చి తెచ్చితివొ రాజనుతా యిది యెంతఁ సెప్పమా. ౧౭౯

కం॥ కాళిందిత్రోవఁ జను నొక
బాలిక నాప్రొద్దు బట్టి భవనోచితఁగా

నేలితి వెలుఁగుదు నాగతిఁ
గాళిందిని మీఁరు పెండ్లిగావించుటలున్. ౧౮౦

కం॥ సోదరసమ్మతగా కని
వేదితయగునట్టి మిత్రవిందను మును రా
జాదేవి మీ పితృష్వస
గాదిలిసుత నియ్యకొనుట గౌరవమేమీ! ౧౮౧

చం॥ వృషములఁ గాచు గోపతతి పీనినిఁ గట్టుట యెంతనాక తా
వృషములఁ గట్టు మంచనియె వెట్టి నృపాగ్రణి నగ్నజిత్తు నా
వృషములఁ గూడఁగట్టినను విశ్రుతి నీకును నెంత యయ్యెఁ ద
న్మిషత సుదంతఁ గైకొనితి మెచ్చులు దెచ్చెనె రాజకోటిలోన్. ౧౮౨

ఉ॥ వారక నేనొకొక్కతతి వచ్చి వనాళిధరం జరింపుచున్
వారల రూపశీలగుణవైఖరులెల్ల నెఱుంగుదున్ గదా
వారలు సామికిన్ వలచువారలు వారల నెన్ననేల న
వ్వారిజలోచనాచయ వివాహములున్ విదితంబులే కదా! ౧౮౩

ఉ॥ బంధువిరోధమీదు వనపాళిమృగాళితోఁగొల్చువారితో
బంధుత గాదు త్రోవఁ జను భామినిఁ దెచ్చుట లేదు దేహసం
బంధులప్రీతి వోదు పనిమాలినయుంకువ రాదు మంచిదౌ
బాంధవ మో యదూత్తమ! కృపామతి మా సతిఁ బెండ్లియాడినన్ ౧౮౪

గీ॥ అయ్య! నీ వెంత దేవుఁడవైనఁగాని
చెలువ నిలువెడు ధనముఁ బోసిననుఁగాని
వనిత మీ యూరి కంపించువారు గారు
వారి యూరనె పెండ్లాడవలయు మీరు. ౧౮౫

కం॥ భూవరవైరములాదిగ
నా వరవర్ణినులఁ బరిణయంబుల నయ్యేన్

దేవరవారికిఁ దెలియఁగ
శ్రీవర ! మావారివిధముఁ జెప్పెద వినుమీ ! ౧౮౬

సీ॥ వెలలేని మీ గుణంబులు ననంతావృత్తి
వేనోళ్ళఁ గొనియాడు వెలఁదితండ్రి
దలఁచు మిమ్మన్న నిర్మలహర్షపాకాప్తి
మీ మేనయత్త యా మెలఁతతల్లి
శివయుక్తి మీ సూక్తి శిరసావహించుఁ దా
నతిభక్తిఁ బద్మాన్వయగ్రజన్ముఁ
డెపుడు దేవునిఁగాఁ నెంతు రాత్మల మిమ్ముఁ
బ్రమదంబుతో దేవిబంధుజనులు
సేరి మీ సేమమేమైనఁ జెప్పఁ బ్రేమ
వారి కన్నులు గప్పు నవ్వారిజాక్షి
గాన మీకు మా వనితపైఁ గరుణ యున్న
సులభమగు వెంటనే వివాహకలన దేవ ! ౧౮౭

గీ॥ ఇంతయును విన్నవించితే నింతమీఁద
వారి భాగ్యంబు దేవరవారి చిత్త
మెక్కువలు దెల్ప మీకు నేనెంత సుమ్ము
సర్వలోకైకభావజ్ఞ ! సార్వభౌమ ! ౧౮౮

కం॥ అనుచు సుధామధురోక్తుల
వినిచినఁ జపలాంగి రూపవిభవం బెల్లన్
విని వివశుఁ డగుచు యదుపతి
తనలోపల వలపుసొలపుఁ దలకొని కూర్మిన్. ౧౮౯

సీ॥ అంతఁ దచ్చిరసూక్తికాంతాభిరుచిగురు
శ్రవణంబునను బాల సంభ్రమించి

యా యర్థమెల్ల నాద్యంతంబు నేకాగ్ర
మననంబు గాఁగ నెమ్మది ఘటించి
యా భావనావృత్తి నంతయు నిశ్చయ
ధ్యానంబునకుఁగూడ నధిగమించి
యా స్వరూపస్ఫూర్తి నటమీఁద భావైక
దర్శనంబునకు నందఁగఁదలంచి

యావిధంబున శుకబోధితానురూప
వస్తువాంఛాప్తిచే నన్యవాంఛ లెడలి
యటఁ దదీయసాక్షాత్కృతి నలవరింప
నతనుబోధైకరతి నుండె నచ్యుతుండు. ౧౯౦

కం॥ హరి మానసమున నీగతి
పరమాణువలగ్నఁ దలఁచి భావభవకళా
పరమానందము నందుచుఁ
గరమాసురసికము శుకముఁ గని యిట్లనియెన్. ౧౯౧

కం॥ శుకమా వదనసదృశ కిం
శుకమా హితబోధతులితశుకమా గరుదం
శుకమా తనురుచిరత్నాం
శుకమా మామకమనోజ్ఞ సూర్యాంశుకమా ! ౧౯౨

చ॥ సరసతమక్రమారచనఁ జాటితి విట్లు లతాంగిరీతి నీ
విరచితసూక్తి వీనులకు విందు లొనర్చెనుఁ జిత్తమందునం
బరవశమయ్యె నన్నెటుల బాలికఁ గూర్చెదవో విచారసుం
దరగుణసారమా ! మృదుసుధాసమగీరమ ! ముద్దుకీరమా ! ౧౯౩

సీ॥ మాధవైకాశ్రయమహిమఁ గైకొని వన
ప్రియసహవాసాప్తిఁ బెంపుఁగనుటఁ

గమలాంబకాధీనకలనఁ దత్సన్నిధి
వెలయు నెక్కుడులీల వేడ్కఁ గనుట
హరిపేరు వహియించి యారీతి నవనిలో
విఖ్యాతిఁ గాంచినవిధముఁ గనుట
విష్ణుపదావృత్తి విహరింపుచును సాధు
సుముఖరక్తి నెసంగు శుభముఁ గనుట

సతత మారామధామసంగతినిఁ గనుట
సతత మా రామ నామసంస్మృతినిఁ గనుట
నెలమి మా కాప్తతరులలో నెన్ననైతి
వీవు మిక్కిలి శుకసంతతీంద్ర! వింటె! ౧౯౪

నీ సత్పథసంచారత
నీ సకలాగమశిఖార్థసీయఫలవిలా
సాసక్తి నీకె తగునొ
భూసురలోకాభిముఖ్యముగ శుకముఖ్యా! ౧౯౫

చిలుకలు లేవె! యీవిధి విచిత్రరుచిం దగియున్నె యుండెఁబో
చెలువుగ మర్త్యభాషలు వచించునె కొన్ని వచించెఁబో మితో
క్తుల ననుఁగాక యుక్తు లనఁదోచునె తోచెనుఁబో నినుంబలెం
దెలివి నపూర్వవస్తువులఁ దెల్పునె యో శుకలోకశేఖరా! ౧౯౬

మును నినుఁ గని వెఱగందెను
మనసున కత్యద్భుతముగ మగువ చెలువముం
గనుఁగొనినయట్ల ఎనఁగా
నొనఁగూర్చితి ప్రియ మొనర్చితో శుకతిలకా! ౧౯౭

అని మఱియు మురియుచుం దమిఁ
బెనిచిన వచనముల శౌరి ప్రియ మంగనపైఁ

గనఁ బల్కిన విని చిల్కయుఁ
గనికర మింతిపయి నిలిచెఁగా హరి కనుచున్. ౧౯౮

కం॥ తెక్కుల సందున నిమిడిచి
తక్కువగాకుండ నెలఁత తనువిభవంబ
మ్మక్క యన వ్రాసి తెచ్చిన
యక్కాంచన చిత్రపటము హరికిం జూపెన్. ౧౯౯

ఉ॥ చూచిటుచూపినం బటము సుందరిరూపము మున్ను కీరవా
క్సూచితమౌటకన్నఁ గడుసోద్య మొనర్ప మదిన్ గదాగ్రజుం
డాచని కూర్మి నిట్టులను నా చెలియందము గాంచి వెల్లిగా
లోచనసమ్మదాశ్రువులు లోలహృదంతరుఁడై తనంతటన్. ౨౦౦

కం॥ ఔరా! యీ రాజానన
సౌరా సౌరాంగనలకు సౌరుచ్యంబుం
గూరుచుఁ దనుఁ గొల్చుటకై
చేరిన తనుకాంతి నొసఁగి చేరువనుంటన్. ౨౦౧

కం॥ నెలకున్ వెన్నెలకున్ గి
న్నెలకున్ దిన్నెలకు సొగసునెలవులు దిద్దున్
నెలఁత నగుమొగము నగవుం
గులుకునురోజములుఁ గటియుఁ గుటిలతలేకన్. ౨౦౨

కం॥ ఈసతి కౌనునకే సరి
కేసరి నెమ్మోము కల్మికిం గల్వల సా
మే సరి మేసరిగెకు మిం
చే సరి చేససిజమురుచే సరి సిరులన్. ౨౦౩

ఉ॥ ఖంబు గదే నఖవ్రజ మిభంబు గదే గమనోన్నతుల్ ద్విరే
ఫంబు గదే కచాళి కరభంబు గదే తొడ బాగు హేమకుం
భంబు గదే కుచద్వయి నభంబు గదే యల కౌను దర్పణా
భంబు గదే ముఖం బతిశుభంబు గదే తగురీతి నాతికిన్. ౨౦౪

కం॥ మృగమదము మదముఁ గదుమున్
నిగనిగమను కురుల సిరులు నెలఁత కయారే
తొగలగమిమగని జిగిబిగి
నగనగు నగుమొగము సొగసు నగకుచకె తగున్. ౨౦౫

కం॥ తమ్ముల యుదరమ్ముల రుచి
రమ్ముల నగు మగువమేని రమ నిమిషములోఁ
గ్రొమ్మిమ్మించుఁ జూపుబంగరు
నన్ మించున్ పిధిఁ బెట్టి యట్టిట్టవినన్. ౨౦౬

కం॥ తామరసంబులు గాఁగల
తామరసము లింతి నయనతౌల్యము గనునే
తామసపుదరినఁ దిరిగెటి
సోముని మోమునకుఁబోల్చుచోఁ జేరువయే. ౨౦౭

కం॥ జవరాలి నెఱుల సిరివా
సవురాలో నిగ్గుదేఱు సౌరాలోకా
సువయోమణి చనుఁగవ జ
క్కవయో బంగారుకుండకవయో తెలియన్. ౨౦౮

కం॥ ఆనన మిల రాజే లే
వేనలి ఘనవిభవలీల పీనులు శ్రీలే
మేను పసిఁడిలో మేలే
మానిని భాగ్యంబు శక్యమా నుతికాలే. ౨౦౯

కం॥ ఆ మధ్యాకృతి యధరము
నా మాయావాదిరీతి యట మధ్యముగా
ఖామామణి మోమా శ్రీ
రామానుజమండలస్ఫురణఁ దనరారెన్. ౨౦౦

సీ॥ కమలంబు చెలిమోముసమము గాఁ జని ప్రీళ
వారిమధ్యమరీతి వాడఁదొడఁగె
భ్రమరముల్ దొయ్యలి భ్రమరకంబుల లీలఁ
గనఁ బోయి కాంతతఁ గనక తిరిగె
వెలఁది వాక్యామృతవృష్టి నోడియు వచ్చి
యల కోకిల కుచద్వయాప్తి జడిసె
సతి నితంబమునకు సరిగాక విపుల దాఁ
బ్రకృతి నాదివికారపటిమ నిలిచె
కొమ్మ కెమ్మోవి దీటుఁ గైకొను నియుక్తి
రక్తికై ద్రాక్ష మును రూపయుక్తిఁ గనియుఁ
గఱకు నలుపెక్కు నీరసకలన నందెఁ
గాన నిబ్బోటికిని సాటి గలరె జగతి. ౨౦౧

కం॥ ఏ వగలఁ జిక్కెఁ గుముదం
బే విధిఁ బూనెఁ దమిఁ బద్మమిట జడగతి మీ
నావళి యేటికి లోఁబడె
నీ వనిత విలోచనముల కెన దామగునే. ౨౦౨

కం॥ దీని కుచాలింగనసం
ధానతసుఖమంది దీని తనుశృంగార
శ్రీ నెల్లఁ గొల్లలాడని
యీ నా దుర్గంబు లేల యీ ధనమేలా। ౨౦౩

కం॥ అని యా వనజేక్షణుఁడా
వనజేక్షణ రూపవిభవవైఖరులెల్లం
దన కనురూపం బనుచుం
దనరుచుఁ దలయూచుఁ జూచుఁ దలఁచున్ వలచున్. ౨౧౪

కం॥ తిలకించి యటుల బాలిక
నల కాంచనవసనలసితుఁ డప్పుడు చంచ
త్పులకాంచితుఁడై తమి ని
మ్ములఁ గాంచి శుకంబుతోడ ముదమున ననియెన్. ౨౧౫

కం॥ ఒకటిగ మాకు లతాంగిన్
సకళాద్భుతి గూర్చి ప్రోవఁ జాలితివేనిన్
సుకృతఫల మబ్బు నీకును
శుకవిప్రవరా రసోక్తి సుకవిప్రవరా ! ౨౧౬

కం॥ భావపుఁజిత్తరు బొమ్మకు
జీవకళల్ గూర్చి దీని చెల్వము గనఁగా
భావింతు నిపుడయైనా
నా వనజాననకుఁ దుల్య మౌనో కాదో ! ౨౧౭

కం॥ ఈ వనితామణిఁ గూఱిచి
జీవము సుఖగతి నొవర్పు చెప్పెడిదేమీ
నీవే హరివై యుండెద
వావల నా రాజ్యవిభవ మంతయు నిత్తున్. ౨౧౮

గీ॥ అనిన శుకవతంస మా యదూత్తంసున
కిట్టు లనియె వినయ మినుమడింప
నింతఁ జేప్పవలెనె యింతిపైఁ బలుమాఱు
మారుజనక మిగుల మమత జనక. ౨౧౯

కం॥ మా కన్నియకుం గూరిమి
నీకన్నన్ మున్న కలదు నీవార్తల మే
లూకొన్నదాఁక సమ్మతి
గైకొన్నదొ లేదొ సుదతిఁ గనఁ జనవలయున్. ౨౨౦

కం॥ చెలి నాతోఁ గూరుచుమని
లలి నాతోఁ జెప్పి చెప్పి లంచం బియ్య
న్వలె నాదేవకి సూతీ !
లలనాసుమహేతి నాతి లాఁతియె చెపుమా ! ౨౨౧

కం॥ చంచత్కువలయముఖ భో
గాంచదసమసాధనంబులన్నియు మిమ్ముం
గాంచినపు డున్నవే కద
పంచాయుధజనక మీ కృపయె చాలునికన్. ౨౨౨

వ॥ అదియునుంగాక ౨౨౩

గీ॥ అకలుషపువస్తు విచ్ఛేద వంటివేని
నీకుఁ గామార్థదౌత్యంబు నెఱపినాఁడ
సరికి సరిజేయుటే చాలు శౌరి ! నాకు
నీవు మోక్షార్థదౌత్యంబు నెఱపవయ్య. ౨౨౪

కం॥ ఏ పరమేశుకరాదృతి
నా పరమేష్ఠియును గోరు నది గని ముక్తి
వ్యాపారమె కోరెద మది
మా పక్షుల ధర్మ మిది సుమా పరమాత్మా ! ౨౨౫

గీ॥ అనుచు నయము నయము వినయంబు నెనరు
దోపఁ బల్కి భక్తితోడ మ్రొక్కి

చేరియున్నఁ జూచి శౌరిహాసరుచిఁజూచి
తాననమున శుకము నాదరించి. ౨౨౬

గీ॥ అంత నారామసందర్శనాభిలాషఁ
దిరుగు శౌరి మనంబునం దిరవు పారి
తనరు ఘనతాపభరమునఁ దన పురమున
కరిగె నా రామ సందర్శనాభిలాష ౨౨౭

గీ॥ అటులఁ జనుచు రమ్మటంచుఁ దన్నుఁ బ్రియంబు
నానతీయ మాట నానతీయ
హర్షలహరితోడ హరితోడ ద్వారక
కేఁగునపుడు చిలుక హితవుఁ జిలుక. ౨౨౮

కం॥ యాదవులన్ హరికెదురై
యా దవులన్ వచ్చువారి నారయుచు విలా
సాదరణమ్ముల వారి బ్ర
సాదరమం జనుచు శౌరిసౌరుం గనుచున్. ౨౨౯

కం॥ ఈ యాదరణం బీ గుణ
మీ యాదృతమందహసన మీ విలసనమున్
మాయాదవహృతి కరుఁడగు
మా యాదవపతికిఁ దగు సుమా యని మఱియున్. ౨౩౦

సీ॥ ఎల్లలోకనికాయ మేలువాఁ డఁజుఁ గన్న
మేలువాఁ డడభవు సామేలువాఁడు
మేని దువ్వలువ బ్రకొమ్మించువాఁ డమరుల
మించువాఁ డసురబొమ్మించువాఁడు

నల తమ్మిసూడుదోడాలువాఁ డహినొంపు
డాలువా డసితంపు డాలువాఁడు
నిజభక్తకోటి మన్నింపువాఁ డల ప్రేమ
నింపువాఁ డట్టిలోనింపువాఁడు
నామదారివి దారిగదారిధారి
యదుకులోద్ధారిదారిదయావిహారి
సీరిసహచారి యయ్యె నీసిరిమురారిఁ
జేరి యీ శౌరి నెన్న నెవ్వారి వశము. ౨౩౧

మ॥ పదముల్ జంఘలు జాను లూరులు కటీభాగంబు మధ్యంబు నా
భి దరుల్ కుక్షి యురంబు హస్తభుజముల్ వీపున్ గళం బోష్ఠముల్
వదనం బక్షులు నాస చెంపలు శ్రుతుల్ ఫాలంబును న్మౌళి సొం
పొదవన్ సుక్రమలీలఁ జెన్నగుఁ గదే యూహింప నీ శౌరికిన్. ౨౩౨

మ॥ అసమానశ్రుతికల్పశాఖికిఁ జిగుళ్లాగా పదాబ్జంబు ల
య్యసదౌ కౌనుబెడంగు సింగములు నుడ్డాడించు మించున్ భుజో
ల్లసనం బబ్ధితరంగరేఖ శశి నుల్లంఘించు మోముం గటా
క్షసుధాసేచనముల్ విలోచనము లాకర్ణాంతముల్ సామికిన్. ౨౩౩

ఉ॥ చేరలఁ గొల్వవచ్చు దయ చిప్పిలు గొప్పకు గొప్పకన్నులున్
మూరలఁ గొల్వవచ్చుఁ గడు ముచ్చటలిచ్చు వెడందవక్షమున్
బారలఁ గొల్వవచ్చుఁ గచపాళి భళీ హరికిన్ సమీపపున్
మేరలఁ గొల్వవచ్చు నిఁక మేలితఁ డీగతిఁ బ్రీతిఁజేసినన్. ౨౩౪

కం॥ రసికాగ్రేసరుఁడౌరా
రస నీ వసుదేవసుతుఁడు రమణీయగుణో
ల్లసితుఁ డితని రూపము దా
న సదృశ మాయబ్జసదృశ కనురూప మగున్. ౨౩౫

కం॥ అని యీగతి నుతియింపుచుఁ
జని యా కీరంబు శౌరి సాంగత్యంబుం
గని యా వనరాశితటాం
తనియామకుశస్థలాఖ్య ధరణీసరణిన్. ౨౩౬

ఉ॥ ద్వారక ద్వారకాంతయదుదారక శౌరికటాక్షసీతబ్బం
దారక ఘోరకల్మషవిదారక భూరికళాంక భూమిబ్బం
దారక సారకీర్తిమహిదారకవైరి కుటన్నటోరుభూ
దారకఁ జేరి కాంచె సముదారకకీరకులేంద్ర మంతటన్. ౨౩౭

ఉ॥ హీరసుధానులేపములు నింద్రమణీరుచిధూపముల్ ప్రవా
ళారుణధాతువల్లికలు నంచితమౌక్తికరంగవల్లిక
ల్గారుడరత్నతోరణ కలాపము లంబుజరాగదీపముల్
దారిచి భూరిచిత్రమగు ద్వారవతీపురిఁ గీర మేఁగుచున్. ౨౩౮

సీ॥ ఇది వసుదేవునిల్లెదుట ముక్తాబద్ధ
మిది యుద్ధవుం డుండు హేమధామ
మిది బలు నిలయేంద్ర మింద్రనీలవిశాల
మిది సాత్యకివిహారహీరగేహ
మిదియ ప్రద్యుమ్నుఁడున్నది విదూరాగార
మిది గదు మరకతాదృతనివేశ
మిదియు నక్రూరుని యిందుకాంతనిశాంత
మిది యాదవుల చిత్రసదనవీథి

గిరుల నడుమనుఁ దగు మేరుగిరియ పోలి
మహితమణి హేమదీప్తుల మహి వెలుంగు
నది మురాంతకు దివ్యశుద్ధాంత మనుచుఁ
బౌరులు వచింపఁ గనుచు నక్కీర మచట. ౨౩౯

కం॥ పలువింతలు గల చెంతలు
బలుకాంతులు మణినిశాంతఫలకాంతరస
త్కళ లెంతయుఁ దొలకం బురి
చెలువంతయుఁ జూచెఁ జిలుక చిత్రత చిలుకన్. ౨౪౦

కం॥ ఈ రీతిం ద్వారవతిం
గీరవతంసంబు దిరిగి కీలితకద్రూ
జారిధ్వజారమగు దను
జారిహజారంబుఁ జేరి యచ్చటనచటన్. ౨౪౧

చ॥ హరపరమేష్ఠి వాసవముఖామరలోకములందునుంచి
హరిఁ గొలువంగ వచ్చి మును పచ్చటనచ్చటఁ దన్నెఱుంగు వా
రెఱిఁగి సఖా! శుకాగ్రణి యటెన్నడు రా వెటు వచ్చితన్న నీ
హరినిఁ గనంగ వచ్చితి నటంచుఁ బ్రియోక్తి నెఱుంగఁ జెప్పుచున్ ౨౪౨

వ॥ అప్పుడా సుపర్ణవర్ణనీయంబగు దివ్యవిహంగరాజంబు విష్వక్సేనాభి పాలితంబును, విరాజితానంతభోగవిభవంబును, విజయ ముఖ్యవిశిష్ట జనాధిష్ఠిత ద్వారనివహంబును, సనందనాది సుకృతి సందోహ విహారంబును, నతిలోకప్రకాశంబునునై వైకుంఠప్రదేశంబు ననుకరింపనగు నగధరు నగరుఁ జొచ్చి హెచ్చిన నిజామోదంబున నా దేవు సదయ ప్రసాదంబున ననిరోధగతిం దదీయావరోధనివేశంబుఁ బ్రవేశించి యంత. ౨౪౩

ఉ॥ అచ్చట భోజకన్య మొదలౌ హరిపట్టపురంధ్ర నార్వురం
బొచ్చెము లేని కూర్మి నొక పొందికగా మఱుమాట పెట్టిరా
వచ్చినవార్తఁ జెప్పి కనవచ్చితి మిమ్మని చేరి వారు తో
నచ్చెరువంది తన్నుఁ గన నందఱు నన్నిట మెచ్చఁజేయుచున్. ౨౪౪

కం॥ ఆ హరిణాక్షులకును మఱి
యా హరికినిఁ దనకుఁ గల్గు నతిశయవిద్యా
సాహిత్యము గానకళా
సాహిత్యము దెలుపఁదలచి చని శుక మనియెన్. ౨౪౫

మ॥ సరసస్ఫూర్తి సరస్వతీయువతికిన్ సంగీతసాహిత్యముల్
వరవక్షోజయుగంబ నాఁబఱగు విద్వద్బాలవృద్ధిక్రియా
కరసంపజ్జనకంబు లందొకటి ద్రాక్షాగుచ్ఛమాధుర్యవై
ఖరి వేఱొక్కటి నారికేళఫలపాకవ్యాప్తిసౌఖ్యం బిడున్. ౨౪౬

కం॥ శిశువులకుం బశువులకున్
వశమై సౌఖ్యంచు గానవైఖరి మధురా
తిశయము సాహిత్యరుచిన్
భృశగతి సర్వజ్ఞుఁడైన నెఱుఁగంగలఁడే ౹ ౨౪౭

మ॥ సరసాలంకృతిబోధ సేకఱుఁ గళాచాతుర్యముల్ దోచు వా
క్యరసజ్ఞత్వము గల్గు భావగతి నాహ్లాదం బిడుం జిత్రవై
ఖరి కావ్యంబు లొనర్పు నేర్పు గలుగుం గల్పించు రాజప్రియం
బిరవై దుర్వ్యసనం బడంచు భువి సాహిత్యంబు సామాన్యమే. ౨౪౮

కం॥ అ సాహిత్యశ్రీకిన్
భాసురకవితావిలాసపాండిత్యము ను
ల్లాసింప సువర్ణమునకు
నా సౌరభ మెనసినట్టులగు నని మఱియున్. ౨౪౯

ఉ॥ తనరన్ వ్యాకరణజ్ఞుఁ దంద్రి యనుచుం దర్కజ్ఞునిం భ్రాతయం
చును మీమాంసకుని న్నపుంసకుఁ డటంచున్వీడి దూరంబునం

గని యస్పృశ్యునిఁబోలె ఛాందసుని వేడ్కం గావ్యలీలారస
జ్ఞు నిజేచ్ఛం గవితామధూమణి వరించున్ భావగర్భంబునన్. ౨౪౦

వ॥ కావున ౨౪౧

చ॥ పలుకులరీతి యర్థములభంగి రసంబుల పెంపు భావపుం
జెలువము లాశయంపురుచి శీతలవైఖరి ప్రౌఢమార్గమున్
లలితచమత్కృతుల్ దగు నలంకృతులుంగని సత్కవీంద్రులన్
మెలఁకువఁ గాంచి భూవరులు మెచ్చిన విద్యలు విద్యలౌ గదా! ౨౪౨

కం॥ అని తన కవితాచాతురి
వనజాక్షుని భార్యలైన వనజాక్షులపై
వినుత ప్రబంధరీతుల
నొనరించుచు మఱియు గీతయోగ్యస్ఫూర్తిన్. ౨౪౩

సీ॥ శ్రీరాగరంజన శ్రీరమ్యతరరీతి
యారతానేకముఖారిలీల
సారంగపోషణ స్వారస్య విభవంబు
పున్నాగశయ్యా సమున్నతియును
నమృతసంగతి మోహనారూఢవైఖరి
నిఖిలనాటకసూత్ర నిరతిరచన
నియతిలోకాంభోజిసీవరాళిస్థితి
భూపాల సరసానుభూతికలన

లాదిగాఁ దాళ సద్గతిప్రాణపదము
గాఁగ ననురాగగతి మిత్రగరిమ దనర
వరకవిత మీఱ కీర మా పురుషమౌళి
మీఁద బహుపదపాళి నమ్మెయి రచించి. ౨౪౪

కం॥ అంగనలకు హరికినిఁ దన
సంగీతము వినఁగఁజేసి చాన లిడు మణీ
సంగతభూషలు గొని ది
వ్యాంగద మచ్యుతుఁ డొసంగి యంఘ్రి ఘటింపన్. ౨౫౫

గీ॥ దానిఁ గైకొని యంత సౌందర్యదర్ప
మేర్పడఁగ శౌరి పట్టపుదింతు లొక్క
మాటనెపమున నెవ్వారు దీటు మాకు
సుందరత నన్న వారి కా శుకము వలికె. ౨౫౬

కం॥ కలుగుదు రొకతఱి తమకొ
తలఁ జక్కనివారు తాడుదన్నెడివారిం
దలఁదన్నువారు లేరే
వలదీ గర్వంబు లెంతవారలకైనన్. ౨౫౭

గీ॥ అనుచు నర్మోక్తిగాఁ బల్కు నా శుకోక్తి
వారు విస్మయపడియుండ వీరికన్న
కన్య లావణ్య మెక్కుడౌగా యటంచు
హరియు సన్నకు సన్నలో నెఱిగె నంత. ౨౫౮

వ॥ మఱియు నత్తఱి నా కీరసత్తమంబు తమ మత్తకాశినిం దలంచి పురుషోత్తమపదాయత్తంబగు చిత్తంబు మెత్తమెత్తన మఱలించి యందరిచేత ననుజ్ఞాతంబై యా నందనందను నభినందింపుచుంజనియె నవ్విధంబున. ౨౫౯

ఉ॥ కీరము శౌరి వీడుకొని కేకయరాట్పురమార్గచారమై
దూరము బోవ దాని వెను దూకొనుచూడ్కులు నెట్టకేలకుం

జేరగఁదీసి యయ్యమరసేవితుఁ డయ్యెడఁ గాంత లెంతయేఁ
జీరఁగ భోజనాదికము సేసి యొకానొకరీతి నంతటన్. ౨౬౦

సీ॥ సతి నితంబము నెంచి చక్రంబు మఱచెఁబో
గళ మెన్నికొనుచు శంఖమును మఱచెఁ
గలికి నూగారెంచి ఖడ్గంబు మఱచెఁబో
బొమ లెన్నికొనుచు శార్ఙ్గమును మఱచె
నతివ వాక్సుధ నెంచి యశనంబు మఱచెఁబో
ప్రభ నెన్నికొనుచుఁ బైపటము మఱచె
భామ మధ్యం బెంచి భావంబు మఱచెఁబో
నెఱులెన్నికొనుచు దేహరమ మఱచెఁ
బడఁతి ముఖ మెంచి రాజసంపదలు మఱచెఁ
దరుణి సురతాప్తి నెంచి భూస్థిరత మఱచె
మఱచె నారామ మదిఁ జేఱ మఱియు నన్ని
హరియుఁ గీరార్పితోపదేశాభిరతిని. ౨౬౧

కం॥ శుకబోధితార్థమననే
చ్ఛుకు హరి సనఁడయ్యె నొక్కసతి గృహమునకున్
శుకబోధితార్థమననే
చ్ఛుకుఁడగు నతఁ డిచ్చఁ జనునె సతిగృహములకున్. ౨౬౨

సీ॥ సుందరీద్యుతి రుక్మసోదరమై మించ
భోజకన్యాసక్తిఁ బూనఁడయ్యె
సతి హాసరమ ఋక్షజాతాప్తి నిరసింప
జాంబవతీప్రీతి సలుపఁడయ్యె
నతివ గుణాళి సత్యౌచిత్యగతి హెచ్చఁ
దలఁచి సత్రాజితిఁ దలఁచఁడయ్యె

నాతి నడక హంసజాతివృత్తిని మీఱఁ
ప్రేమ కాళిందిపైఁ బెనుచఁడయ్యె
సఖిముఖస్ఫూర్తి కరవిందసహజరేఖ
కడమగుట మిత్రవింద లెక్కగొనఁడయ్యె
వనిత మాట సుదంత యెంతనుటఁజేసి
నాగ్నజితిఁ జెందడయ్యె నా నందసుతుఁడు. ౨౬౩

మఱియును ౨౬౪

తలఁచిన వస్తువుల్ గలిగియుఁ జెలిమోవి
ఖండచక్కెరలకే కోరుచుండు
నఖిలదుర్గములు చేనందియుఁ గామినీ
స్తనదుర్గములకె యత్నంబు దలఁచుఁ
దఱుచైన నిలువుటద్దములు గాంచియు నింతి
చెక్కుటద్దముల నీక్షింపఁగోరు
బహుమూలధనము సంపద విఱ్ఱవీఁగియు
నతివ నీవీప్రాప్తి కాసఁజేయు

నప్పరలకన్నఁ గడు సుందరాంగులెంద
రేనిఁ గల్గియు నువిదతో నెనయఁ దివురు
చెలియ శృంగార మెంతయో తెలియరాదు
కంతుజనకుఁడు మదినిరా భ్రాంతిజెందు. ౨౬౫

ఈ లీలం బాలికపై
బాళికలిమి నంది నందబాలకుఁ డంతన్
వాలాయము వలరాయని
వాలాయము సోకి ధైర్యవప్రం బగలన్. ౨౬౬

సీ॥ పాలవారాశిలోఁ దేలియుండిన మేటి
ప్రేమాంబురాశిలోఁ బేర్చి లేచు
చెరలాడి వచ్చు కార్చిచ్చు మ్రింగిన దంట
విరహాగ్నివెచ్చన వెచ్చనూర్చు
మాయాంధకారంబు మాయఁజేసిన భర్త
కామాంధకారమగ్నత వహించుఁ
దఱుచైన భవపరితాప మార్చిన ప్రోఢ
మదనతాపంబున మది గదించుఁ

ప్రకృతిబోధంబు నెల్లవారల కొసంగుఁ
దాపసగురుండు బోధంబు దక్కనుండు
నచ్యుతుఁడు కైకయీ వియోగార్తిఁ గనుట
నకట సతిఁబాయు టభవునకైనఁ దరమె. ౨౬౭

కం॥ ఒక హరి నిలిచెన్ మోమున
నొక హరి మధ్యమున నాదిగె నొక హరి వాచా
నికరగతి నరిగె ననఁగా
నిఁక నీ హరి చిక్కఁడదె యీ చెలిచూడ్కిన్. ౨౬౮

కం॥ మనుజుల సంవత్సరమొక
దినముగ లీలలు ఘటించు దేవాగ్రణికిన్
వనితాధరసుధ నానమి
దిన మొక యేఁడయ్యె మఱచె దేవత్వంబున్. ౨౬౯

కం॥ హరిణాక్షి నెంచు మధ్యము
హరియందుఁ దలంచు మఱియు నానన మెంచున్

హరియించుఁ గాని తన్నున్
హరియించుఁ దలంచ దయ్యె హరి యించుకయున్. ౨౨౦

కం॥ జనని నొక సవతిఁ గూఱుచు
పనిగా నితఁ డనుచు మరుఁడు పగచేఁబోలెన్
జనకుఁడనక నిగుడించెన్
వనజోదరు మదిని గాడ వాడిశరంబుల్. ౨౨౧

కం॥ హరిపైఁ బంచాయుధములు
మరుఁ డురువడిఁ బఱప సమయమహిమముగొలఁదీ
హరిపంచాయుధములలో
గుఱిగా నొకటైన మాఱుకొనలేవయ్యెన్. ౨౨౨

వ॥ అయ్యెడ ౨౨౩

కం॥ చెలిఁ దలఁచుఁ దలఁచి యేవిధిఁ
గలుగునొ తల్లాభ మనుచుఁ గడుఁ దర్కించుం
జిలుకదె కారణంబని ని
శ్చలపడు హరి మఱియు భోగసంగతులెంచున్. ౨౨౪

గీ॥ ఇటులఁ బటులక్ష్యమెద దాని నెన్న దేని
తమ గృహములన్న మదినైనఁ దలఁచకున్న
వెన్నుని విహారములు గాంచి వెలఁదు లెంచి
తలఁచి రిట్లని మదిలోనఁ దమకమూన. ౨౨౫

ఉ॥ ఎక్కడనుండి వచ్చెనొ కదే యల కీరము మేటిదాయ మా
కక్కడ కన్నుసన్నలు రహస్యములున్ హరితోడఁజేసెఁ దా

నిక్కువ మెన్ని పోకడలు నేర్చినదా పలువన్నెలాడి మా
చక్కని సామి కెయ్యదియొ జాలిఘటించెఁ గదే మనంబునన్. ౨౨౬

కం॥ నే మున్నీసడిఁ దెలిసితిఁ
జామరొ! మనతోడ నెక్కసక్కెములాడెం
గా మాయలకుక మప్పుడు
దామోదరుఁడల్ల నవ్వి దానింజూచెన్. ౨౨౭

కం॥ ఔనౌనని యొకరికొకరు
మానిను లిటు దలఁచి తమదు మనసులఁ దార్కా
ణైనం గని నిచ్చలు న
చ్చో నాథుని శుభము లరయుచుం దగి రెలమిన్. ౨౨౮

## చక్రబంధ చిత్రశార్దూలవృత్తము

సత్యోపేతసుకేళి సోత్కరశమీ సంవిద్విచార్య ప్రధీ
నిత్యోదంచిత శర్మమందిర సుపాణీనుత్యశా కష్టమా
సత్యానాథ నవస్వభూతిరసలక్ష్యాతీర్థ రీతీశనీ
నీత్యులాస విధానికల్ప సమకంధీపశ్య మాభామినీ. ౨౨౯

## ఛత్రబంధ చిత్రకందము

దారవతనువశ జయజయ
సారశమ సమగ్రమహిమ శరహాసరసా
సారసహారసుకరభా
భారకసురసాయ జయజ భవనుతవరదా ! ౨౩౦

## గోమూత్రికాబంధచిత్రసుగంధివృత్తము

శ్రీరమారసాత్యగత్య సేవ్యభావ్యలక్షణా
సారదీప్త సారసాప్త సారసారి వీక్షణా
ధీరవారనుత్య సత్య దివ్యభవ్యరక్షణా
వైరదృప్త నీరగుప్త వారణారిశిక్షణా. ౨౮౧

ఇది శ్రీమదుభయకవితా నిస్సహాయసాహితీవిహార
కాణాదాన్వయ తిమ్మనార్య కుమార వినయ
గుణధుర్య పెద్దనార్యప్రణీతంబైన
భద్రాపరిణయోల్లాసంబగు
ముకుంద విలాసంబను
మహాప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము
సమాప్తము.

—౦—

# ముకుందవిలాసము

## తృతీయాశ్వాసము

శ్రీకరకృష్ణాతుంగా
శీకరకృత రంగవల్లి చిత్రాంగణదే
శాకరసోమాధిపల
క్ష్మీకరసుసహాయ చెన్నకేశవరాయా ! ౧

గీ॥ అవధరింపుము హరికథాశ్రవణవిభవ
లోలుఁ డగునట్టి జనకభూపాలునకును
శ్రీహరిస్తవనామృత శ్రీవిశేష
హితరచనయోగి శుకయోగి యిట్టులనియె ౨

కం॥ ఈ రీతి శౌరిదయ గని
కీరము ఖేచరతఁ గాంచి కేకయనగరిం
జేరఁ జని చెంగట శృం
గారవనిన్ విశ్రమించి గళితశ్రమమై. ౩

కం॥ అంతఁ దన కెదురుజను శుక
కాంతులనఁ గ భవనమణులఁ గాంతులెనయఁగా
నంతంత ఖగము నగరా
భ్యంతరమున నరుగునప్పు దయ్యెయెదలన్. ౪

కం॥ చిలుకా ః చెలికాడ యిటీ
వలని నుఁ గనమెన్నఁడనుచుఁ బలికెదు తన నె

చ్చెలుల కౌకానౌకరీతిం
దెలుపుచుఁ దనరాకఁ జని మణీసౌధమునన్. ౫

సీ॥ వలపు రెట్టింపఁ నిల్వఁగరాని సౌఖ్యాచే
నరమోడ్పుఁగనుదోయి నమరుదానిఁ
గమలాక్షుఁ డెదుట సాక్షాత్కరించినట్లైన
నులికిపాటున లేచి యొదుగుదాని
నాథుఁ డిచ్చటికి నెన్నడు వచ్చునో యను
చింతచేఁ జెక్కు చేఁ జేర్చుదానిఁ
బ్రియసఖుల్ బలిమిఁ బ్రార్థించి పిల్చినఁగాని
యొక్కమాఱునుఁ బల్కకుండుదానిఁ

గీర మేటికి రాదొకో యా రమేశుఁ
గాంచినదొ లేదొ యనుచు నూహించుదానిఁ
జేరి హరి చిత్రఫలక మీక్షించుదాని
ననుఁగుఁజెలి భద్రఁ గనియె విహంగ మటుల. ౬

కం॥ ప్రియమునఁ గని రయమునఁ జని
శయమున నది వ్రాలుటయును సంతసిలి మృగీ
నయన వరానయనభ్రమ
నయనప్రమదాశ్రువులఁ గనన్ శుక మంతన్. ౭

కం॥ హరి యిపుడే రాలే దనఁ
బరవశయై మఱియు నిన్నుఁ బరిణయమగునో
తరుణీ ! యీలో ననగాఁ
దెలిపి గనియెఁ జెలియవలపుఁ దెలియ వశంబే ౮

వ॥ అంత నా శుకశకుంతం బా కాంతం గొంతఁ బ్రశాంతం గావించు నంతరంగంబున.

క॥ కొమ్మా కొమ్మని కమ్మని
క్రొమ్మావిచిగుళ్ళఁ బొదిగికొని హరిసతికై
యిమ్మనిన పారిజాతసు
మమ్ముల హార మ్మొసఁగి మానినితోడన్. ౧౦

క॥ నీ చెలువు డిచ్చె నీ కన
నా చెలి యా విరులసరము నామోదకళా
గోచరముగ నళిచయరుచి
సూచనలోచనమరీచిఁ జూచి శుభరుచిన్. ౧౧

సీ॥ వనరుహాలోకభావము నీకుఁ గలదని
యొకకొంతఁ గన్నుల నొత్తి యొత్తి
శంఖసుకరకాంతి సవరించు నీకని
వేడ్కతో గళసీమ వ్రేసి వ్రేసి
ఘనసుమనోమాలికా ముఖ్యగతి నీకుఁ
గలదని భుజవల్లిఁ గమిచి కమిచి
యచ్యుతస్థితి నీకు నామోదరతి గల్గు
నని యురోజములపై నునిచి యునిచి
కౌస్తుభస్ఫూర్తియును నీకుఁ గలదటంచుఁ
దన విభుని పేరుగా దానిఁ దలఁచి తలఁచి
పడఁతి పతి పంపినట్టి యా పారిజాత
హారమును శౌరిఁ గనునట్లు యరసి యరసి. ౧౨

క॥ ఆహా రమేశుఁ డంపిన
యా హారంబిదియు సంతతానందిత హ

వ్యాహారము గనుఁగొన నమృ
తాహారముఁ బోని తృప్తి నలరిచె ననుచున్. ౧౩

కం॥ ఆ చెలువంబున నది గని
యా చెలువ ప్రియంబునంద నది గని వనితా!
నే చనినవార్త విను మిదె
వాచించెదననుచుఁ గిరవర మిట్లనియెన్. ౧౪

కం॥ నిను వీడ్కొని యటఁ జనిచని
జనపదములు మునిపదములు సరముల్ పురముల్
ఘననిగమములగమములున్
మునుఁ గనుచుఁ బ్రభాసతీర్థపుంబ్రాంతమునన్. ౧౫

కం॥ వారినిధిన్ భూరినిధిన్
హారివిధిన్ విశ్వకర్మ యలరించిన వి
స్తారవతిన్ సారవతిన్
ద్వారవతిం గంటిఁ గని తదంతికసీమన్. ౧౬

కం॥ పారావతవారాహత
పారేవతగళిత సారభారవదవనిన్
శ్రీరైవతకాచలశృం
గారవనిన్ మత్పురాధిగతసుకృతమునన్. ౧౭

కం॥ ముద మొదవఁ బొదలు నొక పూఁ
బొద మొదలంగదలి మ్రొక్కఁబోయిన దేవుం
డెదురైనరీతి దోచిన
యదుకులపవిహేతిఁ గంటి నసురారాతిన్. ౧౮

సీ॥ చిఱుతప్రాయమువాఁడు చిఱునవ్వువెన్నెలల్
మొలకలెత్తెడి ముద్దుమోమువాఁడు

వలపుఁ జిల్కెడువాడు చెలువమౌ నమృతంపుఁ
దావి కిమ్మైన కెమ్మోవివాఁడు
కలికికన్నులవాఁడు మలఁచి తీర్చినటివి
గననైన తొమ్ముపొంకమ్మువాఁడు
మరుని మీఱినవాఁడు మరకతమ్ములకన్న
మిసమిసల్గను మేనిమెఱుఁగువాఁడు

సొంపుగలవాఁడు చల్లనిచూడ్కివాఁడు
నెనరుగలవాఁడు నేర్పులఁ దనరువాఁడు
మేలుగలవాఁడు ముజ్జగ మేలువాఁడు
మాధవుండు సమాశ్రితోమాధవుండు. ౧౯

కం॥ అతని గుణంబులు నేనా
స్తుతి జేయగ నురగపతియు సురపతియు నహ
ర్పతియునుఁ దగరన నియమ
వ్రతులై వర్ణించి కాంచి వ్రాసి గణింపన్. ౨౦

కం॥ పలుకులు గమ్మని కపురపుఁ
బలుకులు మానసము సుగుణపరికరహంసా
వళిమానసంబు నయనము
లలరుఁ గృపానయనములు మురారికి సకియా ! ౨౧

చం॥ తెలివ ! తళుకుక్కనన్మెఱుఁగుదేఱెడు చెక్కులు చక్కనైన పే
రురము గనం బదాఱుకళ లుట్టిపడందగు మోము వట్రువల్
దిరిగి చొకాటపున్సొగసు దెల్పెడి బాహువు లింద్రనీలపున్
వెరవులఁ గేరడించు నెఱవెండ్రుక లయ్యదుభర్తకే తగున్. ౨౨

గీ॥ అడుగులు పంకజాతముల క్రొఙ్జిలిడంజను గౌనటంటిమా
పిడికిటఁ బట్టనౌను కడుపెద్ద యురంబు మరుందు కొల్వుకై
పదయఁగవచ్చు ముచ్చటగు పాణియుగమ్ము విలోచనమ్ములా
బుడిబుడి నేగి వీనులకు బుద్ధులు సెప్పు సుమీ మురారికిన్. ౨౩

గీ॥ వాని కన్నులు సొగసుమేల్బూనుటఁ గని
వాని కన్నులు సొగసుమేల్ బూనుదు రిల
వాని చెలువంపుదొరతీవి వరుసనాథ
వాని చెలువంపుదొరతీవినైన మలఁచు. ౨౪

కం॥ సల్లపనంబును హాసల
సల్లపనము దోఁప నాప్తజనములమీదం
జల్లగఁ గరుణామృత మెదఁ
జల్లగల కటాక్షలహరి సహజము హరికిన్. ౨౫

కం॥ నుదురైతే రాజౌలే
నదురై తేరాజు భువననాథుం డౌతే
యదురాజున కెవరైనా
యెదురా యరవిందనయన! యెందుననైనన్. ౨౬

గీ॥ అక్క వైదర్భియును భల్లుకాత్మజయును
నిమ్నపౌత్రియు మఱి తాపనియునుఁ గోస
లాత్మజయు నాగ్నజితి యఁట హరివధూటు
లతని కొకరైన సరి రా రొకందునైన. ౨౭

కం॥ ఆ బంగరయ్యతో ని
న్నో బాలామణిరొ కూర్ప నొగి భూషణమౌ

యాశుగతి చైత్రవిధులకు నలికి కలికి
యాశుగతి చైత్రవిధులకు నాకరముగ. ౩౮

కం॥ ఆయెడ నీగతిఁ గాయజ
తోయజశరహతి లతాంగి దూలుచు హరిపైఁ
బాయనిమతి డాయని ధృతి
హా యని మితిలేని కూర్మియర్మిలి బెట్టన్. ౩౯

సీ॥ చిలుక చెప్పినసైనఁ జెలువుండు రాఁడాయె
నే డాయఁగలనె ప్రాణేశుకడకు
నినుఁ డిట్లు రానిచో దిన మొక్కయేఁడాయె
నేఁడాయెడకుఁ బోవనేర్తు రెవరు
పద్మినీరిపుఁడు ప్రభంజనుతోడాయెఁ
దోడాయె వారికెంతో వసంతుఁ
డిట మారునకు నాదు హృదయంబు వీడాయె
వీఁ డాయములెఱుంగు విరహులందుఁ

గాన నేనెట్లు నోర్వఁగాఁగా దటంచు
నా హరిఁ దలంచు నూహించుఁ దా హసించు
సాహసించు వసించు లో జాలిమాలి
నటుల యా భద్ర నిర్నిద్ర యగుచునుండ. ౪౦

మ॥ భవదంశోద్భవభద్రపద్మముఖి నీ పద్మాక్షిఁ బద్మాక్షుఁడున్
భవదుద్యద్దయచే వరించు నిఁక నన్ భవ్యోక్తిమిత్రత్వవై
భవతం బద్మకు వార్ధిసంభవకుఁ జెప్పంబోయె నాఁ బద్మబాం
ధవుఁ డంతం జనె వార్ధిచెంతకుఁ బ్రచేతస్సంగతిస్ఫూర్తిచేన్. ౪౧

చ॥ సమయభిషగ్వరుం డపరశైలపుకుప్పె దినేంద్రుఁడన్ రసేం
ద్రము నిడి పైఁ దదూర్ధ్వకరతామ్రశలాక ఘటించి వహ్నియో

గము నొనరింప సింధురముగాఁ బయికిం బ్రసరించె నాఁ గరం
బమరెను సాంధ్యరాగము నభోంతరదంతురితాంశుభాగమై. ౪౨

చ॥ ద్యుమణి వడంగ విచ్చు చరమోదధి బైల్పడ వచ్చు బాడబో
ద్గమితశిఖానికాయ ఘనకాంతి యనం దనరారె సంధ్య త
త్సముదితధూమజాల మనఁజాలె నిరుల్ రవి దుంక లేచు తో
యమునను జిందు బిందువులయట్ల నభంబున భంబు లేర్పడెన్ ౪౩

చ॥ దిన మను గ్రీష్మమేగ జగతి న్నిశ నాఁగ ఘనాగమంబు దా
ర్కొనఁ గొనసాంధ్యరాగపుమెఱుంగు మెఱుంగుగ మబ్బు మబ్బుగాఁ
దనరఁ దదంబుదాంతరగతస్ఫుటమౌక్తికముల్ గ్రహించి య
య్యనిమిషరాశి రాశినిడి రా దివినాఁ దనరారెఁ దారకల్. ౪౪

కం॥ మఱియును దినపురుషుఁడు రే
విరిబోడింగూడమడికి విడుదురుమసిరుల్
దొరయ నిరుల్ నెరియుచునం
దొరయ విరులొప్పెలెఁ దారకోత్కర మలరెన్. ౪౫

కం॥ తారకములు గగనద్రుమ
సారకుసుమ సముదయ ప్రసారకములుగాఁ
దోరముగాఁ దచ్ఛాయా
కారముగాఁ దనరె నంధకారము ధరణిన్. ౪౬

కం॥ ఇనుఁ డపరాశం జనఁ గని
పని యేమని ముడిచెఁ గన్నె పద్మిని యట న
య్యినుఁ డపరాశం జనఁ గని
పని యేమని ముడుచకున్నె పద్మిని మొెచటన్. ౪౭

కం॥ దీపములు ప్రమితభావో
ద్దీపములు దనర్చె వసువుదే నినునకుఁగా

దేవల నల భువననిధిం
గేపులఁజను నల్ల తరణికిరణము లనఁగన్. ౪ర

చం॥ కలువలవిందు పాల్కడలికందు సుధారుచిచిందు కామికిన్
వలపులమందు బుట్టునను వారిధికన్యకు ముందు తొమ్మనం
గలిగినకందు తెల్లజిగి గట్టినబొందు కరాళిక్రందుగా
చలువలపొందు ముందొదవెఁ జందురుఁడందు సురేంద్రుదిక్కుగన్ ౪౯

కం॥ తుంగంబన సుధ దివియు సు
రంగంబన హృద్గతాభ్రరంగంబన సా
రంగంబన శశమన శశి
యంగంబున నంక మెనఁగె నసితాంకంబై ౫౦

కం॥ చదలీ కదళీదళముగ
బొదలీళశశశిగ దాని ప్రోదిసలుపు సం
పదలీను తండులమరీ
చదళీగతతారకాంకసంగతు లలరెన్. ౫౧

కం॥ బిరుసుందెలి పువ్వులనన్
సరసం దారకలు నెఱిసెఁ జంద్రజ్యోతిం
దొరసెం జం దజ్యోతియు
వరుసం దివి దివిజులుత్సవము సల్పిరనన్. ౫౨

వ॥ మఱియును ౫౩

సీ॥ విరహంపై వచ్చు మరుఁడు వట్టించిన
జయసమున్నతసితచ్ఛత్రమనఁగఁ

ప్రియుఁడుబ్బ నుబ్బిన వియదాపగాపయః
కల్లోలభవఫేనఖండమనఁగ
వెన్నెలయను పేరి వెలిగుడారంబుపై
నిలిపిన వజ్రాల కలశమనఁగ
రేమానినీమణి సీమంతసీమపైఁ
జూపట్టు ముత్తెలచక్క యనఁగ
నంచితకళంక సంచరచ్చంచరీక
తారకాకారకైరవోత్కరపరీత
గగనకాసారపుండరీకంబనంగ
సాంద్రరుచితోడ నడురేయిఁ జంద్రుఁడమరె. ౨౪

క్రొన్నెల జాడఁబుట్టి తెలిక్రొన్ననకాంతుల తోడఁదొట్టి రే
వెన్నెలగూడ పెట్టి జలువన్నెలరాలసరాల జాలురా
జిన్నెలఁజూడ ముట్టియల జిమ్మనజీకటిజూడ మొట్టియా
వెన్నెలలాడ మెట్టినటు విన్నలమెన్ మునుమన్నిలాస్థలిన్. ౨౫

దివియను సురగవి నమృతాం
శువనుంబొదుగుననుఁ బిదుక సొరిది నజాండం
బవుకుండ నిండు నవవిధ
సవిధపయఃపూర మనఁగఁ జంద్రికలలరెన్. ౨౬

క్రొన్నెలప్రముచ్చు జగంబుల
వన్నెల హరియింప నింపువగదెలిమచ్చుం
జిన్నెల నించిన సంచున
వెన్నెల రోదోంతరాళవీథుల నొలసెన్. ౨౭

వ॥ వెండియు నిజాధరసుధాదానవిధానాదుల సుమనోధనుఃకేళినారాధింప నధీనులగు మనోధవులచేత వివిధవిధంబులం బ్రసాధితలగు స్వాధీన పతికల ధమ్మిల్లమల్లికామాలికా ధావళ్యధాళధళ్యంబు ననుసంధింపు నిశాసమయంబులగుట నిజేశసమాగమాశల నావాసాదులకు విలాసంబు లొసంగు వాసకసజ్జికల సాలంకృతవిశదశయ్యావిసరంబు ననుస రింపుచు సంకేతనిశాంతంబులకుఁ గాంతులురామిం జింతింపం దెల్లనగు విరహోత్కంఠితల కపోలకాంతులతో మంతనంబొనర్పుచుఁ బతుల నవమతింబొమ్మని పదరి పిదపం బరితప్తలగు కలహాంతరితలను పచరించు నుచితోపచార చందనాదులరుచిం గోచరింపుచు సంకేత కుంజంబులకుంజని నాథవంచితలై స్తబ్ధచేతలగు విప్రలబ్ధలంగని లతాలతాంగులు నవ్వు నవ్వుగతి నివ్వటిల్లు పువ్వులతోఁ జివ్వ సేయుచుఁ బ్రాణేశులు దేశాంతర వాసులుగా సూనశరసంతప్తలగు ప్రోషితభర్తృ కల శరీరంబులకుఁ దాపశమనకరంబులగు బిసాదికంబులసిరులఁ గరంబొలయుచుఁ బరాంగనాపదాలక్త సక్తంబులగు వక్త్రంబులతోడం బఱతెంచు పతులం బ్రతీక్షించి ఖండితగతుల ఖండితసతులాదుండగంబు వారలకుందెలియఁజూపు హీరముకుర నికరంబు ననుకరింపుచు సఖీ సూచితలై యధీశుల నభిసరణంబుసలుపు శ్వేతాభిసారికల వసన భూషణాదివేషంబులఁ బోషణంబు గావింపుచు నఖండంబుగా నొండొండ మెండుకొను పండువెన్నెల లజాండభాండంబునఁ బాండుర తరంబులై ప్రసరించె నయ్యవసరంబున. ౫౮

అవ్వారిజారితోడుత
నవ్వారిజశరుఁడు పవనుఁ డవ్వల జైత్రుం
డవ్వారిగఁ దమిరేఁపఁగ
నవ్వారిజవదన తాళ కటఁగని నగుటన్. ౫౯

తనకును సమ్ముఖగతి నగు
చనవున హారికని మనోనుసారి యగునటం
చనియునుఁ గువలయబాంధవుఁ
దనియును మృగనయన యా మృగాంకునకనియెన్ఁ ౬౦

తెలుపవే యిట నాదు వలతేని చెలునుందు
చందమా యీశుతోఁ జందమామ
చక్రిదోడుకరమ్ము సహియింపఁగారాదు
మందమారుతధాటి చందమామ
మరుఁడు సాపత్న్యంబు నెఱపి నా మానాథు
పొందు మానఁగఁజాల చందమామ
విరహాంబునిధి గ్రాగ వెన్నెలల్ జమరింప
నందమా యిది నీకుఁ జందమామ

యమృతవారాశిగర్భంబునందుఁ బొడమి
రమణఁ దగు నిన్ను భక్తిఁ బున్నమల నోచు
నా చకోరేక్షణల నేఁతువంట గుణము
మందమా నీకు హిమధామ చందమామ. ౬౧

వ॥ అని యిట్లు చంద్రాదులం బ్రార్థింపుచుం బరితపించు చంచలాక్షి నీక్షించి ప్రియవయస్య లయ్యేడ. ౬౨

సీ॥ అంతరంగికుఁడ వీవని నమ్మియుండితే
దర్పక ! నీకింత దాడి తగునె
మును మోమెఱుంగుదీవని నమ్మియుండితే
సోమ ! నీకింత హెచ్చుటలు దగునె

ప్రాణబంధుండ వీవని నమ్మియుండితే
పవన ! నీకింత తీవ్రంబు దగునె
అనురాగతరుడ వీవని నమ్మియుండితే
చైత్ర ! నీకింత పక్షంబు దగునె

రతిసమాంగి చకోరాక్షి రంజితాంఘ
నాభవేణి పికీవాణి యైనయట్టి
యిట్టి సుకుమారిఁ బ్రోచక యేఁచఁదగునె
మీ రనుచుఁ జేరి నెచ్చెలుల్ పేరువాటి ౬౩

కం॥ మారా ! యిదె మేరా తగ
వేరాజనయి తి నేఁచనిల నుదయంబౌ
మా రామాఏణీయు సుమా
మా ధామామణి సుమాస్త్ర మాఱనకు మిఁకన్. ౬౪

కం॥ మారుండ ! నీకు నెవరు
న్మారుండరె నీదు మే మామ యొకండే
వీరండె హరుఁడు హరియును
వీరుండరె మిమ్ము నడుప వెస మది నణపన్. ౬౫

కం॥ ఇంచుక యాశుగమునకే
కొంచుచుఁ జని చలతనందు కుసుమాంగిపయిం
బంచాశుగములు బఱతురె
పంచాశుగభీతిఁ జెందఁ బంచాశుగముల్. ౬౬

గీ॥ అకట నీ మేనమామ గ్రహంబ యగుట
నగు నొకట నేఁచుట రతీశ ! యతనిఁ బోలి

నిధనగతి మారకుఁడవౌట నీకుఁ దగునె
తండ్రిఁ బోలి రక్షించుట దగునుఁగాక. ౬౭

కం॥ సితిగళుఁడు హరించినయెడఁ
బతి వేఁడ్కొని సతియ నిన్ను బ్రతికించినచో
సతులనె వేధించెద వీ
జతకుఁ గృతఘ్నుఁడవు కావె శంబరవైరీ ! ౬౮

కం॥ క్షితి మును హతునిగఁ జేసియు
బ్రతుకంగాఁజేసె నేలఁ బశుపతిసతికై
రతివర ! కృతాఘు నిను న్
సతివశులు నీశులగుట సహజము జగతిన్. ౬౯

చం॥ మలినతనంది నీ గుణము మాలల పొలగు నీ విజాతియో
బలమును నెక్కు దయ్యెడవిపాలగు నీదగు గంట్లవర్మమో
పెలుచకొనామొదల్ సెడియుఁ బిప్పికిఁబాలగు నీ జయాంకమో.
పలువల పొలుగాదె యిటు పాంథులబాధ యొనర్ప దర్పకా ! ౭౦

సీ॥ ఇది చక్రకటితటి యిట రాకు మకరాంక !
భీతిదంబగు నీదు బిరుదురీతి
కిది చంద్రబింబాస్య యిట రాకు నలినాస్త్ర !
సంకోచమొదవి నీ శరమువోవ
నిది చంపకసునాస యిట రాకు మధుపమౌ
ర్వీక ! నీగుణముల పీఁక సెడఁగ
నిది సాంకవామోద యిట రాకు శుకవాహ
యహహ ! నీ యెక్కుడుమహిమ దఱుఁగఁ

గంటి వింటి వజీర ముక్కంటివింటి
వంటి సిరులగు నీ మచ్చెకంటి సిరులు

మానకనూని మానినుల మానము నొంచితివౌర దక్షిణా
శానిల ! మందవృత్తులకు నక్కట భూరివిచారమున్నదే ! ౧౨

ఉ॥ హత్తుక ధూర్తుఁడౌ మదనుఁ డంచునుఁ బైఁగనకాఖ్యుఁ డెందును
న్మత్తుఁ డటంచుఁ బర్యయత మాతులుఁ దౌటను వచ్చెఁ జంద్రుఁడీ
విత్తతి రాక భీమగతి నేటికి మారుత ! ధర్మరాడ్ఢిశా
వృత్తినిఁ దండ్రిదౌ వరుస నెంచక మామనటంచు వచ్చితో. ౧౩

కం॥ అని చరదనిలుం దూఱుచు
ననుచరుఁడై శంబరారి కాసవకరుఁడై
వనచరుఁడై కాననపత
దనుచరుఁడై నట్టి మధున కనియె నయమునన్. ౧౪

గీ॥ ఘనతరుల డాసి సుమనోవికాసివగుచు
సురభిచరితంబు గైకొని సరసగతిని
నురుతరస్ఫూర్తి నొందు నో వసంత !
వనవిహృతి పాంథవేధ నీ కనఘ ! తగునె. ౧౫

ఉ॥ ఈ వనలక్ష్మి నీవెనయ నిందుఁడు నీకలపిందుఁడయ్యెనో
నీవలనం జనించుటను నీకగుమారుఁడు మారుఁడయ్యెనో
భావనధర్మపద్ధతిని బాంధవుఁ డయ్యెనొ మారుతంబు లే
కీవిధి వీరి మైత్రి గ్రహియించెనె విచారివి నీవు మాధవా ! ౧౬

కం॥ కూడి ప్రద్యుమ్నుతోడఁ దద్గుణము గనియు
గంధవహయుక్తిఁ జాపల్యకలన గనియు
రాజసహితత వికృతినేర్పడితి మధుఁడ
యల రజోవ్యాప్తి తగువారినైనఁ జెఱచు. ౧౭

గీ॥ పల్లవస్థితి ననురాగపరత నెసఁగి
కడులతాంగుల కుసుమసాంగత్యమెనసి
మధుసమాఖ్యలోనగు జాతివిధుర నీవు
మాననేర్తువె మానినీమానహృతిని. ౧౪

కం॥ మధుకరవృతిచే సుమతతి
మధు వొనరింపుచును మఱియు మదనుననుగవౌ
మధుఁడవు పురుషశ్రేష్ఠుల
మధురోష్ఠుల మది గరంచు మతి నీకరుదే ! ౧౫

క్య॥ శారికమా ! కలహంసకి
శోరకమా ! పికమ ! కిసలచోరకమా యో
కీరకమా ! భ్రమరకమా
మీఱక మా సకియ తరమె మీరకమానన్. ౧౦

కం॥ అని చైత్రాదుల నద్వగ
జనచైత్రుల దూఱు వారు సన్నిధి గనున
ట్లనురాగగతినిఁ దోచిన
ఘనరాగనిమగ్న యగుచుఁ గామిని యంతన్. ౧౧

కం॥ కీరమ్మునకున్ గూయిడు
శారమ్మునకుం బికోక్తిసారమ్మునకుం
గ్రూరమ్మగు మరుని శరా
సారమ్మున కలికి కలికి సైరణలేమిన్. ౧౨

కం॥ వెన్నెలచిచ్చున మారుని
క్రొన్ననగచ్చున విరాళిగొని వెలవెలనై

కన్నియ పరవశగా న
య్యన్నులు తన్నారిఁ జేరి యాదరణమునన్. ౯౩

కం॥ ఈ మానినిలో మానని
యా మానసజార్తి మాన నేమాడ్కి శమం
బే మందునఁ బొందింతుము
నే మందల మని విచారనిహితాశయలై. ౯౪

సీ॥ కందర్పరసమునఁ గలికి కూష్మము హెచ్చె
నష్టమూర్తహితాప్తి నందరమ్మ
చంద్రోదయమటన్న సతికిఁ గాఁక యెసంగె
మార్తాండయోగాశ మనుపరమ్మ
నవమాలినీవసంతమున శాంతిల దింతి
మధుసూదననియుక్తి మనుపరమ్మ
శీతప్రభంజనస్థితి లతాంగి చలించె
వాతభంజినిఁ గూర్పవలవరమ్మ

సతియు భావభవాతంకశంకఁ బూన
స్నేహగతిఁ గాఁచ నెవ్వారిచేత నోపు
నచ్యుతానంత గోవింద యని తలంచి
చేరి భవరోగవైద్యు భజింపరమ్మ. ౯౫

వ॥ మఱియును ౯౬

చ॥ మదవతికిన్ మధుస్థితి హిమద్యుతిభంగియు మోహదంబెకా
మదనుని బీజ మట్టిదయ మాటికి వీటికి గంధవాహవృ
ద్ధిదగి మతిభ్రమవ్యథనుఁ దెల్ప విషంబుగ నాభిగన్నెరల్
మొదలగువానిఁ బూన్పుటలు మోసమ యీ తిలసూచనాసకున్. ౯౭

వ॥ అని తలంచి యంత ౯౮

చ॥ చివురు లరంటి జంటిపొరచిప్పలు పుప్పొడి తెప్పలెన్నఁ బొ
న్నవిరులు శైవలంబు సుమనఃస్తబకంబులు పద్మనాళముల్
నవళశిఖండపాళి నళినంబును గల్వలు చల్వ లీయన
య్యువిదకు సంగసంగతుల యోగ్యగతిన్ ఘటియించి రంగనల్. ౯౯

గీ॥ అటుల ననుఁగుకాంత కనుచారికలు గొంత
శీతలములు గూర్చి సేదఁదేర్చి
యుపచరింపఁ దేఱి యొకదారి మరుబారి
నందు నిందువదన కనిరి సఖులు. ౧౦౦

సీ॥ మకరకేతనుఁడన్న మదిఁ బెట్టనేటికే
మకరభేదనుఁడుండ మధురవాణి
క్షణదాచరుఁడటన్నఁ గడుఁగలం కేటికే
క్షణదాటహరుఁడుండ జలదవేణి
చటులానిలమటన్నఁ జలియింపనేటికే
చక్రినామకుఁడుండ జలజపాణి
మధుసమయంబన్న మఱి భ్రాంతి యేటికే
యల మధుద్వేషుఁడుండ నలరుఁబోణి
సుకరశుకపిక శారికానికరముఖవి
హాయసములన్న వ్యర్థప్రయాస మేల
పతగనాథాంకుఁడుండ లోఁబడక యున్నె
విభునిఁ బ్రార్థింపు మిందిరావిభుని శుభుని. ౧౦౧

ఉ॥ ఆ హరికిం గుమారుఁడగు నంగన మారుఁడు చంద్రుఁడందమా
యా హరి చిత్తవృత్తిదగు నా హరి ప్రాణహితంబు మారుతం

బాహరికిన్ వసంతుఁడు శుభాంగవిభూతి నెసంగువాఁడు నేఁ
డాహరి ప్రేమ గల్గ శయమందఁగనేటికి నిన్నుబోఁటికిన్. ౧౦౨

కం॥ అని చెలులాడు ప్రియోక్తులఁ
దనదు ప్రియోక్తులును దోపఁ దరుణి ముదితగా
మన శుక మినసుకరాగతిఁ
గని వచ్చు నటంచు మఱియుఁ గామినులనుచోన్. ౧౦౩

చ॥ తెలతెలవారవచ్చె శశితేకువలేకువగాంచి తారకల్
వెలవెలఁబార విచ్చెఁ దగుపీక్షలఁ బక్షులు వృక్షశాఖలం
బిలపిలఁజేరఁజొచ్చె రవిబింకము పొంకము నంకురింపఁగాఁ
గలకఁ లూర హెచ్చె జిగికమ్మలు తమ్మల కిచ్చె న త్తఱిన్. ౧౦౪

వ॥ అంత ౧౦౫

సీ॥ ఉభయదిక్కాంతాముఖోదారకర్పూర
కాశ్మీరతిలకపంకంబు లనఁగ
శైలద్వయీసాను సంకీర్ణపున్నాగ
కంకేళిసుమగుచ్ఛకంబు లనఁగ
నుత్తుంగనగశృంగయుగళీమిళచ్ఛిలా
ధాతుగైరికపళత్కాంతులనఁగ
సమయాధికారిపార్శ్వద్వంద్వసందీప్త
ధవళారుణాతపత్రంబు లనఁగ
నాథసమ్ముఖలగు వరుణాని శచియుఁ
గీలుగంటుల వజ్రాల కెంపుటాలఁ
బేర్చి తార్చిన రేకడబిళ్ళలనఁగ
నస్తగిరిఁ జంద్రుఁ డుదయాద్రి నర్కుఁ డలరె. ౧౦౬

కం॥ గగనాబ్ధి నడఁగు బుగ్గల
పగిది నుడుల్ సడలె దిశలు ప్రతిభాదశలం

దగియెఁ బ్రసరించె శిశిరా
ళగములు కోకముల కెసఁగె సుఖపాకంబుల్. ౧౦౭

సీ॥ నిడుదకన్నుల నింపు నిద్రమంపులు మీఱఁ
బలుగెఱల్ మోవుల పచ్చిదేఱ
పీడినతురుముల విరిసరంబులు జాఱ
మేతావిచెమట క్రొమ్మినిమి యాఱఁ
దడఁబడునడల తత్తరము బిత్తరమూఱ
నెదలపైఁ గదలి పయ్యెదలు జాఱ
సురతంపుచిన్నెల సొంపులు వెలిపాఱ
మోముల బడలికల్ ముద్దుగాఱ
నప్పు డెవ్వరు సూతురో యను రయమునఁ
బట్టి సీరొల్కు చేగిండ్లుబడక యిండ్లు
వెడలివచ్చు విలాసినీతతి చూడ
ముచ్చటలొనర్చె రసికసమూహమునకు. ౧౦౮

వ॥ అంత ౧౦౯

కం॥ ఆవేళకు సకులా రా
జీవాక్షి యొకింతఁ దెలిపిఁ జెందిన మనకీ
దేవుఁ డినుండే హరి యని
భావించిరి మఱియు భద్రభావము గనుచున్. ౧౧౦

సీ॥ చెలి ననంగుఁడు దనవలెఁ జేయఁదలఁచెనో
యంతంతఁ గృశమయ్యె నంగలతిక
సతి సితాంశుఁడు నిజస్థితి జేయఁదలఁచెనో
ప్రబలె బంగరుమేనఁ బాండిమంబు

అనిలుఁ డంగనఁ దనయటు జేయఁదలఁచెనో
తెరువనక కెందేనిఁ దిరుగఁగోరు
మధు వాత్మవృత్తి ఖామనుఁ జేయఁదలఁచెనో
మదిలోన నేవేళ మఱపు హెచ్చె

వనవిహగరాజి సకిఁ దమవలెను జేయఁ
దలచెనో వనవాంఛ లోఁదలఁచు ననుచుఁ
గేళివనకేళి వలయుఁగాఁబోలు ననుచు
వనిత నెచ్చెలు లమ్మ రమ్మనుచుఁ బ్రీతి. ౧౧౧

చ॥ జిలుగుపయంట నంటి వలఁజిక్కిన జక్కవదంటనా విభా
సిల గుళిళించు నున్బసపు సిబ్బపు నిబ్బపు టుబ్బుగబ్బి గు
బ్బల పెనుముమ్మరమ్మునకు బాళికిఁ జాలక కౌనిటట్టు బి
ట్టులికిపడన్ వడంకఁజను నుగ్మలిఁ దోడ్కొనిపోయి రయ్యెడన్. ౧౧౨

వ॥ ఇట్లు చని యవ్వనిత లనితరప్రచారంబగు నవ్వనసంచారంబున సతులగుటఁ దమకు వనదేవత లాచరించు నుచితోపచారంబుల గతుల నతులలతాప్రతాననీవితానంబులు వినూతన నికేతనంబులునుఁ గుసుమ విశేష విశీర్ణధరాగతసరాగ పరాగంబులు నూత్నంబులగు రత్న కంబళంబులును, మరుత్పరంపరలందరలు కప్పురంపుఁదెరలు దెరలును, నుపరితలపరీత ప్రసూనసంతానంబు వితానంబును, సమీప దీపిత నీపకళికలు దీపకళికలును, పరిసరస్యందిమరందరసప్రవసారంబు పాద్య నీరంబును, పాటలకుటజకుట్మలావళిత పత్రపుటపాత్రిక లారాత్రికలును, పరిపాకపతిత శశికాంతఫల కాంతరఫలనికాయంబు లుపాయనంబులును, శుకముఖశకుంతకలకలంబు వందిబృందాకలనం బుగా నృపభవనంబు ననుకరించుచు నుపవనంబున విహరించు ౧౧౩

సీ॥ మాధవస్థితి యిది మాధవస్థితి యని
కలిసి వర్తిలు నొక్క కలికికొమ్మ
మాకందములు నివి మా కందము లటంచుఁ
గ్రీడించు మఱియొక కీరవాణి
మాధవళంబిది మాధవళ మటంచుఁ
బాడుచుఁ జను నొక్క భ్రమరచికుర
నారంగములు నివి నా రంగములటంచు
నాడు వేఱొక మయూరాభవేణి

మదను భావమునకు దాపు మరువమిదియు
మదనుభావమునకు దాపు మరువ మనుచు
నొక్క కలకంఠి యాస్వాద మొనరఁజేయుఁ
జెలులు విహరించుతఱి వనస్థలముఁ జేరి. ౧౧౪

మ॥ తమ బింబాధరసామ్య మొందు ననుచున్ ద్రాక్షాఫలచ్ఛాయలం
దమ వక్షోజసమంబులౌననుచు నంతం బాఱి జంబీరముల్
దమ చంచచ్చుబుకాప్తి నందుననుచందాలన్ రసాలంబులన్
రమణుల్ గోసిరి లో సహింపని మనోరాగంబు వే కన్పడన్. ౧౧౫

చ॥ సుకరగృహీతకాండమయి సొంపుగఁ బల్లవపాళి కొమ్మకొ
మ్మకు ఘటియింపసాగి ధృతిమై నలరందగి యంతటన్ ఫల
ప్రకరము నందుచుం జెలువు రంజిల నొక్క రసాలశాఖికై
యొక లతకూన దా సుఖనియుక్తిఁ జివుక్కునఁ బ్రాకె నత్తఱిన్. ౧౧౬

కం॥ సతులు విలాసకళారస
వతులు కుసుమతతులు గోసి వనసంగతులం
బతికై శరములు గొనియెడి
రతులో యన వెలసి రతనురమ్యాకృతలై. ౧౧౭

కం॥ ఖేలనమున సతులు లతాం
దోళనమున నెగయ సురవధూటులతోడన్
హేళనమునఁ దగఁ బదయు
గ్మాలనమునఁ గయ్యమునకుఁ గాల్చాచుగతిన్. ౧౧౮

వ॥ అంత ౧౧౯

సీ॥ పదముః నంటకు ముదిత యశోకంబుఁ
దిలకించి చూడకు తిలక మతివ
చేరి భాషింపకు చెలి కర్ణికారంబు
సింధువారము నిశ్శ్వసించ కబల
బాలరసాలంబుఁ గేల నంటగరాకు
నాతిరో సురపొన్న నవ్వఁబోకు
కలికి గండూషింపఁగవయకు వకుళంబు
కూర్పకు సందిటఁ గురవకంబు
చారయిది పాటఁబాడకు చంపకమిది
సఖిముఖం బెత్త కీవిట్టు సలిపితేని
తోనవిప్రసూనములొసంగు సూనశరుఁడు
బాణముల జేయునవె నిన్ను బాధసేయు. ౧౨౦

గీ॥ అనుచు నెచ్చెలి కెఱిగించి యటఁ జరించి
శయతతుల నేర్చి పుష్పాపచయ మొనర్చి
చెలువ లొకమంచి చల్లని కొలను గాంచి
యచటి కేతెంచి క్రీడింప నభిలషించి. ౧౨౧

కం॥ సారసముఖభావంబుల
సారసముఖు లపుడు కేళి సలిపిరి తత్కా
సారమునను లసదమృతా
సారమునను సరసతరవిసారమున నొగిన్. ౧౨౨

గీ॥ ఆ భువనకల్పితక్రీడ నబ్జభవవి
కాసములు కేళవేళనంగతులఁ దగియె
నాభువనకల్పితక్రీడ నబ్జభవవి
కాసములు కేళవేళనంగతులఁ దగవె. ౧౨౩

కం॥ జలములు గ్రహించి మించిన
జలదములనఁ గొప్ప లచటి చంచలలన వా
రళికఫలకముల నలఁదిన
హాలదీనవదీప్తు లలరె నా జలకేళిన్. ౧౨౪

సీ॥ చికురశైవాలంబు సుకరాక్షిమీనంబు
వదనపాణిపదాంకవారిజంబు
గళశంఖ మధరకోకనదప్రభాస్ఫూర్తి
రదమౌక్తికము భుజారసికబిసము
స్తనరథాంగము కటిసైకతంబు వళీత
రంగంబు నాభికాభ్రమము రోమ
రాజిక్రమేందీవరము నూరువారిభ
కరము జానువరాటికాతలంబు
ప్రపదకమఠంబు గుల్ఫనీవారగర్భ
సురుచిరముగ నలంకారనిరతి నెఱపు
లీల నేకీభవింపుచుఁ గేళి సలిపె
సరసుల నెసంగి పద్మినీసముదయంబు. ౧౨౫

కం॥ అంబరవలగ్ను లంతట
నంబరములు కటి ఘటించి యట విమలవిభా
డంబరములఁ బులుగడిగిన
శంబరహరు శరములన నెసంగుచు మఱియున్ ౧౨౬

కం॥ మనమొక దేవునిఁ గొలుతమె
వనితా! యన నా లతాంగి వారలతోడన్
మనకొక దేవుఁడు గలఁడే
మనసిజజనకుండె కాక మాన్యుండనినన్. ౧౨౭

కం॥ లాలసమున మృదులాలస
బా సమీ ముల దోడుపడఁ గేళివసిన్
బాలికను నిలిపి వలపుల
మూలమగు రసాలసాలమూలపితర్లిన్. ౧౨౮

సీ॥ హరి యని శౌరి సంప్రార్థింత మందమా
యది సమీరుని నామ మతివలార
యల విధుండని శౌరి నర్చింత మందమా
యది నిశాపతినామ మతివలార
ప్రద్యుమ్నుఁడని శౌరిఁ బలుకుద మందమా
యది మన్మథుని నామ మతివలార
మాధవుండని శౌరి మది నెంతమందమా
యది వసంతుని నామ మతివలార

కాన ఫణిశాయిని నిశాటమానమథను
మదనహరసఖు మధువైరి మహి గణించి
యంచితస్థితిఁ గాంచి సేవించినంత
వీరి మదములు వదలు వేర్వేఱ ననుచు. ౧౨౯

ఉ॥ శ్రీరమణీయతం దనరి క్షీరపయోనిధిఁ బోని యొక్క కా
సారవిలాససీమ సితసైకతమై తెలిదీవిఁబోని వి
స్తారసమేతశీతసికతామయవేదిక దివ్యకల్ప మం
దారతరుప్రతానసుమనః కమనీయత బొల్చునొక్కచోన్. ౧౩౦

కం॥ మణిగణకిరణగుణారుణ
ఫణిభోగవణాళి నెనయు ప్రసవాస్తరణాం
గణమునఁ దృణఘృణియుతమగు
శణహరిణమృణాళనాళచత్వరవసతిన్ ౧౩౧

కం॥ జోకం గొజ్జగిసీటం
జేకొని పుష్పొడియరుంగు జేసి యచట నా
శ్రీకాంతుని నొక తామర
రేకున లిఖియించి కస్తురింజలి చెలియల్. ౧౩౨

గీ॥ హరికి దాపల శ్రీదేవి నావహించి
చేరువ లిఖించి వారి కుమారు మారు
సరతిఁ బూజింపఁ గమ్మఁదెమ్మెరలు వీవ
ఝల్లరని క్రొవ్విరులు రాల సకియ లలరి ౧౩౩

కం॥ హరి పువ్వులు రాల్చెఁగదే
పరఁగు శుభంబింక మనకు బాలిక యనుచో
నరుదెంచి దివ్యకీరము
పరమానందంబుతోడ భద్రకు ననియెన్. ౧౩౪

కం॥ పీ కథ సువసువ విని తాఁ
గేకయనాథుండు దృష్టకేతుఁడు నాతో
నో కాంతా! యిఁతక ము
న్నేకాంతముగాక పలికె నింతి వినంగన్. ౧౩౫

కం॥ ప్రాయపుసిరి మన భద్రా
తోయజముఖియందు వింత దోచెను సరిగా
నాయిక కనురూపంబగు
నాయకు నేర్పఱుపు కీరనాయక! యనుచున్ ౧౩౬

వ॥ అనిన నేనునుం గొంత విమర్శించినట్లుంటి యిట్లంటి. ౧౩౭

మ॥ ధరణీనాయక ! నాయకుండన యదూత్తంసంబె కాకన్యులె
వ్వరు మీరక్కమలాంశఁ గాంచనగునవ్వాల్గంటికిం గంటికిం
గర మానందమొసంగుఁ జూడ హరి శృంగారాంగముందుల్య మి
ర్వ్వరకున్నేనునుఁ జూచినాడ హరి మీరుంజూచినారే కదా ! ౧౩౮

కం॥ చతురతయు గభీరతయున్
ధృతియు మతియుఁ గులము బలము హితమున్నతమున్
రతిపతిఁ గేరు నొయారము
పతగధ్వజునందెకాక పరులకుఁ గలవే. ౧౩౯

చ॥ అది యటులుండెఁ జుట్టరికమా కడు దగ్గర లాఁతిజాగగా
దది వసుదేవుచెల్లెలు గదా శ్రుతకీర్తి భవద్వధూటి యి
మ్మదవతి మేనయత్త వనమాలికిఁ గావున మీర లిర్వురున్
ముదమునఁ గన్న కన్నియను ముఖ్యము శౌరికొసంగ భూవరా !౧౪౦

కం॥ మీ కేయరిగలఁడాతఁడు
మీ కేయరిబెట్టు చక్రిమిత్రత నదియుం
గాక మదిఁ దెలిసి చూచిన
నా కన్నియ కతనియంద యాసక్తి సుమీ ! ౧౪౧

గీ॥ మఱియుఁ గోరుచుండు మనభద్రమదిగదా
మాధవునకెనైన మంచిమగని
మఱియు గోరుచుండు మనభద్రమదిగదా
మాధవుండ కలుగ మంచిమగఁడు. ౧౪౨

కం॥ అన నృపుఁడనియెన్ హరి నే
వనిత వలచు నదియ మనకు వాంఛితమైనన్

వినఁగా నిది నృపధర్మం
బనఁగాఁ జాదింత మిల స్వయంవర మనఘా ! ౧౪౩

కం॥ అనినన్ మీ జననియు నే
ననుమోదిల్లితిమి నీకు నాశుభవార్తల్
వినిపింపవచ్చితన న
వ్వనితయుఁ బ్రీతిల్లి నిజనివాసముఁ జేరెన్. ౧౪౪

ఉ॥ అంతటఁ గేకయక్షితితలామరభర్త సువార్తగా జగం
బంతయు సంతసిల్లఁగ నిజాత్మజకైన స్వయంవరోత్సవం
బెంతయుఁ జాట సర్వధరణీశకుమార సభాంతరాళికిం
బ్రాంతజనాళిఁ బంచి చతురంతపరీతధరిత్రి నంతటన్. ౧౪౫

చ॥ పురము నలంకరించి తగు భూషణముల్ వసనంబులుండఁగా
నిరవుల నన్నపానముల నిష్టపదార్థము లెంతయే సుగం
ధరసము నాగవాసములు ద్రవ్య మనేకము వాద్యభేదముల్
దిరములుగా నొకొక్క విడిదిం బతి బూనిచె వచ్చువారికిన్. ౧౪౬

చం॥ పఱపుగఁ దోచు నొక్కపురబాహ్యతలోపవనాంతరంబునం
దిరుదెస జాలువాఱ పనులెంతయు వింతలుగా వెదల్పునై
కుఱుచలుగాక సొంపులొనఁగూడఁగ మంచెలు బూన్చె రాజు త
త్పరత స్వయంవరోచిత నృపాలకుమారులు కొల్వు గూడఁగన్. ౧౪౭

వ॥ ఇట్లనేకవిధంబులం గేకయేంద్రుండు నిజనందనోచిత
స్వయంవర మహోత్సవం బొనరించుచుం దత్సమయంబున. ౧౪౮

కం॥ ఆ రీతి వార్త లనిచిన
నా రాజసుతాస్వయంవరార్థము సకల

క్ష్మారమణకుమారకు లటఁ
జేరిరి కడు వింతవింతశృంగారములన్. ౧౪౯

కం॥ బంధులు ప్రియబంధులు నయ
సంధులు బహుసుగుణరత్నచయ సింధులు సం
బంధులగు దేశదేశపు
సంధులఁ గల రాజసుతులు సనుదేఱంగన్. ౧౫౦

గీ॥ లేమ కుంతిచెల్లెలి తనూజయౌటను
వావిగనియుఁ గేకయావనీశు
వరుస దగునటంచు నిరిమదంబున దుష్ట
యుక్తి వచ్చె నా సుయోధనుండు. ౧౫౧

వ॥ తదనంతరంబున ౧౫౨

చం॥ హరిఁ గనుఁగొన్నకన్యకయు నన్యులఁగోర దవశ్యమా స్వయం
వరమున కమ్మురారియును వచ్చును మేనమఱందలీ సుధా
ధర తన కౌనటంచుఁ దమ తల్లికిఁ జెల్లెలిబిడ్డయైన సో
దరివిభవంబుఁ జూడఁజనెఁ దమ్ములతోడుత ధర్మనూతియున్. ౧౫౩

ఉ॥ వచ్చినరాజులందు బలవంతుఁడు రూపరి కౌరవేశ్వరుం
డిచ్చ వరించు నాన్నపతినే చెలి యంచు మనంబునందుఁ బె
న్మచ్చటఁ దల్లి చెల్లెలితనూజ వివాహశుభంబుఁ జూడగా
వచ్చిరి దంతవక్త్రుఁడు నవార్యగతిన్ శిశుపాలుఁ డెంతయున్. ౧౫౪

కం॥ అందధికులు కురుపతియు ము
కుందుం డిందొకరి సకియ గోరు ననుమదిన్
విందాను విందు లరిగిరి
విందగు మాతృష్వసేయి విభవముఁ జూడన్. ౧౫౫

ఉ॥ ధీరుల నుగ్రసేనవసుదేవుల మాధవుఁడాదియౌ యదు
క్ష్మారమణాగ్రగణ్యులను మఱిప్రియబంధులఁ దోడితెమ్మనం
గీరము సేరి ద్వారవతిఁ గేకయుపంపు నెఱుంగఁజేసినన్
శౌరియు వృష్ణిభోజయదు సంతతిరాజుల కేర్పరించినన్. ౧౫౬

కం॥ హరి కా సతిపై మతిగల
వెర వెఱుఁగుట బంధుమిత్రవిధములను స్వయం
వరణేచ్ఛ దక్కి వచ్చిరి
హరితోడం గొలిచి యాదవాదినరేంద్రుల్. ౧౫౭

కం॥ అపు డాగతి విపులాకృతి
నృపు లాదృతి నేఁగుదేఱ నెదురుకొని కృత
స్వపురావృతిగాఁ గేకయ
విపులాపతి వారి నునిచి వేర్వేఱనంతన్. ౧౫౮

కం॥ మంచెలపై నృపనందన
పంచాస్త్రులనుంచి మఱియు బంధుజనుల క
య్యెంచుల నుచ్చస్థలులీ
క్షింప నియోగించి దృష్టకేతుఁడు ప్రీతిన్ ౧౫౯

కం॥ మెఱుఁగునకు మెఱుఁగుబెట్టిన
నికితనయం గ్రొత్త క్రొత్త శృంగారములం
బరగించి కేకయేంద్రుఁడు
కరుణారస మొలుకఁ జిలుకఁ గని యిట్లనియెన్. ౧౬౦

చ॥ అతిసుకృతోచితస్థలమునందు శుకద్విజజన్మ మంది భా
రతికడ వృద్ధిఁబొంది మఱి బ్రహ్మకడం గళలెల్లఁ జెంది య
చ్యుతుకృపఁ బేరునొంది సుగుణోన్నతిఁగన్న వివేకి పీవు మ
త్సుతకు హితుండవౌట శుభసూచితభాగ్యముగా ఖగాగ్రణీ ! ౧౬౧

కం॥ కావున మా వనజానన
కీ వనధిపరీతభూతలేశకుమార
శ్రీవిభవనామరూప
ప్రావీణ్యము లేర్పరింపు పతగకులేంద్రా ! ౧౬౨

గీ॥ అని నృపతి పల్క రాచిల్క నెనరుఁ జిల్క
మోముపై నవ్వు దొలఁక సమ్మోదపులక
తిలకితాంగంబుతోఁ జాల ధీవిశాల
ఫణితి సతిఁ గాంచి యిట్లనుఁ బ్రౌఢి మించి. ౧౬౩

కం॥ పురుషోత్తముఁడై సముఁడై
సరసుండై మరునిగురుఁడె సరి చెలువమునన్
ధర నీ విభుఁడనఁగాఁ దగి
గుఱియగు మంచివరు నేఱుకొమ్మా కొమ్మా ! ౧౬౪

కం॥ ఒకమాఱు రెండుమాఱులు
సకియ ! కలయవెదకి నీకు సరివచ్చిన శూ
రకుమారకుమెడ నిడు మని
శుక మొసఁగెం బారిజాతసుమహారంబున్. ౧౬౫

కం॥ అది మును హరి తనకొసఁగిన
యది గావున ముదిత ముదితయయ్యెను శుకమా
సుదతిని రథమున నిడుకొని
సదయత నృపసుతులఁజేరఁ జనుటయు నంతన్. ౧౬౬

కం॥ భద్రగతి నృపులు గాంచిరి
భద్రన్ మృదుగమనవిజితభద్రం దనుహా
రిద్రన్ హరిలక్షితహృ
న్ముద్రం బరిపూర్ణగుణసముద్ర ననిద్రన్. ౧౬౭

వ॥ ఇట్లు కనుంగొని తమ మనంబుల ౧౬౮

కం॥ నక్షత్రపుఁదునుకో తను
సాక్షాన్మోహినియొ మరుని సామ్రాజ్యకళా
నిక్షేపమొ లేక మనో
విక్షేపమొ కాక యిట్టి వెలఁదుక గలదే! ౧౬౯

కం॥ అనుచున్ రాసుతు లా సతిఁ
గనుచుం దమిఁ బెనుచు కోరికల వివశములొ
మనసుల నొకరీతి ధృతిన్
మనుచుచు నిట్లుండి రంత మది ముద మొదవన్. ౧౭౦

సీ॥ వలపైనదానిఁ గల్వలతేని వలతేని
కులమానినుల నవ్వు చెలువుదానిఁ
గుదురైనదాని నిగ్గులపెంపుగల కెంపు
బలుసొంపుగల మోవికలిమిదాని
నొఱపైనదానిఁ దొల్కరిమించు సరిమించు
సిరిసంచుగను మేనిమెఱుఁగుదాని
సొగసైనదాని మెచ్చులఁ దొల్కుఁ నెలతళ్కు
గళఁజిల్కు నగుమోముతెలివిదాని
మొలకనవ్వులదానిఁ జెన్నొలయు గబ్బి
గుబ్బపాలిండ్లగవ నీటు గులుకుదాని
రూపయౌవనములతీపుఁ జూపుదానిఁ
గేకయకుమారి భద్ర నీక్షించె శౌరి. ౧౭౧

కం॥ శుకము వచించుటకన్నన్
సుకరంబగు చిత్రపటముఁ జూచుటకన్నన్

శుకవాణిఁ గాంచి కనకాం
శుకుఁ డెంతయు నెమ్మనంబు సోద్యము నొందన్. ౧౭౨

చం॥ మలయు ప్రమోదమూరి పలుమాటిటు గూరిమి మోముదారియా
కలికికి వారిజారియనుకారి కుచప్రకటారి ప్రాయపుం
గలిమి కొటారిదేకద జగాజిగిపైడిపెటారి మారు చే
నలరుకటారి యంచు శకటారి నుతించు మిటారి మించుగన్. ౧౭౩

కం॥ అవురా యనుఁ గ్రొమ్మెఱుఁగుల
నవురా యను మేనితళుకు నవురా తొవరా
నవురా యను ముఖరుచి వా
నవురాయను నెఱుల సిరుల నవరణ సతికిన్. ౧౭౪

కం॥ చిలుకో పరువపుమరువపు
మొలకో మరుచేతిపూవుములికో మెఱుగుం
దళుకో జీవపుఁజిత్తరు
పలుకో యీ కలికిఁ దెలియఁబలుకం దరమే! ౧౭౫

కం॥ చికురములా హరినీలపు
నికరము లా యింపుసొంపు నింపు ముఖరమా
ముకురమ రదనాంశుకమా
శుక మాసింపనగు ఫలము సుమ్మీ చెలికిన్. ౧౭౬

గీ॥ ఈ సునాస జిగింబై డిజేసునాస
యీసురాగ కుచోన్నతియేసురాగ
మీసుమాలిని నఖపాళియాసుమాలి
యీసువాసిని మోమిందుటో సువాసి. ౧౭౭

కం॥ గిండ్లో సంపఁగి పూవుల
చెండ్లో మరుచేతి పుట్టచెండ్లో వలపౌ
నిండ్లో పసినిమ్మపంగా
పండ్లో తెలియంగ బాల పాలిండ్లు భళీ! ౧౭౮

చం॥ పగలొగిఁగాంచి తావికలభావము గైకొనెఁ గైరవంబు రా
జగతిని హెచ్చఁబూని జలజాతము గుందె విశేషమైన లీ
లఁ గనఁగఁబూని మీన మవలం జనె నీ సతి నేత్రసన్నిధిం
దగునె సుదృక్స్వమాప్తిఁ గుముదంబునుఁ బంకజమున్ విసారమున్ ౧౭౯

కం॥ సుదతీరుచిరాధరమా
సుధతీరు సుమా శుభాంగశుకరతఁ గను నా
మదనాగమసంపద యీ
మదనాగమనోజ్ఞయానమై సిరి దలపన్. ౧౮౦

గీ॥ ఇందునందుఁగందు పొందమ్మి విరియందు
ముందుముందు రజము ముకురమందుఁ
జెందు కసటుమందమంద మేమందమీ
మందగమన మోమునందు సమము. ౧౮౧

ఉ॥ కొనునకొ నఖంబు సరి కావిజగావిలసిల్లు మోవికిం
పానఁగఁ బానకంబు సమమానన మా ననవిల్తుమేనమా
మేననమేననంగనక మేననమీనన కన్గవందగున్
వేనలి వేనలిన్ విరులవేయుసువే యువతీమతల్లికిన్. ౧౮౨

సీ॥ దొరసెఁబో యీ చాన గురుకుచద్వయమాన
రైవతకాద్రి దర్శనఫలంబు
నెనసెఁబో యీ రామ తనులత నంటఁగా
నారామలతలఁ జేనంటుఫలము

నలరెఁటో యీ బాల యధరంపురుచిఁ గ్రోల
సహకారఫలరసాస్వాదఫలము
కలిగెఁటో యీ కల్కి పలుకులాకర్ణింపఁ
జిలుకతో గోష్ఠిఁజేసిన ఫలంబు
తనరెఁటో దీని పరిణయోత్సవ మొనర్పఁ
దరుతతి కొనర్చు పరిణయోత్సవఫలంబు
మంచి శుభసూచకములు ఫలించకున్నె
యంచచేజేతనంచు వర్ణించి శౌరి. ౧౮౩

కం॥ చిలుక కొరులు నేర్పిన పలు
కలరి వినం బ్రియమొనర్చునట యీ చెలి కా
చిలుకే నేర్పినదట యా
పలుకులు వినఁ బ్రియము గాదె పలుమఱు జగతిన్. ౧౮౪

కం॥ అని మాధవుఁ డీవిధమునఁ
దన భావమువన్ గణించి తరుణిం గరుణిం
చినతీవిం గను వావిం
దన దేవిం గాఁగనెంచెఁ దగ నాలోనన్. ౧౮౫

వ॥ అంతఁ దనంత శుకశకుంతంబు విదితవృత్తాంతంబయ్యునుం గొంత వాగ్వినోదంబు సలిపెదంగదా యని యా రాజతనూజకు నా రాజ తనూజుల యనురూపరూపనామవిభవంబులు వేఱువేఱ నేఱుపఱుపం దలంచి యుత్సాహంబుతో నిట్లనియె. ౧౮౬

సీ॥ కాశకరూశకురూశరాజులు వీర
లాశాంతవిఖ్యాతి నలరువారు
మాళవమాగధమత్స్యరాజులు వీర
లాదిమాభ్యుదయంబు నమరువారు

చోళనేపాళబంగాళరాజులు వీరు
పృథులశేఖరరూఢిఁ బెనుచువారు
గాంధారగజపతి గౌళరాజులు వీర
లసమాగ్రగస్ఫూర్తి నెసఁగువారు
శూరసేనసురాష్ట్రసువీరసుబల
సుప్రసిద్ధప్రభావయశోవిభూతి
సుముఖత నెసంగు రాజులు సుమ్ము వీరు
వీరిఁ గనుగొనుమా శరన్నీరజాక్షి ! ౧౮౭

కం॥ కరహాటులు మరహాటులు
మెఱయఁగఁ గాంభోజభోజమిత్రసుమిత్రుల్
మఱి కొంకణలెంకణు లన
వరుసం జంట దగుసిరులవారిం గంటే ! ౧౮౮

కం॥ ప్రతివింద్యున్ హృతమాంద్యున్
ధృతినంద్యున్ నృపతివంద్యు దేవప్రస్థ
క్షితిపతి సేనాబిందుం
దతసేనాబృందుఁ గనుము తామరసాక్షీ ! ౧౮౯

కం॥ మాహిష్మతీపురీపతి
హైహయుఁ డవ్యయసమృద్ధి నలరారు గుణ
గ్రాహి యగున్నీలాఖ్యను
దాహృతుఁ డీ భూపరమణి నరయుము రమణీ ! ౧౯౦

కం॥ కుల్యున్ శుభగుణగణసా
కల్యుం గ్రతమద్ర విషయకల్యున్ ధృతనై
ర్మల్యున్ సురపతితుల్యున్
శల్యుం గను మహితహృదయశల్యుం దన్వీ ! ౧౯౧

గీ॥ చారుభూరిక్రియాఢ్యుఁ బాంచాలుఁ జూడు
నవ్యమాధుర్యశాలిఁ బౌండ్రకునిఁ గనుము
సంగతఫలాతివిబుధుఁ గాళింగు నరయు
శివచంద్రుఁ గాశికు నీక్షించు మబల ! ౧౯౨

కం॥ అరయుము కమలాంశభవా
పరమ*భీరగతి సింధుపతిఁ గురుభూతిన్
మఱియును ధరఁగల రాజుల
గరిమలు గను సహజభావకలనన్ లలనా ! ౧౯౩

కం॥ కురుకులులు భూరిముఖ్యులు
గరిమం గను వీరి భరతఖండవిభు డీ
గురుమతి యని కురుపతి సో
దరయుతునిగఁ జూపి శుకము తరుణికి ననియెన్. ౧౯౪

గీ॥ హస్తిపురభర్త యీతండు నిస్తులమగు
నిస్తుల పశస్తి నెసఁగు నో సింహమధ్య
భోగికేతనుఁ డత్యంతభోగి మఱియు
బాగుగాఁ జూడు మీ తేని బర్హివేణి ! ౧౯౫

కం॥ అని వీర లాదియగు న
జ్జనపాలురఁ దెలిపి వారి సౌఖ్యాదులు బే
ర్కొననూఱకున్న సతిఁ గని
చని శుక మవల నొక నృపతిసభఁ గని యచటన్. ౧౯౬

గీ॥ ఏకశతసంఖ్య గల యదువృష్ణిభోజ
మధుదశార్హాదివంశసంభవులఁ జెప్పి

